# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఫిబ్రవరి 1969



సంపుటము : 46 : సంచిక : 2 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1969

# మృగతృష్ణ

శ్రీ కాశూరి హనుమంతరావు

జ్వరం! జ్వరం!
గ్రీష్మకాలం మధ్యాహ్నంలా ఉంది దేహం
వేదన, నీరసం, జాగరణ, లంఘనం.
డాక్టరు సూదిపోట్లు పొడుస్తున్నాడు
ఎన్నో మందులిస్తున్నాడు.
వారం రోజులయింది, పరిస్థితి మెరుగయింది.
అసలిది ప్రమాదకరమైన వ్యాధి కానే కాదు.
మృత్యు భయంలేదు; సామాన్య సంసారిని—
డాక్టరు బిల్లు గురించే భయపడుతున్నాను;
ఆఫీసులో జీతం నష్టమై పోతుందేమో అనే భయపడుతున్నాను.
ఐనా మనస్సు లోలోపల మృత్యు భయంకూడా లేకపోలేదు.
ఏమో! ఎవరు చెప్పగలరు?
ఒకవేళ నేనీ మధ్య వయస్సులో మరణిస్తే
ఐదేళ్ల కోర్సులో చేరిన విద్యార్థి
కారణాంతరాలచేత మూడేళ్లకే విరమించుకుని
నిష్ఫలంగా తిరిగి వచ్చినట్లు
పరిపూర్ణతని పొందని నా జీవితాశయాలూ, కర్తవ్యాలూ, ఆకాంక్షలూ
విఫలములై నా బ్రతుకు నిరర్థకమైతే;
మార్గమధ్యంలో ప్రమాదానికి లోనై
నేలగూలిన వెర్రి విమానంవలె
నా మృతదేహం నేలపై పడితే—
అదంతా నా వ్యక్తిగత విషాదాంతం.
విమానం కూలినప్పుడు దాంతోబాటు ప్రయాణీకులుకూడా మరణించేటట్లు
నా మరణంతో నా కుటుంబమంతా మరణిస్తుంది,
అంటే నిజంగా చచ్చిపోతారనికాదు—

మృత ప్రాయులౌతారు
వాళ్ళుపడేపాట్లు కుక్కలుకూడా పడవు.
వాళ్ల పోషణ భారం ఎక్కడ నెత్తిన పడుతుందో అని
దగ్గర బంధువులుకూడా దూరంగా తొలగిపోతారు:
ఇన్నాళ్ళూ ఎంతో మంచిగా ఉన్న ఇంటాయన
నెలాఖరుకల్లా ఇల్లు ఖాళీ చెయ్యమని ఖచ్చితంగా చెప్పేస్తాడు;
రూపాయి డబ్బులుగాని పావుశేరు బియ్యంగాని ఎవరూ అప్పివ్వరు.
అది వాళ్ల తప్పుకాదు. అది నేటి లోకరీతి.
స్నేహకారుణ్యాలని బలిచక్రవర్తిని వలె అణగద్రొక్కి
డబ్బు త్రివిక్రమునివలె జగత్తునావరించి ఉంది.
పూర్వం పల్లెటూళ్ళలో ఇళ్ళు కాలిపోతే
ఊళ్ళో అంతాచేరి కర్రలు, తాటి కమ్మలు, మన్ను మొదలైనవన్నీ తెచ్చి
వారం రోజులలో ఆ ఇళ్ళని పునర్నిర్మించేవారు,
ఆ కుటుంబాలని ఆదుకొని నిలబెట్టేవారు
ఇప్పుడు మనలో చాలామందికి మనింటి ప్రక్క నెవరుంటున్నారో తెలియదు.
మనం యంత్రాలని నడిపిస్తున్నాం, యంత్రాలు తిరిగి మనల్ని నడిపిస్తున్నాయి.
చంద్రుడి దగ్గరకు హుటాహుటిని చేరుకొంటున్నామనీ
చంద్రుడిలో ఏముందో తెలుసుకుంటున్నామనీ
గర్వపడుతున్నాం. మనల్ని మనం పొగుడుకొంటూ పొంగి పోతున్నాం.
కాని ఈ జీవితానికి గమ్యమేమిటి? జీవిత పరమార్థమేమిటి ?
ఈ ప్రశ్నలు మనకి కలగవు.
మనకి మస్తిష్కాలే తప్ప మనస్సులు లేవు.
విజ్ఞానాన్ని పెంపొందించుకొంటూ జ్ఞానాన్ని కోల్పోతున్నాం.
మృగతృష్ణలో నీళ్ళు త్రాగుతున్నాం.

---



# కాకతీయ మొదటి బేతరాజు - చోళులు

డా. యేడెం గోపాలరెడ్డి

ఆంధ్రదేశ చరిత్రలో కాకతీయుల యుగమొక మహోజ్జ్వల ఘట్టము. ప్రకృతమునం దాంధ్ర భాష వ్యవహారమునగల భూభాగమునంతటిని దమ యొక్క ఏలుబడిలోనికితెచ్చి యాంధ్రభావమున కంకురార్పణ మొనరించిన వారలు కాకతీయులు. ఆంధ్ర రాజులలో వీరలు మిగుల బలవంతులు, స్వకార్య నిర్వహణదక్షులు, యశస్కాములునై యుండిరి. చిరస్మరణీయమగు ప్రాచీనాంధ్ర సామ్రాజ్య వైభవమును బునరుద్ధరించి, మూడు శతాబ్దములపై పర్యంతము ఆంధ్రదేశము నేకచ్ఛత్రాధిపత్యముగ బరిపాలించిన కాకతీయుల చరిత్ర యాంధ్రమహాప్రజల కవశ్య పఠనీయమై యమితోత్సాహ జనకమునై యలరారుచున్నది.

మొదటి బేతరాజు కాకతీయ వంశావళిలో ప్రప్రథముడు, ఈయన క్రీ. శ. 1000 మొదలు క్రీ. శ. 1030 వరకు పరిపాలించినట్లు చారిత్రకుల యభిప్రాయము. ఈయన వేయించిన శాసనము లింతవరకును కనుగొనబడలేదు. కాని అతని మనుమడైన రెండవ బేతరాజు శాసనములలో నొకటైన కాజీపేట శాసనము (క్రీ. శ. 1090) మొదటి బేతరాజును గురించి కొన్ని యమూల్యవిషయముల దెల్పుచున్నది. పై శాసనములలో మొదటి బేతరాజు చోళులతో యుద్ధమొనర్చి విజయలక్ష్మిని చేపట్టినట్లున్నది.[1] కాకతీయ రాజులలో మహాబలీయుడును సాహసోపేతుడునునైన గణపతిదేవమహారాజు వేయించిన పిల్లలమఱ్ఱి (క్రీ. శ. 1202) పాలంపేట (క్రీ. శ. 1213) శాసనములలో తన పూర్వీకులలో నొకడు కాంచీపురముపై దండయాత్ర చేసినట్లును ఆ యుద్ధములో నతని సేనానియగు రేచర్ల బ్రహ్మ లేక బమ్మ పాల్గొనినట్లును ప్రశంసింపబడి యున్నది.[2] ఆచార్య నేలటూరు వెంకటరమణయ్య, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగార్లు పై శాసనములో పేర్కొన్న గణపతిదేవమహారాజు పూర్వీకుడు మొదటి బేతరాజేకాని మరెవ్వరు కాదని నిర్ణయించినారు.[3] ఏది ఎట్లున్నను మొదటి బేతరాజొక సామంతమాండలికుడు మాత్రమే. కాని చోళులు స్వతంత్రులు మహాబలశాలురు. అట్టితరి, బేతరాజు ఇంచుమించు చోళులతో సరితూగు పరాక్రమవంతుడైన రాజు సహాయముతోగాని, లేదా యా రాజు పక్షములోనుండిగాని, చోళులతో యుద్ధ మొనర్చియుండవలయును. అటులైన ఆ రాజెవ్వరు? ఏ వంశస్థుడు? ఎటువంటి పరిస్థితులలో బేతరాజు చోళచక్రవర్తి ప్రత్యర్థి యాయెను? ఈ విషయముల చర్చించుటయే ఈ వ్యాస ముద్దేశ్యము.

ఆచార్య మారేమండ రామారావుగారు మొదటి బేతరాజు తూర్పు చాళుక్యుల సామంతుడైనట్లు, తూర్పు చాళుక్యరాజగు మొదటి శక్తివర్మ తాను బాలకుడుగ నున్నపుడే క్రీ. శ. 999 లో చోళులపై దండయాత్ర చేసినట్లు, ఆ యుద్ధములో మొదటి బేతరాజు శక్తివర్మ పక్షమున నిలచి చోళులతో పోరాడి యుండవచ్చుననియు నభిప్రాయమును వెల్లడించినారు4. కాని, తూర్పుచాళుక్యులయు, చోళులయు

1 Hyderabad Archaeological Series, No. 13, PP. 25 ff.

2. Ibid, No. 13, P. 115; Ibid. No. 3.

3. Yazduni The Early History of Deccan, VII—XI, PP. 577 ff.

4. The Kakatiyas of Warangal, P. 30

పదియవశతాబ్దపు రాజకీయచరిత్రల నొకింత విపులముగ పరిశీలించిన పైన మడివిన యభిప్రాయము సత్యదూర మని తోపక మానదు.

రెండవ భీముని అగ్రసుతుడైన దానార్ణవుడు క్రీ. శ 970-71 లో తూర్పుచాళుక్య సింహాసనము నలంకరించెను. దానార్ణవుని పాలనలో తూర్పు చాళుక్య రాజ్యాధికారములోనికి తొండమండలము, పొత్తపి - 300 వచ్చినట్లు శాసనాధారము లున్నవి[6] తూర్పుచాళుక్యరాజ్యవిస్తరణ చోళులకు కంటక ప్రాయమాయెను. దీని పర్యవసానమే చాళుక్యచోళ యుద్ధము దానార్ణవునికి చోళులకు జరిగిన సంగ్రామములో మొదటి శక్తివర్మ అప్పటికి శైశవ ప్రాయమందున్నను సాహసోపేతముగ తన తండ్రి పక్షమున నిలచి చోళులను జయించెను.[7] ఈ సంఘటన క్రీ. శ. 970 - 73 మధ్య జరిగియుండ వలయును. ఎందులకన దానార్ణవుడు క్రీ. శ. 973లో దివంగతుడాయెను. తదుపరి క్రీ. శ. 973 మొదలు క్రీ. శ. 999—1000 వరకు, ఇరువదియేడు సంవత్సరముల కాలము రాజ్యభ్రష్టుడై క్రీ. శ. 999—1000 లో తూర్పు చాళుక్య సింహాసనము నధిష్ఠించెను. కాబట్టి మొదటిశక్తివర్మ రాజ్యాధి కారమునకు వచ్చునప్పటికి ముప్పదిఐదు సంవత్సర ములకు మించిన ప్రాయముండి వుండవలయును. అటులైన క్రీ. శ 999 లో తూర్పు చాళుక్యులకు చోళులకు, జరిగిన యుద్ధము శక్తివర్మ 'బాల్యక్రీడగ' లేక 'శైశవక్రీడగ' నుగ్గడించుట అసమంజసము. పైగా పదియవ శతాబ్ద అంతము నందును, పదనొకండవ శతాబ్ద ప్రథమభాగము నందును తూర్పుచాళుక్యులకు చోళులకు ఏలాటి యుద్ధములును జరిగినట్లు ఆధారములు లేవు.

దానార్ణవుడు గతించినపిదప తెలుగు చోడ వంశస్థుడైన జటాచోడభీముడు తూర్పుచాళుక్య సామ్రాజ్యముపై దాడిసలిపి దానార్ణవుని సుతులైన మొదటి శక్తివర్మ, విమలాదిత్యుల వోడించి వేంగీ సామ్రాజ్యాధిపతి యాయెను. జటాచోడభీముడు క్రీ. శ. 973—నుండి క్రీ. శ. 999–1000 వరకు రాజ్యపాలనము చేసెను.[8] రాజ్యభ్రష్టులైన శక్తివర్మ విమలాదిత్యులు నిలువనీడలేక తుదకు వతి విస్తారమును అత్యంతవైభవోపేతముగ వలరారుచున్న చోళసామ్రాజ్యమునకు చనిరి. మొదటిరాజరాజ చోళసామ్రాజ్యమును క్రీ. శ. 985 నుండి క్రీ. శ. 1014 వరకు పాలించెను.[9] ఇతడు రాజనీతి చతురుడు, సామ్రాజ్యవిస్తరణాభిలాషి. చోళసామ్రాజ్య విస్తరణకు తూర్పుచాళుక్యుల యండదండ లెంతేని యవసరమని గ్రహించిన రాజరాజు, శక్తివర్మ విమలా దిత్యులకు రక్షణ సదుపాయముల నతియాప్యాయముగ సమకూర్చెను. తదుపరి క్రీ. శ. 999–1000 లో రాజరాజు, శక్తివర్మ విమలాదిత్యుల పక్షము వహించి వేంగిపై దండెత్తి జటాచోడభీముని పరాజితుని గావించి వేంగిసింహాసనముపై శక్తివర్మ నధిష్ఠింప జేసెను.[10] ఈయుద్ధములోజటాచోడభీముని అమాత్యుడైన ఏకవీర యసువులు గోల్పోయెను. మహారాజ, బద్దెనలు (వీరలు బహుశా జటాచోడభీముని సామంతులైనను లేదా మిత్రులైనను కావచ్చును) ఓటమి నంగీకరించి పలాయితులైరి.[11]

శక్తివర్మ రాజరాజులచే పరాజితుడైన జటాచోడ భీముడు ధైర్యము సడలక పట్టుదల విడువక రెండవ మారు వేంగిపై దండెత్తి శక్తివర్మ నోడించి క్రీ. శ. 1001—1002 లో తూర్పుచాళుక్య సామ్రాజ్యము నాక్రమించుకొనియెను.[12] ఇంతటితో

---

5. N. Venkataramanaiah, The Eastern Chalukyas of Vengi, P. 197; రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక (1922), పుట. 22.

6. Journal of Telugu Academy, II, P. 109; Annual Reports on South Indian Epigraphy, A-15 of 1917.

7. N. Venkataramanaiah, Op. cit, P 198.

8 Yazdani Op. cit, P. 486; K. A. N. Sastri, The Colas, I (1935), PP. 217 ff.

9. K. A. N. Sastri, op. cit, P. 198.

10. N. Venkataramanaiah, op. cit, PP. 209 ff.

11. Yazdani, op. cit, P. 487.

12. Ibid, N. Venkataramanaiah, op. cit, PP. 209 ff.

మారకుండక చోళసామ్రాజ్యముపై దండువెడలి కాంచీపురము నాక్రమించుకొనియెను.[13] కాని, రాజరాజు జటాచోడభీముని వెంటనే కాంచీపురమునుండి పారద్రోలి, శక్తివర్మ దుస్థితిగాంచి మనమున నొకింత చింతించి. అపారసైన్యములతో వేంగిపై దండు వెడలెను. ఈ యుద్ధములో రాజరాజు జటాచోడ భీముని హతమార్చి మరల శక్తివర్మను తూర్పు చాళుక్య సింహాసనాధీశునిగ జేసెను. రాజరాజు కాంచీపుర శాసనము వలన పై సంఘటన క్రీ శ. 1001 - 1002 లో జరిగియుండుననని యూహింప వీలగుచున్నది[14] తూర్పుచాళుక్య చోళసామ్రాజ్యముల మధ్య సన్నిహిత సంబంధములు నెలకొల్పుటకై రాజరాజు తన యనుంగు తనయయైన కుండవిని శక్తివర్మ సోదరుండైన విమలాదిత్యునకిచ్చి వివాహ మొనరించెను.[15] కాబట్టి పై నుదాహరించిన చరిత్రాంశములబట్టి తూర్పు చాళుక్యులు చోళులు, శక్తివర్మ రాజరాజుల పరిపాలనలో యేలాటి శత్రుత్వము లేక స్నేహ సంబంధములు గలిగి యుండిరని నిష్కర్షగ దెలియుచున్నది. మరి అట్టి పరిస్థితులలో శక్తివర్మ క్రీ. శ 999 లో చోళులతో యుద్ధ మొనరించుట, ఆ యుద్ధములో కాకతీయుడైన మొదటి బేతరాజు శక్తివర్మ పక్షమున నిలచి చోళుల జయించుట, అసత్యము అనూహ్యము.

కాకతీయ బేతరాజు ఏ సందర్భములో చోళులతో యుద్ధ మొనర్చి విజయలక్ష్మిని చేపట్టెనది కళ్యాణీచాళుక్యుల చరిత్రవలన తెలిసికొనుట కవకాశమున్నది. రాష్ట్రకూట రాజగు మూడవకృష్ణుని (క్రీ. శ. 957—965) మరణాంతరము, వల్లవ విక్రమాదిత్యుని సుతుడైన రెండవ తైలపదేవుడు రాష్ట్రకూట రాజ్యాధికారమునుండి కళ్యాణి చాళుక్య రాజ్యమును విముక్తిజేసి తనవంశ పూర్వవైభవమును పునరుద్ధరింపజేసెను. తైలపదేవుని తదనంతరము అతని అగ్రసుతుడైన సత్యాశ్రయమహారాజు క్రీ. శ 997 సంవత్సరమున రాజ్యాభిషిక్తుడాయెను.[16] ఈ సత్యాశ్రయునికి తూర్పుచాళుక్యరాజగు మొదటి శక్తివర్మ చోళచక్రవర్తియగు మొదటి రాజరాజు సమకాలికులు. కళ్యాణి చాళుక్య సార్వభౌమత్వమును సర్వతోముఖముగ వ్యాప్తిజేయవలయునని సత్యాశ్రయుని యభిలాష రాజరాజ శక్తివర్మల మైత్రి, కుండవీ విమలాదిత్యుల వివాహము, తూర్పుచాళుక్య చోళ సామ్రాజ్య విలీనావకాశము, సత్యాశ్రయునికి తీరని యడ్డంకు లాయెను. శక్తివర్మ రాజరాజుల మైత్రిని, తూర్పుచాళుక్య సామ్రాజ్యములో రాజరాజునకున్న పలుకుబడిని ప్రతిష్ఠలను ధ్వంసము చేయదలపెట్టి, సత్యాశ్రయుడు తన సేనానియగు బాయల నంబిని వేంగిపై దండెత్తి పంపెను. బాయల నంబి సత్యాశ్రయుని యాజ్ఞప్రకారము కళ్యాణినుండి బయలుదేరి కృష్ణానదీతీరమందున్న ధరణికోట, యనమదలను బుగ్గిగావించి. చేబ్రోలుచేరి అచ్చట తన స్కంధవార మేర్పాటు చేసికొనియెను క్రీ శ. 1006 సంవత్సరములో సత్యాశ్రయుడు వేయించిన చేబ్రోలు శాసనము పై విషయముల ధృవీకరించుచున్నయది.[17]

ధరణికోట యనమదల నాశమొనరించుటయు, చేబ్రోలువరకు కళ్యాణీ చాళుక్య సైన్యములు ప్రవేశించుటను రాజరాజు తనయొక్క పరోక్షపు ఓటమిగ దలచి వెంటనే చోళసైన్యములను కర్ణాటదేశ మాక్రమింప బంపెను. రాజరాజు యుద్ధచతురతకు సత్యాశ్రయుడు దిగ్భ్రమచెంది తత్క్షణమే చోళసైన్యముల మార్కొనుటకు సైన్యముల పంపెను. ధార్వారు రాష్ట్రములో హొట్టూరునొద్ద దొరకిన శాసనము వలన చోళరాజు 900,000 సైన్యములతో చాళుక్యుల నెదుర్కొని ఓడించి రట్టపాడిదేశము నాక్రమించుకొన్నట్లు దెలియుచున్నది మరియు చోళ సైనికులు స్త్రీలను బ్రాహ్మణులను పసి

13. Ibid.

14. AR, 1931, Part II, Para. 10; 237, 238 of 1931.

15. Indian Antiquary, XIV, P. 52; Journal of Oriental Institute, XVIII—I, P. 68.

16. Indian Antiquary XXI, PP. 167 ff; Epigraphica Indica, XV, p. 350.

17. AR, 147 of 1897; V. Rangacharyulu, The Topographical List of Inscriptions in the Madras Presidency II. Guntur. No 84; Sewell. Historical Inscriptions of South India, P. 531 N. Venkataramanaiah, op. cit, P. 214.;

భాలురను పంపి పలుఅరాచకములు చేసినట్లుకూడ పై శాసనమునందున్నది.[18] రాజరాజు కళ్యాణిచాళుక్యుల నోడించినట్లు తిరువాలంగాడు తామ్రశాసనమందుగూడ సూచింపబడియున్నది[19] కాని, చోళ శాసనము లెంతగ రాజరాజు చాళుక్యుల నోడించినట్లు ప్రశంసించినను సత్యాశ్రయుని రాజ్యములోని ఏ ఒక్క భాగమును చోళు లాక్రమించుకొన్నట్లు తగు ఆధారములు లేవు. కృష్ణాతుంగభద్రానదుల మధ్యప్రదేశమంతయు, బనవాసి, కొల్లిపాకప్రాంతములు చాళుక్య సత్యాశ్రయుని పాలనక్రింద నుండెను. చోళ సైన్యములు రట్టదేశమును ముట్టడించినపుడు కళ్యాణీ చాళుక్య సైన్యములు తగు ధైర్యసాహసములతో పోరాడి వారిని పారద్రోలినట్లు, తదుపరి చాళుక్య సైన్యములు దక్షిణముగ పయనించి చోళ సామ్రాజ్యములోనికి చొచ్చుకొనిపోయినట్లు చాళుక్య శాసనములు తెల్పుచున్నవి.[20] కాబట్టి కళ్యాణీ చాళుక్యులు చోళులు శత్రువులనియు వారిరువురి మధ్య యుద్ధములు జరిగినట్లు చెప్పుటకు దృఢమైన ఆధారములు పెక్కులున్నవి.

కాకతి బేతరాజు వరంగల్లు సమీపమునగల కొఱవిదేశమున కధిపతి. క్రీ. శ. పదనొకండవ శతాబ్దము మొదటిభాగములో కొఱవిదేశము కళ్యాణీ చాళుక్య సామ్రాజ్యములో నంతర్భాగము మాత్రమే. కావున మొదటి బేతరాజు సత్యాశ్రయునికి సామంతుడుగ కొఱవిదేశమును పాలించుచుండి యుండవచ్చును. సత్యాశ్రయునికి రాజరాజునకు జరిగిన యుద్ధములో బేతరాజు సత్యాశ్రయుని పక్షమున నిలచి చోళులతో పోరాడి విజయలక్ష్మిని వరించియుండవచ్చును. ఈ సంఘటనయే యితని మనుమడైన రెండవ బేతరాజు వేయించిన కాజీపేట శాసనములో (క్రీ శ 1090) ప్రశంసించబడినది. ఇది, బహుశః క్రీ. శ 1006–1008 మధ్యకాలములో జరిగియుండవచ్చును.

కొందరు చారిత్రకులు మొదటిబేతరాజు కళ్యాణీ చాళుక్యరాజగు మొదటి సోమేశ్వరుని పక్షమున నిలచి చోళులతో పోరాడి విజయమును సాధించినట్లు యభిప్రాయమును వెల్లడించినారు.[21] ఇది సత్యదూరము. ఎందులకన మొదటి బేతరాజు క్రీ. శ. 1000 మొదలు క్రీ. శ. 1030 వరకు, మొదటి సోమేశ్వరుడు క్రీ. శ. 1044 నుండి క్రీ. శ. 1068 వరకును పాలించినారు. దీనినిబట్టి మొదటి బేతరాజు, మొదటి సోమేశ్వరుడు సమకాలికులు కారని తేటతెల్లమగుచున్నది.

---

18. Epigraphica Indica, XVI, P. 73; AR, 17 of 1904; J. F. Fleet, The Dynasties of the Kanarese Districts, P. 433.

19. K. A. N. Sastri, op. cit, P. 217.

20. Epigraphica Carnatica, VIII, Sb. 471; AR, 722 of 1922; Sewell, op. cit, P. 62; J. F. Fleet, op. cit, PP. 433 ff.

21. Yazdani, op. cit, P. 578.



# తెలుగులో యుష్మదస్మదర్థకాల చరిత్ర

డా. పి. ఎస్. సుబ్రహ్మణ్యం

తెలుగులో యుష్మదస్మదర్థక[1] సర్వనామాల్ని మిగిలిన[1] ద్రావిడభాషల్లో సమానపదాలతో పోల్చి పరిశీలిస్తే వాటి పరిణామక్రమం మనకి స్పష్టమవుతుంది. ఇంతేకాకుండా తెలుగు ప్రత్యేక భాషగా రూపొందేముందు అది యే ఇతర ద్రావిడ భాషలతో సన్నిహిత సంబంధం కలిగి ఉండేదో కూడా యీ పరిశోధన స్పష్టం చేస్తుంది. (కుండలీకరణంలో ఉన్నవి ఔపవిభక్తిక రూపాలు.)

## అస్మదర్థకైకవచనం
(D E D 4234)

త. యాన్, నాన్ (ఎన్—)
మ. ఞాన్ (ఎన్—)
కో. ఆన్ (ఎన్—)
తొ. ఓన్ (ఎన్—)
క. ఆన్. (ఎన్—)
నాను (నన్—)
కొ. నా(ను) (ఎన్—, నన్—, నా)
తు. యాను, ఏను (ఎ న)
తె. ఏను, నేను (నన్ —, నా)

గోం. అనా, నన్నా (నా—)
కొం. నాన్ (నాన్ )
పెం. ఆన్, ఆనెజ్ (నా—)
మం. ఆన్.
కూ. ఆను, నాను (నా—)
కువి. నాను (నా—)
కో. నా. ప. గ ఆన్ ( న్—)
కు. మా. ఏన్ (ఎంగ్—)
బ్రా. ఈ (కన్—)
మూ. ద్రా. * యాన్ (* యన్—)

## అస్మదర్థక బహువచనం
(D E D 4231)

త. యామ్ (ఎమ్—)
నాంకళ్
యాంకళ్ (ఎంకళ్—)
మ. ఞాఙ్ఙళ్ (ఞఙ్ఙళ్—, ఎఙ్ఙళ్—)
కో. ఆమ్ (ఎమ్—)
తొ. ఎమ్ (ఎమ్—)
క. ఆమ్ (ఎమ్—)
కొ. ఎంగ (ఎంగ—)
నంగ (నంగ—)
తు. ఎంకుళు
తె. ఏము, మేము (మమ్—, మా)

గోం. అమ్మెట్, మమాట్, మమ్మొ, మరాట్ (మా—)
కొం. మాన్, మాప్ (మా—)
కూ. ఆము, మాము, ఆజు 'మనం' (మా—)
కువి. మాంబు, మాఁో 'మనం' (మా—)
కో. నా. ప. గ. అమ్ (అమ్—)
కు. మా. ఏమ్ (ఎమ్—)
మూ. ద్రా. * యామ్ (* యమ్—)

## ఉభయార్థకం
(D E D 3019)

త. నామ్ (నమ్—)
(నాంకళ్ 'మేం')
మ. నామ్ (నమ్—)

కో. అమ్ (అమ్ —)
తొ. ఒమ్ (ఒమ్)
క. నావు (నమ్ –)
తు. నమ
తె. మనము (మన)
కో. నేండ్
నా. నేండ్, నేమ్
గోం. నమొట్
కు. మా. నామ్ (నమ్ —)
బ్రా. నన్ 'మేం, మనం'
మూ. ద్రా. *నామ్ (*నమ్ —)

## యుష్మదర్థకైకవచనం
(D E D 3051)

త. నీ (ప్రా. నిన్ –, ఆ. ఉన్—)
మ. నీ (నిన్—)
కో. నీ (నిన్—)
తొ. నీ (నిన్—)
క. నీను (నిన్—)
కొ. నీ(ను) (నిన్—,నీ)
తు. ఈ (నిన్, –ఇన్—)
తె. నీవు, ఈవు (నిన్—, నీ—)
గోం. ఇమ్మా, నిమ్మె (నీ—)
కొం. నీన్ (నీ—)
పెం. ఏన్, ఏనెఞ్ (నీ—)
మం. ఈన్
కూ. ఈను, నీను (నీ—)
కువి. నీను (నీ—)
కో. నా. నీవ్ (ఇన్—)
నా. (ఛాం) ఈవ్, నీవ్ (ఇన్—)
ప గ. ఈన్ (ఇన్—)
కు. మా. నీన్ (నిఙ్—)
బ్రా. నీ
మూ. ద్రా. *నీ(న్) (*నిన్—)

## యుష్మదర్థక బహువచనం
(D E D 3055)

త. నీమ్, నీర్, నీయిర్, నింగళ్ (ప్రా. నుమ్, ఆ. ఉమ్—, ఉంకళ్—)
మ. ని ళ్ (న్ఞళ్—)
కో. నీమ్ (నిమ్—)
తొ. నుమ్ (నుమ్—)
క. నీమ్, నీవు (నిమ్—)
కొ. నింగ (నింగ—)
తు. ఈరు, నికులు, నింక్లు
తె. ఈరు, మీరు (మిమ్—, మీ)
గోం. ఇమ్మట్, నిమెట్, మిరాట్ (మీ—)
కొం. మీరు
పెం. ఏప్, ఏపెజ్ (వీ—)
మం. ఈమ్
కూ. ఈరు, మీరు (మీ—)
కువి మింబు (మీ—)
కో. నా. నిర్ (ఇమ్—)
నా (ఛాం.), ఈమ్ట్ (ఇమ్—)
ప. గ. ఈమ్ (ఇమ్—)
కు. మా. నీమ్ (నిఘ్—)
బ్రా. నుమ్ (నుమ్—)
మూ. ద్రా. *నీమ్ (*నిమ్—)

## తులనాత్మక చర్చ:

### అస్మదర్థకైకవచనం

అన్నిద్రావిడభాషల్లోని అస్మదర్థకైకవచన రూపాలు మూలద్రావిడం *యాన్ నించి పుట్టినవిగా చెప్పవచ్చు ప్రాచీనతమిళంలో య కారాదులైన పదాలు సుమారు పది ఉన్నాయి. వీటి అన్నింటిలోను ఇంకా య కారం మధ్యకాలతమిళంలోనూ, మిగిలిన దక్షిణద్రావిడభాషల్లోనూ నశించి ఇవి 'ఆ' కారాదులుగా మారిపోతాయి. ఈ పదాలన్నింటిలోనూ 'య' కారం తరవాత అచ్చు దీర్ఘ 'ఆ' కారమే అనే విషయం గమనించదగ్గది. తొల్కాప్పియంలో కూడా పదాది య కారం తరవాత

'ఆ' కారమేగాని వేరు ఏ అచ్చూ రాదనే విషయం చెప్పబడింది. ఈ 'యా' తెలుగులోనూ (తుళు) కురుఖ్, మాల్తొలలోనూ 'ఏ' గా మారుతుంది. ఈ మార్పుకి ఇతర ఉదాహరణలు కూడా ఉన్నాయి:

| త. | తె. | కు. | మా |
|---|---|---|---|
| యాంటు, ఆంటు | ఏఁడు | — | — |
| యాటు, ఆటు | ఏడిక | ఏడా | ఏడె |
| యాఱు, ఆఱు | ఏఱు | — | — |

ఈ మార్పు ననుసరించి *యాన్ ఈ మూడు భాషల్లోనూ ఏను ((ఏన్)గా మారింది. బ్రాహూయీ 'ఈ' ఏన్ నించి వచ్చిందిగా చెప్పవచ్చు. మిగిలిన మధ్యద్రావిడభాష లన్నింటిలోనూ 'యా' ఆ గా మారుతుంది. తొద భాషలో మూల ఆ కారం ఓ గా మారడం కూడా సర్వసాధారణమే.

ఉదా.

| త. | తె. | తొ. |
|---|---|---|
| కాల్ | కాలు | కోల్ |
| నాన్కు | నాలుగు | నోన్ |
| నాటు | నాడు | నోడ్ |

తమిళ కన్నడ కొడగు భాషల్లో నకారాదులైన రూపాలకీ, మలయాళ రూపానికీ చారిత్రక వివరణ అస్మదర్థక బహువచనం, ఉభయార్థకాల కింద ఇవ్వబడుతుంది.

ఇక దీని ఔపవిభక్తికరూపాన్ని గురించి చర్చిద్దాం. సర్వసాధారణంగా ఈ యుష్మదస్మదర్థక సర్వనామాల్లోనూ, ఆత్మార్థకసర్వనామాల్లోనూ ఉన్న దీర్ఘాచ్చు వాటి ఔపవిభక్తిక రూపాల్లో హ్రస్వమవుతుంది. ఉదా: త. తాన్, తె. తాను: చతుర్థి త. తనక్కు, తె తనకు. ఇటువంటి మార్పుకి కారణం వీటి తరవాత వచ్చే విభక్తి ప్రత్యయాలు మొదట్లో అజాదులై యుండడమే. అజాది ప్రత్యయాలు పరమైనప్పుడు ధాతువులో దీర్ఘాచ్చు హ్రస్వంగా మారడం ద్రావిడభాషల్లో సుప్రసిద్ధం. ఉదా. మ చేఱు క కేఱు, తె. చెరుగు ఈ మార్పు ననుసరించి మూ. ద్రా *యాన్ ఔపవిభక్తిక రూపం *యన్ అయి ఉండాలి ఈ*యన్ యథాతథంగా ఏ భాషలోనూ నిలవకపోయినా అన్ని ద్రావిడ భాషల్లో ఔపవిభక్తిక రూపాలూ దీన్నించి పుట్టినవే అని సులభంగా నిరూపించవచ్చు. దీనిలో యకారం ద్రావిడ భాషల్లో వర్ణనిర్మాణానికి (Phonological Structure) విరుద్ధం. ఎందువల్లనంటే ద్రావిడ భాషల్లో పదాది య కారం తరవాత దీర్ఘ ఆ కారమే తప్ప మరి ఏ అచ్చూ ఉండడానికి వీలులేదు. కాబట్టి 'య' దక్షిణోత్తరద్రావిడ భాషల్లో ఎ గానూ, మధ్యద్రావిడభాషల్లో 'అ'గానూ మారి, మూ.ద్రా. *యన్ మొదటి వాటిలో ఎన్ గానూ రెండో వాటిలో అన్ గానూ మారిపోయింది. కురుఖ్ మాల్తొల ఔపవిభక్తికరూపంలో గకారం మొదట్లో చతుర్థీవిభక్తి ప్రత్యయమని తోస్తుంది. తమిళం ఎనక్కు 'నాకు'లో అపదాద్యచ్చులు లోపించి క కారం గ కారంగా మారడంవల్ల కురుఖ్, మాల్తొ 'ఎంగ్' వచ్చిందని చెప్పవచ్చు బ్రాహూయీ కన్—కూడా ఎనక్కులో క కారం పదాదికి రావడంవల్ల, ఎకారం అకారంగా మారడంవల్లా (ఇది నియమబద్ధమైన మార్పే, ఉదా త. ఎలి, తె. ఎలుక: బ్రా. అల్) వచ్చిందని చెప్పవచ్చు కాబట్టి ఈ మూడు ఉత్తర ద్రావిడభాషలూ ఒకేభాషగా ఉన్నకాలంలో మూల ద్రావిడంలో చతుర్థీవిభక్తిరూపం ఔపవిభక్తిక రూపంగా వాడబడడం మొదలయింది అని ఊహించవచ్చు

మూ. ద్రా. *యన్ మధ్యద్రావిడభాషల్లో అన్‌గా మారిందని పైని చూశాం ఇది కోలామీ—పర్జి (నాయకీ, గదబ)భాషల్లో యథాతథంగానే నిలిచింది. కాని మిగిలిన మధ్యద్రావిడభాషల్లో అంటే తెలుగు, గోండీ, కొండ, పెంగో, మండ, కూయి, కువి (వీటిని సంగ్రహంగా తెలుగు—కూయిభాషలని వ్యవహరిద్దాం.) లలో ఇది వర్ణవ్యత్యయం (Metathesis) పొంది నకారం పదాదికివచ్చి 'నా' గా మారిపోయింది తెలుగు 'నాకు'ని తమిళం 'ఎనక్కు'తో పోలిస్తే ఈ మార్పు సులభంగా అవగాహన అవుతుంది ఈ రెండిటికీ మూలరూపం *యనక్కు. ఇది తెలుగుకి ముందుకాలంలో '*అనక్కు'గా మారి తరవాత వర్ణవ్యత్యయంవల్ల 'నాకు'గా మారింది. ఈ వర్ణవ్యత్యయం పైన చెప్పిన అన్నిభాషల్లోనూ ఉండడంవల్ల ఈ మార్పు ఈ భాషలన్నీ ఏకభాషగా ఉన్న ప్రాచీనకాలంలో జరిగిందని మనం ఊహించవచ్చు. చతుర్థీవిభక్తిరూపమే అన్నిద్రావిడ భాషల్లోనూ సమానంగా ఉండడంవల్ల అదే విభక్తు

అన్నింటిలోకీ ప్రాచీనమైనది. దీనిలో 'నా' రూపమే ద్వితీయ తప్ప మిగిలిన అన్నిఔపవిభక్తులకీ ప్రాతిపదిక అయింది. ద్వితీయావిభక్తి నన్నున్, ననున్‌లో పదాది న కారం వర్ణవ్యత్యయంవల్ల సిద్ధించిన 'నాకు' అనే దాని సామ్యంవల్ల చేర్చబడిందని చెప్పవచ్చు.

ఇక యీ తెలుగు-కూయి భాషల్లో మరొక ప్రత్యేకత ఏమిటంటే వాటిలో కొన్నింటిలో నామవాచకరూపాలు నకారాదులుగా ఉన్నాయి. తెలుగు, గోండీ, కూయిభాషల్లో అజాదిరూపం, నకారాది రూపం రెండూ ఉంటే కొండ, కువిలలో నకారాది రూపాలు, పెంగొ, మండలలో అజాదిరూపాలు మాత్రమే ఉన్నాయి. వీటిలో అజాదిరూపాలే ప్రాచీనమైనవని పై చర్చ స్పష్టం చేస్తుంది. ఇంతే కాకుండా నన్నయభారతంలో ఏను రూపమే బహుళంగా ఉండి నేను రూపం చాలా కొద్దిచోట్ల మాత్రమే కనుపడుతుంది. కాబట్టి యీ నకారాదిరూపాలు పర వ్యత్యయంవల్ల నకారంతో మొదలయ్యే ఔప విభక్తికరూపం ప్రభావంవల్ల ఏర్పడ్డవని మనం సులభంగా ఊహించవచ్చు. అంటే తెలుగులో ప్రాచీనమైన ఏను ఔపవిభక్తికరూపమైన 'నా' ప్రభావం వల్ల నకారాన్ని మొదట చేర్చుకొని నేనుగా మారి పోయిందన్నమాట. గోండి కూయిలలోకూడా ఇటువంటి మార్పువల్లే నకారాది రూపాలు కొన్నిమాండలికాల్లో మాత్రమే ఏర్పడ్డాయి. కొండ, కువిలలో యీ మార్పు సర్వత్ర జరిగి అజాది రూపాలు నశించి నకారాది రూపాలు మాత్రమే మిగిలాయి. పెంగొ, మండలలో ఇటువంటి మార్పు జరగక అజాది రూపాలే నేటికీ నిలిచి ఉన్నాయి గోండీలో పదాద్యచ్చు హ్రస్వమవడానికి కారణం తరవాత చేరిన ఆ కారం అని చెప్పవచ్చు.

## అస్మదర్థక బహువచనం

అన్ని ద్రావిడ భాషల్లోని అస్మదర్థక బహు వచన రూపాలూ మూ. ద్రా. *యామ్ నించి జన్మించి నట్లుగా నిరూపించవచ్చు. దీనిలో 'యా' తెలుగు, కురుఖ్ మాల్తోలలో 'ఏ' గానూ, మిగిలిన అన్నిభాషల్లోనూ (ప్రాచీన తమిళంతప్ప) 'ఆ' గానూ మారింది. (ఈ మార్పు*యాన్‌లో జరిగిన మార్పువంటిదే.) తమిళంలో వాంకళ్, యాంకళ్, నావ్, యావ్ రూపాలకి బహువచనప్రత్యయమైన కళ్ చేర్చటంవల్ల ఏర్పడినవి. తమిళసాహిత్యంలో యాంకళ్ మొట్ట మొదట చిలప్పతికారం (11:161) అనే గ్రంథంలో కనపడుతుంది. ఇది చేరరాజ్యం (ఇప్పటి కేరళ)లో వ్రాయబడిన గ్రంథం. కాబట్టి యీ గ్రంథం కాలంలో (3–4 శతాబ్దులు) ఉన్న యాంకళ్ రూపమే ఇప్పటి మలయాళంలో ఞాఙ్ఙళ్ గా మారిందని ఊహించ వచ్చు. 'ంక' ఙ్ఙగా మారడం మలయాళంలో సర్వ సాధారణం. ఈ కంఠ్యానునాసికం ప్రభావంవల్ల పదాది య కారంకూడా అనునాసికమై, ఞ కారంగా మారిందన్నమాట. ఈ ఞాఙ్ఙళ్ రూపానికి అను గుణంగా మలయాళంలో అస్మదర్థకైకవచనరూపం ఞాన్ సృష్టించబడింది. ఈ సందర్భంలో మలయాళ శాసనాల్లో ఎక్కడా ఞాన్ రూపమేలేదనీ మలయాళగ్రంథాల్లో మాత్రమే పన్నెండో శతాబ్ది నించి ఞాన్ రూపం కనపడుతోందనే విషయం మనం గుర్తించాలి. అంతకుముందు శాసనాల్లో నాన్ రూపమే ఉండేది. ఇది మధ్యకాలతమిళరూపంతో సమానం. గోండీలో ఆమ్ అనే పురాతన గోండీరూపం అట్/ఆట్ అనే ఒక కొత్త బహువచన ప్రత్యయం చేరడంవల్ల ధాత్వచ్చు హ్రస్వమై అమ్మట్ అనే రూపం సిద్ధించింది.

దీని ఔపవిభక్తికరూపం మూలద్రావిడంలో *యమ్ ఇది దక్షిణోత్తరద్రావిడభాషల్లో ఎమ్ గానూ మధ్యద్రావిడభాషల్లో అమ్‌గానూ మారింది. మధ్యకాలతమిళం, మలయాళం, కొడగుల్లో ఎమ్‌కి నామవాచకాల్లో బహువచనప్రత్యయమైన కళ్ చేరి ఎంకళ్ రూపం ఏర్పడింది మలయాళంలో 'ంక' ఙ్ఙగా మారుతుంది. ఆధునికతమిళంలో అనేకాచ్చపదాల్లో చివర ళ కారం లోపిస్తూ ఉంటుంది. కాబట్టి ఎంకళ్ వ్యవహారంలో ఎంగ అని ఉచ్చరిస్తారు. కొడగులో ఎంగకూడ ఇటువంటి అంత్య ళ కారం లోపంవల్లే ఏర్పడిందని చెప్పవచ్చు. కొడగులో రెండో రూపం నంగ అనేది *నాంగళ్ యొక్క ఔపవిభక్తిక రూపం అయితే కొడగులో నామవాచక రూపాలు ఔపవిభక్తికరూపాలతో సమానంగానే ఉన్నాయి. కాని చారిత్రకంగాచూస్తే ఎంగ కి సంబంధించిన నామవాచకరూపం *ఎంగళ్ (<*యాంకళ్)

వంగకి సంబంధించిన నామవాచకరూపం *వాంగిళ్ (<*నాంకళ్) అయివుండాలి. చారిత్రకంగా ఉండవలసిన ఈ రూపాలకి బదులు ఔపవిభక్తికరూపాలే వాటి స్థానాన్ని ఆక్రమించాయని చెప్పాలి. తోద భాషలోకూడా ఇటువంటి మార్పే జరిగింది. దీంట్లో నామవాచక రూపం ఒక కాలంలో కోత లోకి మళ్లే ఆమ్ అయివుండాలి. కాని ఇది నశించి దాని స్థానం ఔపవిభక్తికరూపం ఆక్రమించుకుంది. తమిళ, మలయాళ, కొడగుభాషల్లో అస్మదర్థక బహువచన రూపానికితరవాత ఇంకొక బహువచనప్రత్యయం కళ్ చేరడంవల్ల యీ మూడుభాషలూ చాలా సన్నిహిత సంబంధం గలవని స్పష్టపడుతోంది. మలయాళం ఞజ్ఞళ్ ఞాజ్ఞళ్‌నించి సామ్యంమూలంగా సృష్టించబడిన రూపం.

ఇంక మధ్యద్రావిడంలో ఔపవిభక్తికరూపం అమ్—కోలామి—పర్జిభాషల్లో అల్లాగే నిలిచింది. కాని మిగిలిన భాషల్లో అది వర్ణవ్యత్యయం పొంది 'మా'గా మారింది. తమిళంలో దీని చతుర్థీవిభక్తి రూపం ఎమక్కు: తెలుగు మాకు, గోండీ మాక్ (* <అమక్కు). వీటన్నింటికీ మూలరూపం యమక్కు. తెలుగులో ద్వితీయావిభక్తిరూపం మమున్, మమ్మున్‌లో పదాది మ కారం 'మాకు' ప్రభావంవల్ల చేర్చబడిందని చెప్పవచ్చు. వర్ణవ్యత్యయంవల్ల సిద్ధించిన ఈ మా అనే ఔపవిభక్తికరూపం ఈ భాషలు కొన్నింటిలో నామవాచకరూపాల్ని 'మ'కారాదులుగా మార్చింది. వీటిలో అజాదిరూపాలే ప్రాచీనమైనవని మిగిలినభాషల్లో అజాదిరూపాలు ధ్రువపరుస్తాయి. అంతేకాకుండా తెలుగుసాహిత్యంలో ఏము మేముకన్న ప్రాచీనం. కాబట్టి ఏము ఔపవిభక్తికరూపమైన 'మా' ప్రభావంవల్ల ఒక మకారం మొదట చేర్చుకొని మేముగా మారిందన్నమాట. ఇటువంటి మార్పు గోండీ, కూయి లలో కొన్ని మాండలికాల్లో మాత్రమే జరిగితే కొండ, కువి లలో సర్వత్రా జరిగింది. మూలరూపమైన ఆమ్ చివర ఒక ఓష్ఠ్యస్పర్శం, ఉకారం చేరి 'అంబు అయి అది ఔపవిభక్తికరూపం సామ్యంవల్ల 'మాంబు' అయి ఉంది. ఇందులో 'ంబు'ప్ గా మారడంవల్ల కొండకువిలో మాప్ సిద్ధించింది. కొండ మాన్ లో న కారం ఆ భాషలో ఏకవచనరూపమైన నాన్ ప్రభావంవల్ల వచ్చింది. గోండి 'మరాట్' మిరాట్‌నించి సామ్యంవల్ల ఏర్పడింది. (మిరాట్ చరిత్రకి కింద చూడండి.) కూయి కువి లలో ఆజా, మాపొ అనే కొత్త ఉభయార్థకాలు సృష్టించబడ్డాయి. వీటి మూలరూపం *ఆర్ అని చెప్పవచ్చు. రేఫ కొన్ని సందర్భాల్లో కూయిలో జకారంగా మారుతుంది. కువి లో పదాది మకారం మాంబు ప్రభావంవల్ల చేరింది అనవచ్చు. కూయి కువి భాషలు అతిసన్నిహిత సంబంధంగల భాషలు అని చెప్పడానికి ఈ ఉభయార్థక సృష్టి చాలా మంచి ఉదాహరణ.

## ఉభయార్థకం

పైన ఇచ్చిన ఉభయార్థక రూపాలన్నీ మూ. ద్రా. *నమ్‌నించి వచ్చినవే. అయితే కన్నడం, బ్రాహూయీలలో ఇది 'మనం' అనే అర్థాన్నేకాక 'మేం' అనే అర్థాన్నికూడా సూచిస్తుంది. కాని అతి ప్రాచీనకన్నడంలో ఇది ఉభయార్థకం మాత్రమే అని చెప్పడానికి ఆధారాలున్నాయి. మధ్యకాల తమిళంలో యామ్ రూపం నశించడంవల్ల దానికి బదులు ఉభయార్థకానికి కళ్ బహువచనప్రత్యయం చేర్చగా కలిగిన నాంకళ్ రూపం అస్మదర్థక బహువచనంగా వ్యాప్తిలోకి వచ్చింది. కన్నడంలో నామ్ కి ఉచ్చారణార్థకమైన ఉ కారంచేరి నాము అనగా అచ్చుల మధ్య అద్విరుక్తమకారం ఆభాషలో వ కారమవుతుంది కాబట్టి నావు రూపం సిద్ధించింది. కోలామీ, నాయకీలలో నేండ్ కి ప్రాచీనరూపం నేమ్ అయి ఉండాలి. దీని చివరి డకారం ఒక కొత్త బహువచన ప్రత్యయం (దీని రూపాంతరం అట్/ఒట్) గోండీ బహువచన సర్వనామాలు అన్నింటిలోనూ కనిపిస్తోంది). గోండీ నమొట్ నామ్‌కి యీ కొత్త బహువచన ప్రత్యయం ఒట్ చేరగా అద్యచ్చు హ్రస్వమై సిద్ధించిన రూపం. (ఇది గోండీలో ఒక మాండలికంలోనే ఉంది.)

దీని ఔపవిభక్తికరూపం దీర్ఘాచ్చు హ్రస్వం కావడంవల్ల సిద్ధించిన నమ్-బ్రాహూయీ 'నన్' మొదట్లో యీ ఔపవిభక్తికరూపంనించి సిద్ధించినదే అయి ఉండాలి. బ్రాహూయీలో ఉండవలసిన మ కారం స్థానంలో న కారం ఉండడం ఇందులో అస్మదర్థకైకవచనం ఔపవిభక్తికరూపం కన్—

ప్రభావంవల్ల కావచ్చు తెలుగులో మిగిలిన సర్వ నామాల ఔపవిభక్తికరూపాలకిమల్లేనే నమ్ కూడా వర్ణవ్యత్యయంపొంది 'మన'గా మారింది. తెలుగు 'మనకు'ని తమిళం 'నమక్కు'తో పోలిస్తే యీ విషయం స్పష్టమవుతుంది నమ్ 'మన'గా మారినతరవాత దీనికి బహువచనార్థకమైన 'మ్' ప్రత్యయం చివరచేర్చి 'మనము' అనే నామవాచక రూపం సృష్టించబడింది (దీనిలో చివర ఉకారం ఉచ్చారణార్థం) తుళు'నమ'కూడా ఇల్లాగే మొదట్లో ఔపవిభక్తికరూపమే అయిఉండాలి. తొద లో కొన్ని మాటల్లో అకారం ఒ కారంగా మారుతుంది కాబట్టి ఒమ్-అమ్ నించి వచ్చిందని చెప్పవచ్చు ఈ తొద, కోతలరూపాల్లో పదాది న కారం లోపించిందని అను కోవాలి ఈ పదాది నకార లోపానికి వీటిలో అజాదు లైన అస్మదర్థక సర్వనామాలు కూడా తోడ్పడ్డా యని ఊహించనచ్చు. కోత నామవాచకరూపం అమ్, నామ్ నించి యీ విధంగా పరిణమించింది. కాని తొదలో ఔపవిభక్తికరూపమే నామవాచకం స్థానాన్ని కూడా ఆక్రమించుకుంది.

ఈ ఉభయార్థకరూపంలో ఆ కారానికి బదులుగా కోలామీ-నాయకీలలో ఏ కారం ఉండడానికి కారణం ఇప్పటిదాకా తెలియలేదు. శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు (Dravidian Personal Pronouns, Studies in Indian Linguistics, Annamalainagar and Poona, 1968, 189—205) దీనిని సమర్థించడానికి మూల ద్రావిడంలో ఉభయార్థకరూపం నామ్‌కాక ఞామ్ అయిఉండాలని అన్నారు. (పేజీ 194). కాని మూ. ద్రా. యీ రూపం *ఞామ్ అయితే దీనిలో ఞకారం ప్రాచీనతమిళంలోనూ, మలయాళంలోనూ నిలిచిఉండాలి. కాని యీ రెండు భాషల్లోనూ యీ రూపంలో నకారమే ఉండడంవల్ల యీ వివరణ సమర్థనీయం కాదని చెప్పాలి. ప్రాచీనాంధ్రంలో 'నేము' అనేది 'మనం' అనే అర్థంలో ఉపయోగించబడిందిఅనే విషయం కూడా సందేహాస్పదమే.

ఇక తమిళ, కన్నడ, కొడగు భాషల్లో నకారాదులైన అస్మదర్థకైకవచనరూపాలకి చారిత్రక వివరణ ఇప్పుడు సులభంగా చెప్పవచ్చు. తమిళంలో నాన్ యాన్ కంటె, కన్నడంలో నాను ఆన్ కంటె అర్వాచీనాలని ఆ భాషల్లో గ్రంథాలవల్ల మనకి తెలుస్తుంది. ఇవి ఆ భాషల్లో నకారాదులైన బహు వచన రూపాలసామ్యంవల్ల పుట్టినవి తమిళంలో మధ్యకాలంలో యామ్ నశించి దానికి బదులు నాంకళ్ వ్యాప్తిలోకి వచ్చింది. అల్లాగే కన్నడంలో మొదట ఉభయార్థకరూపమైన నావు తరవాతకాలంలో 'మేము, మనం' అనే రెండు అర్థాల్లోనూ కూడా వ్యాప్తిలోకివచ్చి ఆమ్ రూపం నశించేటట్లు చేసింది. కాబట్టి కొత్తగా వ్యాప్తిలోకి వచ్చిన నకారాదులైన బహువచనరూపాలసామ్యంవల్ల యీ భాషల్లో ఏకవచనరూపాలుకూడా నకారాదులుగామారిపోయాయి. మలయాళం ఞాన్ ఞాఙళ్ (<*యాంకళ్) సామ్యంవల్ల పుట్టినట్లు ఇంతకుముందే చూశాము. ఈ నకారాది రూపాలకి యీ వివరణ కాల్డ్వెల్ మొదట చెప్పినట్లు ప్రొఫెసర్ బరో (Initial y and $\overset{n}{n}$ in Dravidian, BSOAS XI (1943—46), Reprinted in Collected Papers on Dravidian Linguistics, Annamalai University, 1968 (PP. 115—18.) వ్రాశారు. తెలుగు-కూయిభాషల్లో నకారాదిరూపాల వివరణ వేరువిధంగా ఇంతకుముందే ఇచ్చాము.

## యుష్మదర్థకైకవచనం

అన్నిద్రావిడభాషల్లో యుష్మదర్థకైకవచన రూపాలూ మూ. ద్రా. *నీన్ నించి పుట్టినవి. ఇందులో చివరి నకారం తమిళం, మలయాళం, కోత, తొద, (కొడగు), తుళు, తెలుగు, బ్రాహుయీలలో లోపించింది. ఈ భాషలు మూడు ఉప కుటుంబాలకి చెందినవి కాబట్టి యీ మార్పు మూల ద్రావిడంలోనే ప్రారంభమై ఉండాలి. కాని యీ చివరి నకారం ఏకవచనాన్ని సూచించే ప్రత్యయం కాబట్టి ఇది మొట్టమొదట దీనిలో ఉండిఉండాలి అనడంలో సందేహంలేదు తుళులోనూ, అన్నిమధ్యద్రావిడ భాషల మూలరూపంలోనూ యుష్మదర్థక సర్వ నామాలు రెండిటిలోనూ పదాది నకారం కూడా లోపించింది. తుళు 'ఈ' నీన్ నించి ఆద్యంత నకారాలు రెండూ లోపించడంవల్ల ఏర్పడింది. తెలుగు ఈవుకూడా తుళులోలాగే నీన్‌లో ఆద్యంతనకారాలు లోపించగా మిగిలిన 'ఈ'నించి వచ్చిందే. కాని దీనిలో

చివర 'వు' కారం చేరడానికి కారణం ఇంతవరకూ ఎవ్వరూ చెప్పలేదు. తెలుగుపదాల్లో వర్ణసముదాయ నిర్మాణాన్ని పరిశీలిస్తే దీనికి చక్కటి కారణం మనకి తెలుస్తుంది. తెలుగులో ఏకాచ్క పదాలు సాధారణంగా ఉండవు. మూలభాషలోఉన్న ఏకాచ్కపదాలన్నీ తెలుగులో చివర వుకారాన్ని చేర్చుకుంటాయి. ఉదా త. ఆ; ఆవు, త. పూ; తె. పూవు (శ్రీనాథుని కాశీఖండంలో పూ అనే ప్రాచీన రూపమే ఈ వుకారంలేకుండా మనకి కనపడుతుంది): ఇదేవిధంగా పురాతనాంధ్రంలో 'ఈ' 'ఈవు'గా ప్రాచీనాంధ్రంలో మారింది. కోలామీ–నాయకీ నీవ్, నాయకీ (ఛాందా) ఈవ్‌లలో చివర వకారం ఉండడంవల్ల ఇవి తెలుగునించి ఎరువు తెచ్చుకున్నవని స్పష్టమవుతుంది. ఈ భాషల్లో తెలుగునించి వచ్చిన పదాలు అనేకం ఉన్నాయి. ఇవి పర్జీ–గదబ లకి సన్నిహితమైనవి కావడంవల్ల ఈ పదాలు ఎరువు తెచ్చుకోకముందు వీటిలోకూడా ఈన్ అనే రూపమే ఉండేదని ఊహించవచ్చు పెంగోలో 'ఈ' 'ఏ' గా మారి ప్రాచీనమైన ఈన్ ఏన్‌గా మారింది. గోండీ రూపాలకి వివరణ కింద ఇవ్వబడుతుంది.

దీని ఔపవిభక్తికరూపం మూలద్రావిడంలో *నిన్–. ఇది అదేరూపంలో దక్షిణద్రావిడభాషలన్నింటిలోనూ నిలిచిఉంది. (ఆధునిక తమిళంలో ఉన్–వివరణకి కింద చూడండి.) కురుఖ్–మాల్తో నింగ్,–నినక్కు అనే చతుర్థీవిభక్తిరూపం నించి వచ్చింది కాబట్టి వీటిలో కూడా నిన్–నిలిచిందనే చెప్పాలి. ఇక మధ్యద్రావిడభాషలన్నింటిలోనూ *నిన్–లో ఆదినకారంలోపించి అది ఇన్–గా మారింది. ఇది కోలామీ—పర్జీలో అల్లాగే ఉంది ఇక్కడ కోలామీ, నాయకీలు నామవాచకరూపాల్ని తెలుగునించి ఎరువు తెచ్చుకున్నా, పాతఔపవిభక్తికరూపాల్నే నిలుపుకున్నాయనే విశేషం మనం గుర్తించాలి. తెలుగు కూయిభాషల్లో ఇన్–వర్ణవ్యత్యయం పొంది నిగా మారింది. తెలుగు ద్వితీయావిభక్తిలోమాత్రం ఇన్–తరవాత అకారం లేకపోవడంవల్ల వర్ణవ్యత్యయం పొందక, 'నీ' ప్రభావంవల్ల మొదట నకారం చేర్చుకొని, నినున్, నిన్నున్ అనే రూపాలు పొందింది. తెలుగు నీకు ( < *ఇనక్కు < *నినక్కు )నించి 'నీ' మిగిలిన విభక్తులకి (ద్వితీయతప్ప) వ్యాప్తి చెందింది. ఈ వర్ణవ్యత్యయం తెలుగు, గోండీ, కొండ, పెంగో, (మండ), కూయి, కువి లలో కనపడటంవల్ల ఇవన్నీ ఒకభాషగా ఉన్నప్పుడే ఈ మార్పు సంభవించిందన్నమాట. ఈ వర్ణవ్యత్యయంవల్ల సిద్ధించిన 'నీ' ప్రభావంవల్ల తెలుగులో 'ఈవు' మొదట ఒక నకారం చేరి 'నీవు' అయింది; అల్లాగే కొండలోనూ, కూయిలో ఒక మాండలికంలోనూ, కువి లోనూ ప్రాచీనమైన ఈన్ నీన్‌గా మారింది.

## యుష్మదర్థక బహువచనం

చాలా ద్రావిడభాషల్లో యుష్మదర్థక బహువచన రూపాలు మూ. ద్రా. *నీమ్‌నించి వచ్చినవి. కాని తమిళం నీర్, తుళు ఈరు, తెలుగు ఈరు, (గోండీ మిరాట్, కొండ మీరు, కూయి ఈరు, మీరు, కోలామీ, నాయకీ నీర్)– వీటికి మూల రూపం *నీర్ అయిఉండాలి. పైన పేర్కొన్న భాషలు దక్షిణ, మధ్య అనే రెండు ఉపకుటుంబాలకి చెందినవి కాబట్టి ఈ *నీర్‌రూపం మూలద్రావిడంలోనే తరవాతకాలంలో సృష్టించబడింది అని ఊహించవచ్చు. తమిళంలో నీమ్, నీర్ రూపాలు రెండూ సంఘసాహిత్యంలోనేఉన్నా వీటిలో నీమ్ రూపమే నీర్‌కన్న ప్రాచీనమని చెప్పడానికి రెండు కారణాలు చూపించవచ్చు: 1. అస్మదర్థక సర్వనామాల్లోనూ (ఉభయార్థకంతోసహా), ఆత్మార్థక సర్వనామాల్లోనూ నకారం ఏకవచన ప్రత్యయంగానూ, మకారం బహువచనప్రత్యయంగానూ ఇంచుమించు అన్నిద్రావిడభాషల్లోనూ ఉన్నాయి కాబట్టి ప్రాచీనకాలంలో యుష్మదర్థక బహువచన సర్వనామంలోకూడా మకారమే బహువచనప్రత్యయంగా ఉండిఉండాలి 2 యుష్మదర్థక బహువచనం ఔపవిభక్తికరూపంలో అన్నిద్రావిడభాషల్లోనూ మకారమేకాని రేఫ ఏ భాషలోనూ లేదు కాబట్టి *నీమ్ ప్రాచీనరూపమైయుండి *నీర్‌అనే రేఫ బహువచన ప్రత్యయంగాగల రూపం *అవర్ (తె. వారు), *ఇవర్ (తె. వీరు) మొదలైన రేఫ బహువచన ప్రత్యయంగాగల సర్వనామాలసామ్యంవల్ల సృష్టించబడినదిఅని ఊహించవచ్చు. మహన్మహతీవాచకాలైన

నామవాచకాల్లో కూడా అర్/-ఇర్ బహువచన ప్రత్యయంగా ద్రావిడభాషల్లో ఉంది (ఉదా. త. అరసర్ 'రాజులు', మకళిర్ 'కూతుళ్ళు', తె అల్లురు, పగలు ) మకారాంతకన్న రేఫమే బహువచనప్రత్యయంగా విశేషవ్యాప్తిలో ఉన్నది కాబట్టి యీ రూపంలో మకారంస్థానాన్ని రేఫ ఆక్రమించడంలో ఆశ్చర్యం లేదు. తెలుగు తాము, తారు రూపాల్లో కూడా యిదే మార్పు జరిగిందనే విషయం యీ సందర్భంలో స్మరించదగ్గది. ఇందులో కూడా తుళు ఈరు లోనూ మధ్యద్రావిడమూలరూపంలోనూ పదాది నకారం లోపించింది. తమిళం, మలయాళం కొడగు, తుళులలో యీ రూపానికి అమహద్బహువచన ప్రత్యయమైన *కళ్ రూపాంతరాలు చేరడం ఒక ప్రత్యేకత. ఇదేవిధంగా తెలుగులో కూడా నామవాచక బహువచన ప్రత్యయం వారలు, వీరలు, (వ్యావహారికం) మిమ్మల్ని అనే సర్వనామాల్లోకూడా చేరింది. తమిళం నీయిర్ యుష్మదర్థకైకవచనం 'నీ' మీద-ఇర్ అనే బహువచన ప్రత్యయం చేరగా సిద్ధించినది.

దీని ఔపవిభక్తికరూపం మూ. ద్రా. *నిమ్-. ఈ రూపం అన్ని దక్షిణద్రావిడభాషల్లోనూ, ఉత్తర ద్రావిడభాషల్లోనూ కూడా నిలిచింది. ప్రాచీనతమిళం లోనూ, బ్రాహుయీలోనూ ఇందులో ఇ కారం ఉకారంగా తిష్ఠ్యమైన మకారం ప్రభావంవల్ల మారిపోయింది. ఈ మార్పు యీ రెండు భాషల్లోనూ వేర్వేరుకాలాల్లో జరిగినదికాని ఒకేకాలంలో జరిగిందికాదు తమిళంలో తరవాతకాలంలో దీనిలో నకారం లోపించి ఉమ్-, దీనికి కళ్ ప్రత్యయం చేరి ఉంకళ్-సిద్ధించాయి. తమిళంలో యుష్మదర్థకైకవచనం ఔపవిభక్తికరూపంలో ఉకారం బహువచన రూపమైన ఉమ్ — సామ్యంవల్ల వచ్చింది. బ్రాహుయీలో ఔపవిభక్తికరూపమే నామవాచకంగా కూడా స్థిరపడింది.

మధ్యద్రావిడభాషల్లో మూ. ద్రా. *నిమ్-లో నకారంలోపించి ఇమ్-గా మారింది. కోలామీ-పర్జీ భాషల్లో ఇది అల్లాగే ఉండగా తెలుగు — కూయి భాషల్లో వర్ణవ్యత్యయంపొంది 'మీ'గా మారింది. ఈ భాషల్లో మకారాదులైన నామవాచకరూపాలు ఔపవిభక్తికరూపసామ్యంవల్ల ఏర్పడినవే. కోలామీ-నాయకి నీర్ తెలుగునించి ఈర్ ఎరువు తెచ్చుకొని దానికి నీవ్ సామ్యంవల్ల నకారం చేర్చగా ఏర్పడింది. గోండీమిరాట్ తెలుగునించి మీరు ఎరువు తెచ్చుకుని దానికి-అట్ బహువచన ప్రత్యయం చేర్చగా ఏర్పడింది. గోండీ ఇమ్మట్ ఈమ్‌కి అట్ చేర్చడంవల్ల ఏర్పడింది. గోండీ ఏకవచనరూపాలు ఇమ్మా, నిమ్మె ఇమ్మట్, నిమెట్‌లో బహువచన ప్రత్యయం తీసి వెయ్యగా ఏర్పడిన రూపాలు అంతేకాని బహువచన రూపాన్ని గౌరవార్థకంగా ఏకవచనంలో వాడటంవల్ల వచ్చిన రూపాలు కావు. గోండీలో బహువచనాన్ని ఏకవచనంలో వాడే అలవాటేలేదు పెంగో, కువిలలో రూపాలు అస్మదర్థకబహువచనం మల్లేనే ఏర్పడ్డాయి. తొద, కొడగులలో నామవాచకరూపాలు మొదట్లో ఔపవిభక్తికరూపాలు.

## సారాంశం

1. ద్రావిడభాషల్లో యుష్మదస్మదర్థక సర్వనామాల ఔపవిభక్తికరూపాలు వీటిలో దీర్ఘాచ్చు హ్రస్వమవడంవల్ల ఏర్పడ్డాయి. దీనికి కారణం వీటి తరవాత వచ్చే విభక్తిప్రత్యయం అజాది కావడం. 2. ఈ ఔపవిభక్తికరూపం తెలుగు-కూయిభాషల్లో వర్ణవ్యత్యయం పొందుతుంది. దీని ప్రభావంవల్ల యీ భాషల్లో నామవాచకరూపాలు కూడా నకార మకారాదులుగా కొన్నిసందర్భాల్లో మారిపోయాయి. 3. తెలుగు, గోండీ, కొండ, పెంగో, మండ, కూయి, కువి భాషల్లో యుష్మదస్మదర్థకాల పరిణామం ఒకేవిధంగా జరిగింది కాబట్టి యీ పరిణామం ఇవి అన్నీ ఒకేభాషగా ఉన్నకాలంలో జరిగిందని ఊహించవచ్చు 4. ఈ పరిశోధనవల్ల తెలుగు మధ్యద్రావిడఉపకుటుంబానికి చెందినదనీ, అందులో దీనికిపైన పేర్కొన్న భాషలతో అతిసన్నిహితమైన జనన సంబంధం ఉందనీ స్పష్టమవుతుంది. తెలుగు భాష చరిత్రలో ఇతరాంశాలు కూడా యీ సిద్ధాంతాన్నే ధ్రువపరుస్తాయి.

# ఆవేదన

## శ్రీ బండ్లమూడి సత్యనారాయణ

(వినత, గరుడుడు—కద్రువకు, ఆమె కొడుకులకు దాస్యం చేస్తున్నారు. గరుత్మంతు డొకరోజు పాముల్ని వీపు నెక్కించుకొని సూర్యమండలానికి ఎగసిపోయాడు. ఇంకేముంది—పాములు ఆ వేడిని తట్టుకోలేక నేల బడ్డాయి. కద్రువ వైనతేయుణ్ణి తెగతిట్టింది. అతడు తన తల్లిదగ్గరకువచ్చి తన ఆవేదన నిలా చెప్పుకొన్నాడు.)

అమ్మా! మన కీ దాస్యం
బెమ్మెయిఁ బ్రాపించె నిట్టులేలా యమ్మా
నమ్ముల కోర్వఁగ, నేర్పడ
నిమ్ముల సర్వమ్ము నాకు నెఱిఁగింపఁగదే.

వినుతసత్త్వుల నాగుల వీఁపుఁ దాల్చి
యెలమి నెగసితి భానుమండలముదాఁక
భాను కిరణాలఁ గ్రాగిన పాము లిలకు
దొరలిపోయెను నిదియ నా దోసమమ్మ!

తన కొడుకులు పడిరంచును
మనమునఁ గలుషించి 'బుద్ధిమాంద్యుఁడ వోరీ
వినతాపుత్రుఁడ' యని గ్ర
క్కున నన్నా నాగమాత కూసినదమ్మా!

ఇట్టి పరాభవమ్ము నెదనెట్టుల మ్రింగుదు, ధారుణీస్థలిం
దొట్టి సమస్తసంపదలతోఁ దులఁదూఁగినఁ దూఁగుగాక—యి
ప్పట్టున నట్టివాఁడయునఁ బ్రాణము బుచ్చుట మేలుకాదె—యి
ట్టిట్టననున్న జీవికకు నింకఁ జిరాయువు గల్గనేర్చునే!

పారతంత్ర్యములోఁ గ్రుమ్మి పాయసమ్ము
జారుచుండుట — యదియొక పౌరుషమ్మ!
ఇంత మగఁటిమి స్వచ్ఛందవృత్తి వలనఁ
గుడుచుచుండెడి గంజి వేవుఁడుఁగు లెచ్చు.

దాస్యశృంఖలములఁ దగిలిన నుంకించి
త్రెంచివేయకున్నఁ దెరువులేదు —
కూటికంటెఁ గోటికూటాలకంటెను
స్వేచ్ఛ మిన్నగాదె, స్నిగ్ధహృదయ.

కశ్యప ప్రజాపతికిని గాంతనీవు,
చండతేజుండ నీ కొమరుండ నేను;
ఇట్టి మనమేల దీనికిం గట్టువడితి
మమ్మరో! సైలవిమ్ము నిక్కమ్ముగాను.

గరుడుఁడు వీఁడె శౌర్యఘనసాగరుఁడంట, ఖగేంద్రుఁడంట, భీ
కరతర దోర్బలుండఁట, వికారవిదూరపరాక్రమార్కుఁడై
వరలెడి క్రాంతశీలియఁట — వైఖరి యిట్టిద — గాని, తల్లి యా
సరణిని బొక్కుచుండఁగని సాకఁడె, వాని బలంబు గాల్పనా!

అనుచు లోకము కోడియై యుఱచుచుండ
గుండె లవియఁగ నేనెట్టు లుండువాఁడ;
వైనతేయుండనగుట నా భాగ్యమమ్మ!
మేనఁ బ్రాణములున్న యాలోనఁ జెప్పు.

భావి భారతీయ పౌరులు నను మెచ్చి
పాడవలయు నాదు భవ్యచరిత;
నేను దీర్పఁ గార్యమెట్టిది యగుగాక
మనసు చిక్కబట్టి మాటలాడు.

---

# దిగంబర కవిత

## శ్రీ టి. ఎల్. కాంతారావు

భావకవిత్వం అనంతరం ఆంధ్ర సాహిత్య పారావారంలో ఉద్ధృతంగా లేచిన మరో మహోత్తాల తరంగం అభ్యుదయ కవిత్వం. ముఖ్యంగా ఈ శతాబ్దంలో మానవమేధాగ్నికుండంలో రగిలిన వేదనాజ్వాలావలయాలవినాద అభ్యుదయ కవిత్వం ఆవిష్కరింపబడింది. భావకవులు గడచిన దినాల చరిత్రలోని బంగారు కాలాన్నిగూర్చి, తాము మనస్సులో సృష్టించుకున్న ఊహాసుందరి ఎడబాటునుగూర్చి కావ్యగానం చేశారు గతకాలం ఔన్నత్యాన్ని దర్శించినట్లుగా, నడుస్తున్నకాలంయొక్క దౌర్భాగ్యాన్ని చూడలేకపోయారు. సాంఘికవ్యవస్థకు మూలమైన సామాన్య మానవుని క్షుభితాశ్రుకల్లోలసింధులు భావకవుల్ని కదలించలేదుకాని ప్రేయసి కనుకొలుకుల ఒక చినుకు కదిలితే అది ప్రపంచప్రళయానికి దారితీస్తుందన్నంతగా చలించిపోయారు. ఈ రకమైన భావకవిత్వంపై ఒక గొప్పవిప్లవాన్ని ఉద్రేకపూరితులైన యువకులు తీసుకువచ్చారు. పందొమ్మిదివందల ముప్పై తరువాత మార్క్సీయ దృక్పథాన్ని రక్తంలో జీర్ణించుకుని, భావాల్లో మండించి ఆడెన్, స్టీఫెన్ స్పెండరు మొదలుగాగలవారు పాశ్చాత్య సాహిత్యంలో తీసుకువచ్చిన పరిణామఫలితమే ఆంధ్ర సాహిత్యంలో ఒక మహోజ్వల ఉద్యమమై అభ్యుదయ కవిత్వంగా రూపొందింది. అభ్యుదయ కవులు భాషలోను, భావంలోను, శిల్పంలోను భావకవుల్ని ఎదిరించి విస్పష్టమూ, విశిష్టమూ అయిన ఒకానొక సాహిత్యమహాయుగానికి స్వాగతం పలికారు. ప్రధానంగా వీరి తిరుగుబాటు లక్షణాలు ఏమిటంటే — గడచిన చరిత్రని చించెయ్యటం, రాచరికపువ్యవస్థను, జమిందారీ వ్యవస్థను, భూస్వామ్యవ్యవస్థను తుడిచెయ్యటం, సమసమాజవ్యవస్థానిర్మాణం చెయ్యడం; ఒక్క మాటలో చెప్పాలంటే సర్వమానవసమానత్వం వసుధైకకుటుంబనిర్మాణం అభ్యుదయకవుల లక్ష్యాలు. ఎప్పుడైతే లక్ష్యాలు మారాయో అప్పుడే కావ్యలక్షణాలుకూడా మారాయి. అంచేతనే ఛందస్సు, అలంకారాలు మొదలైనవి సాహిత్యమునకు ప్రధానములుగా పరిగణించబడ్డాయి భావాన్నిబట్టి ఛందస్సు మారుతుందేగాని ఛందస్సునుబట్టి భావం మారదనే కవితాన్యాయాన్ని అభ్యుదయకవులు సృష్టించారు. కొన్నికొన్ని సందర్భాలలో వాళ్లు చెప్పదలచుకున్న విషయానికి ఏవిధమైన ఛందస్సు అవసరం లేనప్పుడు వచనానికే కావ్యగుణం ఆపాదించారు. (అదే వచన కవితగా వ్యవహరింపబడుతున్నది) ఈ విధంగా అభ్యుదయకవిత్వం నాలుగుదశాబ్దాలనుంచీ ఆంధ్ర సాహిత్యాన్ని ప్రభావితం చేసినపిమ్మట తెలుగు సాహిత్యంలో దిగంబరశకం ఆరంభమై దిగంబరకవిత అభ్యుదయకవిత్వంపై తిరుగుబాటు చేసి మరొక సాహిత్యఉద్యమాన్ని లేవదీసింది. దిగంబరకవిత యొక్క తిరుగుబాటు స్వరూపాన్ని పరీక్షించుకునే ముందు ప్రపంచ సాహిత్యంలో యువతరం తీసుకువచ్చిన తిరుగుబాటును ఒకసారి పర్యాలోకిస్తే దిగంబరకవిత బాగా అర్థం అవుతుంది

ఇరవయ్యో శతాబ్దపు మానవజీవిత సంక్షోభం ప్రపంచంలోని అన్నిరంగాల్లోని మేధావుల్ని కదలించినట్లుగానే, కళారంగంలోకూడా యువతరాన్ని కదిలించింది. నాగరికతాపురోగమనం, సాంస్కృతికాభ్యుదయం, విజ్ఞానశాస్త్రం తెరచిన నూతన కవాటాలు, ఆదిమానవుణ్ణించి వేరైన ఆధునిక మానవుని ఆలోచన, జీవితం — ప్రపంచచరిత్రలో బ్రహ్మాండమైన పరిణామాన్ని తీసుకువచ్చాయి. నాగరికతకు చెదలుపట్టి మానవసమాజవృక్షాన్ని లోపలనుంచి తొలచటం ప్రారంభించింది. సంస్కృతి ముసుగులో మానవత ఘోరంగా చెరచబడుతోంది. అణ్వాస్త్రాలు

సాధించిన అద్భుతవిజయాలు మానవమేధస్సుకు తుప్పుపట్టించాయి. స్థితికి మూలమైన ఆలోచన ంయానికి దారిచేస్తున్నది. సుఖాన్ని కాంక్షించే జీవితం హత్యలకు వెనుతీయటంలేదు. ఫలితం— యువతరంలో నిరాశ, నిస్పృహ, అలజడి, ఆందోళ నాను. ఈ అలజడి, ఆందోళన, నిరాశ, నిస్పృహలే ప్రపంచవ్యాప్తమై అన్నిదేశాల్లోని, అన్నిభాషల్లోని సాహిత్యయువతరాల్ని నూతనమార్గాన్వేషణాను రక్తుల్నిచేసి విభిన్న సాహిత్య ఉద్యమాలకు దారి తీశాయి. అమెరికాలో బీట్ జనరేషన్, గ్రేజన రేషన్, ఇంగ్లండులో యాంగ్రియంగ్‌మెన్, హంగేరీలో గాయపడిన యువకులు, బెంగాల్‌లో ఆకలితరం, ఆంధ్రదేశంలో దిగంబరకవిత—పై చెప్పిన ఉద్య మాలకు నిదర్శనాలుగా నిలుస్తాయి.

అమెరికాదేశంలో 'గ్రీన్‌విచ్ విలేజి' అనేక మంది కవులకూ, కళాకారులకు నిలయమైంది. గ్రీన్‌విచ్‌లోనే 'ఏవాగార్డు' నాటక రంగస్థలం కూడా ఉంది ఇక్కడే అనేకమంది ప్రఖ్యాత నాటకకర్తల నాటకాలు ప్రదర్శింప పడతాయి. 'గ్రీన్‌విచ్ విలేజి'లో సుమారుగా 2000 లకు పైగా 'బీట్నిక్కు' లున్నారు. సంప్రదాయాలు, నియమాలు ఇక్కడి వాళ్లని బాధించవు. గంజాయిత్రాగటం వీళ్ల ముఖ్య మైన అలవాటు. విశృంఖలత్వం కావలసినంతగా వీళ్ల జీవితంలో చోటు చేసుకుంది. 'బీట్నిక్కు లకు' గిన్స్ బర్గ్ నాయకుడు ఇతను రాసిన 'హవుల్' అనే గేయం అమెరికా సాహిత్య చరిత్రలో గొప్ప విప్ల వాన్ని సృష్టించిందట తరువాత చెప్పుకోవలసిన వాడు జాన్ కెరువాక్ అమెరికా కృత్రిమ నాగరికత యుద్ధ విముఖత, సమతావాదంమీదభయం, జీవితంమీద నిరాశ 'బీట్నిక్కులు' సాహిత్యంలో లేవదీసిన తిరుగు బాటుకి మూలం. 'గ్రే జనరేషన్' కూడా ఇటీవలి తరానికి చెందినదే. జార్జికన్ వీళ్లల్లో ముఖ్యుడు. రాజకీయానికి సాహిత్యానికి దగ్గర సంబంధ మున్నదని ఇతనివాదం. ఆంగ్లసాహిత్యంలో మరొక ఉద్యమాన్ని 'యాంగ్రి యంగ్ మెన్' ప్రారంభించారు. జార్జి ఆర్వెల్ ఈ ఉద్యమ నాయకుడు. రెండవ ప్రపంచ యుద్ధానంతర పరిస్థితులు బ్రిటన్‌లోని యువక హృదయాల్లో తీవ్రమైన అశాంతిని అసంతృప్తిని కలగజేశాయి. వర్గసమాజంలో పై అంతస్థువాళ్ళు వాళ్ల జీవితానికి సుస్థిరతను ఏర్పాటు చేసుకుని క్రింది అంతస్థువాళ్లని సంఘంలో అట్టడుగు పొర ల్లోకి నొక్కేశారు. కార్మికవర్గంలోని యువకులు పై చదువులు జదివినా సరైనఉద్యోగాలు లేకపోవటం, వారుకన్నకలలు, ఆశించినజీవితం చేతికందక పోవటం ఈ ఉద్యమానికి ముఖ్యకారణాలు. తరువాత చెప్పుకోతగ్గ సాహిత్యోద్యమం హంగేరీలో 'గాయపడిన యువకుల'ది. హంగేరీ విషాద రాజకీయ చరిత్ర దీనికి ముఖ్యకారణం. నాజీలు, రష్యన్ కమ్యూనిస్టులు ఒకరితర్వాత ఒకరుగా హంగేరీ రాజకీయ జీవితాన్ని విధ్వంసం చేశారు. 1956 లో దేశవ్యాప్తంగా చెలరేగిన కమ్యూనిస్టువ్యతిరేకోద్యమాన్ని రష్యన్ కమ్యూనిస్టులు నిర్దాక్షిణ్యంగా అణగ్రదొక్కేశారు. పేరినిక్‌బరావు రచించిన 'నో'ర్‌తార్' అనే గేయం ఈ సాహిత్యోద్యమానికి తలమానికమైనది. పశ్చిమ బెంగాల్‌లో 'ఆకలితరం' అనే పేరుతో యువకులు ఇటీవల సాహిత్యంలో గొప్ప తిరుగుబాటు లేవదీశారు. వీళ్ల ఉద్రేకానికి గిన్స్‌బర్గ్ ఊపిరి పోశాడు. దేశంలో నానాటికి పెరిగిపోతున్న అవినీతి, యువకుల్లో నిరుద్యోగఫలితంగా పేరుకుపోతున్న నిరాశ, ఆకలితరం సాహిత్యంలో తీసుకువచ్చిన తిరుగుబాటుకి ముఖ్యకారణాలు. ఈ ఉద్యమాలన్నిటివెనుక ప్రేరణ శక్తి ఇరవయ్యో శతాబ్దపు యాంత్రికనాగరికత. (ప్రపంచ సాహిత్యంలో యువతరం తిరుగుబాటును గూర్చి విపులంగా చదవాలంటే—'ప్రపంచసాహిత్యంలో యువతరం తిరుగుబాటు' — రచన — నిఖిలేశ్వర్ 67 జనవరి—భారతి—చూడండి.)

ఆంధ్రదేశంలో మొట్టమొదటిసారిగా 1965 మే నెలలో హైదరాబాదులో దిగంబర కవిత్వానికి నాందిగా దిగంబరకవిత మొదటిసంపుటి వెలు వడింది. 1966 డిశంబరునెలలో దిగంబరకవిత రెండవ సంపుటి విజయవాడలో ఆవిష్కరింపబడింది. 1968 డిసెంబరులో విశాఖపట్నంలో దిగంబరకవిత మూడోసంపుటి వెలువడింది. దిగంబరకవులు ఆరుగురు. నగ్నముని, మహాస్వప్న, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్య అనే ఈ ఆరుగురు ఆంధ్రసాహిత్యంలో అతినవీనకాలంలో దిగంబరకవితాఉద్యమానికి ఉద్యమకర్తలుగా నిలిచారు.

'ఈ దేశంలో, ఈ గోళంలో ఊపిరిపీల్చే ప్రతిమనిషి ఉనికికోసం తపనపడి అతడి భావి చూసి వెక్కివెక్కి ఏడ్చి పిచ్చెత్తి ప్రవచించిన కవిత' అన్నారు దిగంబరకవులు మొదటి సంపుటి ఇంట్రోలో. అభ్యుదయకవులు కూడా దరిదాపు ఇదే అభిప్రాయంతో అంతకుపూర్వం కవిత్వంపై తిరుగుబాటు తీసుకు వచ్చారు. మనిషికోసం, మనిషికి ఆలంబనమైన సమాజంకోసం సాహిత్యసృష్టి చేశారు. అయితే దిగంబర కవులకి ఈనాడు అమలులో ఉన్న ఏ రాజకీయ సిద్ధాంతం పైనా నమ్మకం లేకపోవటంవలన, కమ్యూనిస్టు దేశాల్లో ఆచరణలో ఉన్నఉన్న వ్యక్తిస్వాతంత్ర్యంపై విశ్వాసంలేకపోవటంవలన అభ్యుదయ కవిత్వాన్ని ప్రతోసిరాజని వ్యక్తి వ్యక్తిగా పరిణతి పొందే ఒకానొక అస్పష్ట మానవ సమాజ వ్యవస్థ కోసం, 'మంచికోసం, మనిషిలోని నిప్పులాంటి నిజమైన మనిషికోసం, కపటంలేని చిరునవ్వులు చిందే సమాజంకోసం, అహోరాత్రాలు ఆరని అగ్నిలో నడచిన ఆత్మలలోంచి' వీరు ఈ తమ కవిత్వాన్ని వినిపిస్తున్నారు. దిగంబరకవులు వినిపించినధ్వని వెనుక తీవ్రమైన ఆవేదన ఉన్నది. ఆ ఆవేదనను అర్థం చేసుకుంటేగాని దిగంబరకవిత అర్థంకాదు.

తెలుగుసాహిత్యంలో అభ్యుదయ కవిత్వపరంగా అనేక నూతన ప్రక్రియలు ఆవిర్భూత మయ్యాయి. ఇవన్నీకూడా ఆంధ్రసాహిత్యంలో వర్స్‌లిబర్, బ్లాంకువర్స్, ఫ్రీవర్స్ మొదలుగాగల ప్రక్రియలకు—విముక్త ఛందోరూపంలోను, అనిబద్ధ రూపంలోనూ, స్వేచ్ఛాకవితారూపంలోనూ, ప్రతిరూపాలుగా చెలామణీ అవుతున్నాయి వీటన్నింటిలోనూ వచనకవిత వర్తమానంలో ప్రధానస్థానం ఆక్రమించింది. ఈ విభిన్నప్రక్రియలు ఆంగ్ల సాహిత్య ప్రభావంతో ఆంధ్రసాహిత్యంలో ప్రవేశించి నప్పటికీ వాటిని సృష్టించిన కవులు ప్రతిభావంతులు కనుక సాహిత్యంలో కేవలం—అందరూ భావిస్తున్నట్టు పాశ్చాత్య ధ్వనులకు నామమాత్రమైన ప్రతిధ్వనులుగా కాక, స్వచ్ఛమైన, సమగ్రమైన కావ్యప్రక్రియలుగా పేరు తెచ్చుకున్నాయి. ఇదంతా దిగంబరకవులకు పూర్వం సంగతి. కాని దిగంబరకవులు వాళ్ల కవితని పైప్రక్రియలలో ఏ ప్రక్రియకూ సంబంధించినదిగాకాకుండా 'దిగంబర కవిత' అని నూతన నామకరణం చేశారు.

ఆంధ్రదేశంలో దిగంబరకవితావిష్కరణ కొన్ని విపరీతపరిస్థితుల విజృంభణవలన జరిగింది. దేశంలో రోజురోజుకి వికృతరూపం ధరిస్తున్న జీవన సమస్యలు, రాజకీయపు సుడిగుండాలు, ప్రజల దౌర్భాగ్యజీవితం—వీటన్నిటికంటే మనిషి నటన, తను కప్పుకున్న ముసుగు, తను ధరించిన పాత్ర ఇవన్నీ దిగంబర కవుల్ని కదిలించి కవిత్వం రాయించాయి. సాహిత్య విమర్శలో సమస్య అప్రధానమని అందరూ భావించినప్పటికీ, ప్రక్రియావైవిధ్యం విషయం మీదనే ఆధారపడిందన్న విషయాన్ని విస్మరించ కూడదు. ప్రస్తుత మానవసమాజం యావత్తూ ఒక మహాంధకారంలో మునిగిపోయిందని, గడిచిన, గడుస్తున్న చరిత్రఅంతా ఏ మార్పూ లేకుండా నిస్తేజంగా ఉందని వీరి నమ్మకం. అంచేత ఈ సమాజస్వరూపం మారాలని, మానవుడు నిజమైన మానవుడుగా నిలబడాలనే సంకల్పంతో ఈ ఉద్యమం ప్రారంభమైంది.

'మానవత రెండు కళ్లూ మూసుకు
పోయినప్పుడు
విప్పుకుంటున్న మూడో కన్నునై
కాలం ఛాయులీనంమీద కమానునై
చరిత్రనిద్రాసముద్రంమీద తుఫానునై
నేను వస్తున్నాను దిగంబర కవిని
రాత్రి ఉదయిస్తున్న రవిని.'

పై పాదాలు జాగర్తగా పరిశీలిస్తే దిగంబర కవిత్వోద్దేశం విశదమవుతుంది. జడత్వం ఆవరించిన, చైతన్యంస్తంభించిన మానవజాతి స్వభావాన్ని చరిత్రనిద్రాసముద్రం అనటంలో ధ్వనింపచేశారు. అధర్మ విధ్వంసానికి ప్రతీక శివునిమూడోనేత్రం. ఆ శివుని మూడో నేత్రమే విప్లవ నాయకత్వం వహించిన కవి శక్తినిగా విప్పుకుంటున్న మూడోకన్నునై అని అంటున్నారు. ఒక మహాంధకారంలోంచి వెలుగుని తీసుకువస్తున్న కవిగా రాత్రిఉదయిస్తున్న రవిని అని అంటున్నారు. ఈ తిరుగుబాటు ఏ వ్యవస్థ మీద జరుగుతున్నదో ఆ వ్యవస్థ స్వరూపాన్ని

చిత్రించేటప్పుడు ఉద్రేకం పరవళ్ళు త్రొక్కింది. ఉద్రేకానికి తగిన పదతీవ్రత ఈ ఖండికలో కనబడు తుంది:

'ఆరని దాహపు నాల్కల్లో
భూకంపాల ఆకలి అవులింతల్లో
కామాగ్ని పర్వతాలు ఉవ్వెత్తునరేగి
చెలియలికట్టల్ని తెగద్రెంచు కుంటున్నప్పుడు
అసంపూర్ణజ్ఞానుల అహంభావసిద్ధాంతాల
అజ్ఞాన ప్రవాహాల్లో
ప్రమాదాల జలావర్తాల్లో
జనత ఊపిరాడక ఉక్కిరిబిక్కిరై పోతున్నపుడు
కీర్తికాముకుల నియంతల,అహంతల, దౌర్జన్య
బాహువుల దురాక్రమణలో
దేశదేశాల సుఖవ్యాధి పుండ్లతో
భూమి వెలయాలై, పతితై, భ్రష్టయై
పుచ్చు గబ్బు కొడుతున్నప్పుడు
నేను పుడుతున్నాను దిగంబరకవిని.'

అంటే ప్రపంచచరిత్రలో అంతర్జాతీయ రాజకీయ వాతావరణం ఎలా కలుషితమైనదో వివరించటమే ఈ గేయంయొక్క ముఖ్యోద్దేశంగా కనబడుతుంది. వీళ్ళు ఆశించేది వ్యక్తిగతాభివృద్ధి. వ్యక్తి సమాజంలో ఒక భాగమైనప్పటికీ తనకి తను పరిపూర్ణుడు కావాలి. అంటే ప్రతివ్యక్తి ఆత్మవికాసం పొందిననాడు సమాజం దానంతటనే వికాసం చెందుతుంది అందుచేతనే 'నేటి కావ్యరచనలో జీవితంలోని నిజాయితీని, సరళత్వాన్ని, యుగసందేశాన్ని, అనుభూతుల అభివ్యక్తిని, ఊపిరిగా పీల్చగల ఆధునిక మానవుని అస్తిత్వం ఆవిష్కరింపబడటం అవసరం' అంటున్నారు దిగంబరకవులు. యంత్రశాలలనుండి, యాంత్రికపు ఆలోచనలనుండి కళాత్మికంగాను, ఆర్థికంగాను మానవుడు మహాస్వతంత్రుడు. వర్తమాన కాలంలో అమలులో ఉన్న ఏ రాజకీయ సిద్ధాంతం కాని, కళాసిద్ధాంతంకాని మానవునికి ఆ స్వతంత్ర ప్రతిపత్తిని ప్రసాదించటంలేదు యాంత్రికయుగం సృష్టించిన సంక్షోభం కళాప్రపంచాన్ని అనంతంగా ప్రభావితం చెయ్యటమేగాక మానవుని వ్యక్తిగతాభివృద్ధికి తీవ్రనిరోధకంగా కనబడుతోందన్న విషయాలు దిగంబరకవుల నమ్మకాలుగా, దిగంబర కవిత చదివిన మనకి అర్థం అవుతుంది. పోగా ఈనాడు చాలామంది దేనినైతే ప్రగతిఅని అంటున్నారో అది వీరిదృష్టిలో నిజమైన ప్రగతికాదు- జీవపరిణామం అభివృద్ధి చెందుతున్నకొద్దీ పురోగతి స్తంభించినదని వీరి సిద్ధాంతం. ఆదిమ మానవుని కాలంలోనే ప్రపంచం ప్రశాంతంగా ఉన్నదని వీరి విశ్వాసం.

'నాడు మానవతాఝరులు పారాయి
మంచితనం తీరాలు వెలిశాయి
పాపపుణ్యాతీతలోకం శాంతి వెన్నెలను సాకింది
వర్గాలులేని మానవస్వర్గాలు
నదుల నాగరికతల్లో తీర్థాలుగా వెలిశాయి
నడచినది పరిణామం
చెడినది మానవారామం.'

అన్న పంక్తుల్ని పరిశీలిస్తే పైవిషయమే బోధపడుతుంది.

దిగంబర కవులు, అభ్యుదయకవులు ఒకే లక్ష్యాన్ని కలిగిఉన్నారు. అయితే దిగంబరకవులు గతకాలం మంచిదంటున్నారు. గతకాలం అంటే వర్గరహితసమాజం వర్ధిల్లిన నాటి సంగతి అభ్యుదయ కవులు భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుందంటున్నారు. వాళ్ళ దృష్టిలో గతం ఎలాంటిదైనాసరే మళ్ళీ అది పునరావృత్తం కాకూడదు మానవతని దృష్టిలో పెట్టుకుంటే ఇద్దరి లక్ష్యం ఒకటే.

'సమస్యలకు లోతులు తీసి
సామాన్యుల గోతుల్లో తోసి
కాలాన్ని గాలంగా వాడుకుంటూ
నిర్లిప్తతలోనే నిప్పును రాజేస్తూ
అనంత అమాయక మానవజాతిని
అనాదిగా అధ్వాన్నముగా పరిపాలించే
పిడికెడు మేధావులకు
పిరామిడ్లు కట్టాలమంది.'

అని అంటున్నారు దిగంబర కవులు. అంటే గడిచిన, గడుస్తున్న చరిత్ర అంతా దోపిడీవిధానంతో కూడిందని, మనిషిని మనిషి దోపిడీచేసే ఈ

విధానం ఇకమీదట కొనసాగకూడదని వీళ్ళ ఆశయం. అభ్యుదయ కవిత ప్రారంభంనించి ఈనాటిదాకా కూడా ఆశిస్తున్నదీ ఇదే. అయితే అభ్యుదయ కవులు వర్గసమాజ విధ్వంసం అనంతరం సమసమాజ నిర్మాణం జరిగితీరుతుందని జరగాలని ఆశించారు; ఆశిస్తున్నారు. దిగంబరకవులు సమసమాజ వ్యవస్థా నిర్మాణానికి వ్యతిరిక్తంగా కనబడుతున్నారు. 'మానవశ్రేయంకోసం, వ్యక్తిని మరింత ఉన్నతంగా మలచటంకోసం పుట్టిన ఈ మతాలు, సిద్ధాంతాలు కాలం మారుతున్నకొద్దీ చరిత్ర పురోగమిస్తున్నకొద్దీ వాటి స్వరూపస్వభావాలు కూడా పూర్తిగా మారిపోయి కేవలం బేషజంగానో లేక ఏ కొద్దిమంది వ్యక్తుల స్వార్థపరుల అధికారదాహానికి అలంబనంగానో మిగిలిపోవటం జరుగుతోంది. ఇదే నాటి గ్రీకు ప్రజారాజ్యాలనుండి నేటి పశ్చిమదేశాల్లో ప్రజాస్వామ్యం పేరుతో చలామణీ అవుతున్న పదార్థాల లోనూ, మార్క్సిస్టుమతావలంబకులమని చెప్పుకుంటున్న కమ్యూనిస్టుదేశాల్లోనూ కూడా మిగిలిపోయింది ఈ వైవిధ్యపు అంతర్జాతీయ రాజకీయ సుడిగుండంలోపడి ఈనాడు మనిషి నలిగిపోతున్నాడు' అంటున్నారు దిగంబరకవులు. కాబట్టి గడిచిన ఏ రాజకీయసిద్ధాంతంమీద వీరికి విశ్వాసం లేదని దృఢపడుతోంది. వీరి దృష్టిలో ఏర్పడవలసిన వ్యవస్థ మనిషిలోని చిత్తశుద్ధి నిజాయితీలమీద ఆధారపడిఉంటుంది. ప్రజలను బానిసలుగా పరిగణించిన రాచరికపు వ్యవస్థ, వర్గభేదాలను సృష్టించిన ప్రజాస్వామికవ్యవస్థ, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని మింగేసిన కమ్యూనిస్టు వ్యవస్థ—వీటిమధ్య సామాన్యమానవుడు నలిగిపోయాడు; నలిగిపోతున్నాడు. సగటుమనిషి గోడు పట్టించుకునేందుకు ఏ రాజకీయవ్యవస్థ ఇంతవరకు ఉద్భూతం కాలేదు.

'దేవుళ్ళకోసం రాజుల సమాధులకోసం
బంగారు ఇటుకలతో గోడలులేచే ఈ దేశంలో
మట్టిగోడల గోడు వినేవాడెవ్వడు'

అని ప్రశ్నిస్తున్నారు దిగంబర కవులు. దిగంబర కవులకి వాళ్ళు చెప్పే విషయంమీద వెలుతున్న రీతిమీద ప్రగాఢమైన విశ్వాసం ఉన్నది.

'మంచిమనసు పరిమళాలు
విశ్వవ్యాప్తి కాకపోవు
భావితరం గుర్తించకపోదు
జాగ్రత్ప్రళయ కావ్యంలో
తపనాగ్నిజ్వాల నిలుస్తోంది
అణువణువునా అగ్నికణం
చల్లారక రగులుతోంది'

అని అంటున్నారు.

దిగంబర కవుల కవిత్వంలో ఒకవిధమైన ఉద్రేకం ఉరకలు పెడుతుంది అయితే ఉద్రేకం ఒక్కటే కవిత్వానికి చాలదు ఉద్రేకం లేనిదే కవిత్వం కానప్పటికీ ఉద్రేకమే కవిత్వంకాదు కాబట్టి ఉద్రేకానికి తగిన ప్రతిభ ఉండాలి. దిగంబర కవులు ప్రతిభావంతులని చెప్పటానికి ఏలాంటి సందేహం అక్కర్లేదు. ఏ జాతి ఉత్తమకవిత్వమైనా సరే ప్రధానంగా మూడు అంశాలపై ఆధారపడిఉంటుంది. మొదటిది అనుభూతి; రెండవది అనుభూతిని వ్యక్తంచేసే భాష; మూడవది భాషకు కవితారూపం ప్రసాదించేటందుకు కవి అవలంబించేరీతి లేక పద్ధతి. ఈ మూడు సూత్రములనిమీదనే కవిత్వంయొక్క స్థాయి ఆధారపడిఉంటుంది ఈ మూడింటిని విస్మరించి భావద్వేషపు రంగుటద్దాలతో సాహిత్య విమర్శకు పూనుకుంటే అది విమర్శ కానేరదు. దిగంబర కవులకు ఉద్రేకం ఉన్నది; భాష ఉన్నది; విధానం ఉన్నది. కాబట్టేవాళ్ళు ఉత్తమకావ్యసృష్టి చేయగలిగారు. అందుకు నిదర్శనంగా వాళ్ళు రాసిన సంపుటాల్లోంచి చాలా ఉదాహరణలు చూపించవచ్చు

'నాగరికతావాహినలో
కన్నీళ్లను అడుక్కుంటున్న
యుగభిక్షువును నేను
విజ్ఞానం విసరిన విషకిరణానికి చెడిపోయిన
చక్షువును నేను
వ్యథాశోకాల పీడితలోకాలలో
విరిసిన కారుణ్యం మహాబోధి వెలుగులో
మెరిసిన తథాగతుణ్ణి నేను
అహంకారం సిలువపైన నవ్విన నెత్తురు
గులాబిని నేను.

పైన చెప్పుకున్నట్లుగా ఆధునిక విజ్ఞాన శాస్త్రం సృష్టించిన అణుసంక్షోభం మారణ హోమానికి దారితీసింది మతం మానవుణ్ణి దాన వుణ్ణిగా చేసింది. అజ్ఞానం మహాజ్ఞానానికి సిలువ సి వెక్కిరించింది. ఇది కేవలం అజ్ఞానం కాదు మత సంబంధమైన అహంకారము దానికి తోడైంది. అంటే మతం మానవుణ్ణి ఉన్నతుణ్ణిగా మలచటానికి బదులు హింసా ప్రవృత్తికి దారి తీయిస్తున్నది. అహంకారం సిలువపైన నవ్వినవెత్తురు గులాబీని నేను అనటంలో ఏసుక్రీస్తులా రూపం కళ్లముందు ప్రత్యక్షం అవుతున్నది ఇది శిల్ప నైపుణ్యం తెలియని వాళ్లకి సాధ్యమయే విషయంకాదు. అలాగే ఇంకొక ఉదాహరణ చూపించవచ్చు.

'ప్రపంచ ప్రయోగశాలలో విజ్ఞానం విస్ఫోటన
తలలో విశ్వామిత్ర సృష్టి
నాకు నా తలకు దారి చెడింది
హృదయానికి మేధస్సుకి
మధ్య తడితీగ తెగింది.'

దిగంబరకవిత్వమంతా ఆధునిక విజ్ఞాన శాస్త్రంమీద తిరుగుబాటుగా కన్పిస్తుంది. విజ్ఞానం పెరగటంవలన మనిషి సృష్టికి ప్రతి సృష్టి మొదలు పెట్టాడు మనిషికి మనిషి ఆలోచనకి సంబంధం లేదు మనస్సు మానవత్వంవైపు, మేదస్సు దానవత్వం వైపు దారి తీస్తున్నాయి. వర్తమానకాలంలో మానవ తని అంటే మనస్సుని మేధస్సు అంటే ఆధునిక విజ్ఞానశాస్త్రం జయించింది. విశ్వామిత్ర సృష్టి ప్రారంభమై మనిషికి మనస్సుకి సంబంధం లేకుండా పోయింది. హృదయానికి మేధస్సుకి మధ్య తడితీగ తెగింది అంటే ఇక్కడ 'తడితీగ' అనే శబ్దము ఆర్ద్రత, దయ, జాలి వీటన్నిటికి ప్రతీకగా వాడ బడింది ఈ ఒక్క పాదంలోనే గొప్ప ధ్వనిని సృష్టించారు దిగంబరకవులు.

దిగంబరకవులు ఆధునిక విజ్ఞానం శాస్త్రీ యంగా సాధించిన ప్రగతిని విధ్వంసక చర్యగా విస్తున్నారు దానికి నిదర్శనంగా అణుయజ్ఞం అనే ఖండికను రాశారు. ఆ కావ్య ఖండికలో వాడిన భాష, ప్రయోగించిన ఉపమానాలు కొత్తగా ఉన్నాయి. భావానికి అనుగుణమైన పదాల అమరిక ఉన్నది. సౌందర్యాన్ని మంటపెట్టి, ఆనందాన్ని ఆహుతిచేసి విషాదాన్ని సృష్టిస్తున్నాడు నేటి అణ్వాస్త్రాల ఆధునిక మానవుడు అతనే అణుయజ్ఞం ప్రారం భించాడు.

'కొడిగట్టిన చుట్ట నుసిలా
ముసుగేసుకున్న విధవలా
అలుముకుంది వెన్నెల.'

పై పాదాలు ఖండిక ప్రారంభంలోనివి. భస్మాన్ని ధ్వనింపచెయ్యటమే పై మూడు పాదాల పరమార్థం. అయితే ఈ భస్మం ఎక్కడిది? అన్న ప్రశ్నకు సమాధానం తరువాత పాదాల్లో లభిస్తుంది. ప్రపంచాన్ని హోమగుండంగా, కాలాన్ని ఘృతంగా, శ్మశానాన్ని యాగపురుషుడుగా, పిశాచాల్ని మంగళ తూర్యాలు పలికేవారిగా ఊహించి అణుయజ్ఞం ప్రారంభించబడింది. పైచెప్పిన ఉపమానాలన్నీ కూడా విధ్వంసానికి ప్రతీకలే. యాగఫలాన్ని ఈవిధంగా చెప్పారు.

'యాగపురుషుని ప్రత్యక్షంతో
సర్వస్తంభన జరిగింది.
నా దోసిట యాగఫలం
పిడికెడు భస్మం నిలిచింది.'

ఈ భస్మం మానవజాతి విధ్వంసం అనంతరం ఏర్పడింది. కొడిగట్టిన చుట్టనుసిలా, ముసుగేసుకున్న విధవలా వెన్నెల ఉందనటం ధ్వని ప్రధానంగా ఉంది ఇలా కావ్యఖండిక పరమార్థాన్ని ప్రారంభం లోనే వ్యంజనం చెయ్యటం గొప్పవిశేషం ఇలా దిగంబర కవిత్వంలో ధ్వని ప్రధానమైన ఖండికలు అనేకం ఉన్నాయి

'ప్లేట్లల్లో ఫోర్కుల కింద అంగాంగాలు
జైళ్లల్లో బండరాళ్లు కప్పుకుని అమాయకులు'

ఉన్నవాళ్లకి, లేనివాళ్లకి అనాదినుండి జరుగు తున్న అనంత సంఘర్షణ పైరెండుపాదాల్లోనే గర్భితమైంది.

దిగంబర కవులకు ఈ దేశ భవిష్యత్తుమీద అందులోనూ ఆంధ్రదేశంలో పేరుకుపోయిన

జడత్వంమీద అనంతమైన ఆవేదన ఉన్నది. ఈ ఆవేదన అగ్నిశిఖలా ఆకాశానికి నాలుక చాచింది మూడవ సంపుటిలో.

'అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టు
పెట్టిన అందం నీది
ఎండిన స్తనాలమీదికి ఎగబడ్డ బిడ్డల్ని
ఓదార్చలేని శోకం నీది
ఆకలికి ఎండిమాడి ఎరువు సొమ్ములతో
వీధినిబడ్డ సింగారం నీది.

అమ్మా! భారతీ! నీ గమ్యం ఏమిటి తల్లీ!'

అని అగమ్యంగా ఉన్న భారత ఆర్థిక వ్యవస్థను ప్రశ్నిస్తున్నారు వీళ్ళు. బాధ్యతలను మరచిన యువ తరం నిస్తేజప్రవృత్తిలోనే నిద్రపోతూ, అంధ కారమే అభ్యుదయపథంగా భావిస్తూ సంప్రదాయపు సంకెళ్లలో బందీలై జాతిని జాతి పురోగతిని విస్మరిస్తున్నపుడు దిగంబరకవులు కావ్యగానం మొదలు పెట్టారు.

'వెన్నెముక వంగిన నూతన తరాల
నరాలకు — ఆలోచనకు తీరిక ఇవ్వక
సెక్సు సాహిత్యం అంగామార్కు సినిమాలు
ప్రస్తీగా జన్మించటమే పిల్లల్ని కనేందుకు
యోగ్యత
గాలికి, జీవించటమే యాచకుల ఉద్యమం
స్వతంత్ర భారత పౌరుడనే చిత్రజీవి
యాచకీయాల వంచనలో
స్వస్వరూపాన్ని ఏ నాడో కోల్పోయి
సంప్రదాయ శిథిలామధ్య
వికృత విరాట్ రూపాన్ని
దర్శిస్తున్నాడు.'

జాతిని నిర్వీర్యం చేస్తున్న విధ్వంసక అరాచక వ్యవస్థ స్థానంలో - ఒక పవిత్ర వ్యవస్థ, మనిషిని మనిషిగా మలచగలిగే వ్యవస్థ, మనిషిలోని చైతన్య స్రవంతిని స్వేచ్ఛగా ప్రవహింపనిచ్చే వ్యవస్థ, అమాయకులు, అనాథులు, అశాంతులు జీవిత భయాన్నించి విముఖులై నిర్భీతిగా నిద్రించే వ్యవస్థను దిగంబర కవులు ఆహ్వానిస్తూ

'రగులుతున్న విప్లవంలో
మనిషి తీరని దాహమై
సజీవమైన అసంఖ్యాక ఆత్మలబలంతో
ఈ మట్టిలోంచి
నీటిలో, గాలిలో తిరిగే
నీవు — నేను ముందుకు నడవాలి.'

అని యువతరాన్ని హెచ్చరిస్తున్నారు.

ముఖ్యంగా దిగంబర కవితలో కొట్టవచ్చినట్లు కనబడే అంశాలు కొన్ని ఉన్నాయి పాత వ్యవస్థమీద తిరుగుబాటు, ఏ రాజకీయసిద్ధాంతంమీద నమ్మకం లేకపోవటం, వ్యక్తిగతాభివృద్ధిప్రధానమైన మరో మహత్తర వ్యవస్థకోసం తపన—ఈ అంశాలు ప్రధానంగా కావ్యరచనకు పూనుకున్నారు కాబట్టే వాళ్లపైన కొన్ని పదాలను సృష్టించారు భాష మారింది; ఉపమానాలు మారాయి; పదప్రయోగం మారింది. అంటే దిగంబరకవిత ఒక ప్రక్రియకు అనుకరణగా కాక స్వేచ్ఛాప్రక్రియగా ప్రస్తుతానికి నిలబడింది. ఇది నిలుస్తుందా. నిలవదా? అన్న ప్రశ్నకు తావు లేదు కాని ఇంత వెలుగు వెనుక ఇంకా ఇంత చీకటుంది. అదేమిటంటే దిగంబరకవిత స్పష్టంగా కనబడే పెర్వర్షన్ ఉద్రేకం కొన్ని కొన్ని చోట్ల ఉండవలసిన దానికంటె ఎక్కువ ఉండటంవలన చదివే పాఠకునికి ఆనందం బదులు జుగుప్స కలుగుతుంది. కావ్యఖండిక చాలా అందంగా ప్రారంభమవుతుంది. పాఠకుడు ఉద్భావంలో లీనమై చదువుతూ మధ్యలో ఆగిపోతాడు. దానికి కారణం ఏమిటంటే—ఏక ప్రవాహంగా సాగిపోతున్నకావ్యఖండిక మధ్యలో జుగుప్సా కరమైన పదజాలం అడ్డం రావటం. ఇందుకు ఉదాహరణలుగా చాలా ఖండికలు దిగంబరకవిత మూడు సంపుటాల్లోనూ కనబడతాయి.

'అంతర్ముఖుణయి గుండెలోతుల్లో
కలల అలల్ని కెలుకుతూ
భావాల గాలాన్ని విడిస్తూ, ఏడుస్తూ
ఏదీ పట్టనట్టుగా
నే నెవరికీ ఏదీ కానట్టుగా గుట్టుగా
కూర్చోలేను
యాభైకోట్ల జనాన్ని

స్వార్థసంఘ క్రిమికీటకాదులు
ఆవేస్తుంటే పీనుగులా బతకలేను.'

అని సంఘపరంగా కవి పడే ఆవేదన ఇంతవరకు బాగానే ఉన్నదికాని వెంటనే పై పాదాల అనంతరం హేయమైన పదజాలం ఉపయోగించటంతో కవి పాఠకుణ్ణించి దూరం అవుతున్నాడు.

'మజిలీ మజిలీకి వేశ్య
కొత్తచీర మార్చుకున్నట్లు
నపుంసకుడు పురీషాన్ని
ప్రతినిముషం నలిపినట్టు'

అనటంతో చదివేవారికి ఏవగింపు కలగటమేకాక అంతకుపూర్వం అనుభూతికూడా మిగలదు. 'విస్తరించాలి చైతన్యపరిధి—అగ్నిజల్లినా అమృతం కురిసినా అదం, ఆనందం దాని పరమావధి అని విస్మరించకూడదు. 'Literature is the Comprehensive essence of the intellectual life of a nation' న్న వాక్యాన్ని ప్రతిభ గలవారే విస్మరిస్తే—కంచే చేను మేస్తే—

'నన్నయ్యను నరేంద్రుని బొందిలోనే నిద్రపోనియ్యి'

'ఛందోబద్ధ సాహిత్యంలో
చీడపురుగు గీ పెడుతున్నది
కాపలాకాసే బిరుదురాయిళ్ళ కళ్ళకు
కాలదోషం పట్టుకుంది
ఇక ఈ మాను విస్తరించదు
మళ్ళీ వసంతాన్ని చూడదు
వచ్చే గ్రీష్మానికి పువ్వై రాలిపోతుంది'

అనుకోవటం ఉత్తమ ఛందోబద్ధ సాహిత్యంలో ఉన్న వెలుగులు దాంట్లోనూ ఉన్నాయి. ఈనాటికి ఇంకా ప్రాచీనమార్గంలో ఉత్తమకవిత్వాన్ని సృష్టించే కవులున్నారు కదా! ఛందోబద్ధ కవిత్వంపై దిగంబర కవుల తిరుగుబాటు సాహిత్యపరంగాకాక విషయపరంగా అయివుండవచ్చు సాహిత్యం కనుక ఒక మహావృక్షమే అయితే దాని తల్లివేరు భూమిలో స్థిరంగా పాతుకుపోయింది. సుడిగాలులు, ఉప్పెనలు దానిని ఏమీ చెయ్యలేవు. అన్నికాలాలకి, అన్ని ధర్మాలకి అది ప్రత్యక్షసాక్ష్యంగా, భావితరాలకి విజ్ఞానసర్వస్వంగా, సర్వాంగసుందరంగా నిలబడుతుంది. కొత్తగా కాలాన్ని అనుసరించి అనేకశాఖలు పుట్టవచ్చు. చేవగలిగిన శాఖలు పుష్పిస్తాయి; సుగంధ పరిమళాలని దశదిశలకు వ్యాపింపచేస్తాయి. చీడపురుగు పట్టడంఅంటూ మొదలైతే ప్రత్యేకించి ప్రారంభంలో ఒక శాఖకు పట్టినా అది క్రమేపీ అన్నిశాఖలకు వ్యాపిస్తుంది. అది జాతి సంపూర్ణ వినాశనానికి దగ్గరవుతున్నపుడు జరిగేపని. కాబట్టి ఏ ప్రక్రియ అయినాసరే, దాన్లో జీవమేఉంటే విషయప్రధానంగా కాకుండా సాహిత్యప్రధానంగా కాలాన్ని జయించి నిలుస్తుంది.

'ఏదేశ మేగినా ఎందు కాలిడినా
కారం పొట్లంచిన రోకళ్ళతో
పట్టపగలు విహరించాలనుంది'

అనటం గాడిదలు, గొడ్లు, పందికొక్కులనటం అనవసరమైన ఆవేశానికి లార్కాణాలు. ఆవేశం కవితాసృష్టికి అవసరమే కాని అనవసరావేశం అనర్థాలకి దారి తీస్తుంది 'ఆధునిక కవిత్వాన్ని ఇంకా మట్టిసుద్దలతో తూచే మహామహానుభావులు' అని ఎగతాళి చేశారు దిగంబరకవులు కొంతమంది విమర్శకుల్ని. అయితే ఆధునిక కవిత్వానికి తూకపు రాళ్ళు ఏమిటో వారు నిర్ణయించలేదు. నాటినుంచి నేటివరకూ కూడా అమలులోఉన్న, అందరూ అంగీకరించిన కవితా సిద్ధాంతం 'రసధ్వని' కావ్యాత్మ అని రసమూ, ధ్వని ప్రాచీనలాక్షణికుల సిద్ధాంతమనుకొంటే — ఆధునిక కవిత్వానికి కొలమానం ఏమిటో ఆధునిక లాక్షణికులు నిర్వచించవలసిన అవసరం ఉన్నది. గురజాడ వ్యవహారికభాషావాదానికి అనుగుణమైన శిష్టవ్యవహారికమంటే ఏమిటో గురజాడ డిశెంటుపత్రంలో వివరించాడు. ప్రాచీన అలంకారశాస్త్రాలు ఆధునికకవిత్వాన్ని అంచనా వెయ్యటానికి పనికిరావనేవాళ్ళు కొత్త అలంకార

శాస్త్రాల్ని నిర్వచించి వాటద్వారా ఆధునిక కవిత్వాన్ని కొలవమనటం న్యాయమైన మాట. పోగా కావ్య లక్షణం అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ ఒక్కటే. భేదం బాహ్యరూపంలో మాత్రమే. కవిత్వం కవి వ్యక్తిత్వముయొక్క అభివ్యక్తీకరణ కాదు. ప్రాపంచిక సత్యాన్వేషణ, విశ్వశ్రేయస్సు కావ్యముయొక్క పరమార్థాలు. కసిత్వం కవిత్వంకాదు. కనుక పై లోపాలము సవరించుకుంటె దిగంబరకవిత ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానాన్ని పొంది మళ్లీ ఒక సాహిత్యయుగాన్ని సృష్టిస్తుందనటంలో ఎలాంటి సందేహమూ లేదు.

గుణదోషవిచారణ విమర్శ అని భావిస్తూ, గుణాలను గ్రహించటం దోషాలను వదిలేయటం పాఠకుని బాధ్యతగా గుర్తించి, సృష్టిలో ప్రతి పదార్థమునకు విలువ కట్టకలిగిన మేధావి మానవుడైతే మానవుణి అంచనా వేయగల ఉత్తమ సాధనంగా కవిత్వాన్ని భావిస్తూనే ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను.

---



# ప్రశ్న - పౌనరుక్త్యము

**శ్రీమతి యస్. సుందరమ్మ**

తీగ తీగల పువ్వులు తూగులాడ
కొమ్మ కొమ్మ చివురులు కులుకుమీఱ
మావి యాకుల తనువు తన్మయము నొంద
గొంతు విప్పును మధువేళ కోకిలములు

గమనమును మాని చింతనాక్రమము మాని
పాట వినుటకు నిలబడు వార లెందఱు ?

తూగతేటులు రసవేగమున మునుంగ
గాలి వలపుల చిఱుకెరటాలు రేప
వృష్టి కర్పూరకాంతి మసృణము కాగ
లాస్యమొనరించు లేత గులాబిపూవు

ఆర్ద్రహృదయము గ్రహియించి–అందమెంచి
వాసనల దోసిళుల త్రావు వారలెందఱు ?

**2**

విపులశాఖాదిశాయతవిశ్వవృక్ష
శత శత సహస్రకోటి వింశతి నిరవధి
దళ పరస్పర ఘర్షణ తాడనముల
నాడు లల్లార్చు తరుణపర్ణమ !

సమీర

## ప్రశ్నోత్తరోక్తులు

కాల లీలావిహారలేశమున గుండె
కరిగి చలియింతు, ఝుంఝూప్రవాతధాటి
వగిలి జీవములాడి శయింతు దాల
జీర్ణమై, దీర్ణమై, పరిశీర్ణదేహ
బంధమై, సద్దు సడిలేక పడెదు నేల—

ఏల కంపెదవు ? సంభ్రమమేల భయము ?
తరళనయనాశ్రుకణముల మరణమేల ?
శిశిరమున పత్రములురాల్చు చిరువుపట్టు
పూచును వసంతముఖమున భువన తరువు.

---



# తిలక్ - అమృతం కురిసిన రాత్రి

శ్రీ రామమోహనరాయ్

భావకవిత్వ సౌందర్యమూ, అభ్యుదయ కవిత్వపు ప్రగతి పువ్వులో తావివలె కవితలో యిమిడి వున్న కవిహృదయస్పందనాత్రివేణీసంగమంలా తిలక్ కవిత్వం స్వచ్ఛమై, సుందరమై, ఆస్వాద యోగ్యమై తెలుగుదేశంలో రసజ్ఞులను అలరించింది. పుస్తకరూపంలో రాకముందే తిలక్ కవిత్వం సహృదయుల హృదయాలలో నిలిచిపోయి, పదే పదే తలచుకొనే ఆలోచనామృతమైనది. ఈ విధమైన ఖ్యాతి శ్రీ శ్రీ, అజంతాలకు మాత్రమే దక్కింది. అజంతా కవిత్వం యింకా పుస్తకరూపంలో రాకపోవటం శోచనీయం. తిలక్ కవిత్వాన్ని అనుభవించ గలిగినంతగా అంచనా వేయటం కష్టం. అతని భావనాబలం గొప్పది. అతని శైలి అమేయమైన అందచందాలను సంతరించుకొన్నది. ఎన్ని అందాలను వెలికి తీసినా యింకా అనుభవించవలసిన అందాలు మిగిలిపోతాయి. ఉత్తమ కవిత్వానికి నిదర్శనం ఎన్నిమార్లు చదివినా యింకా ఆనందించాలనే 'తీరని దాహం' కాక మరేముంటుంది.?

'నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే
దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే
విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే
అందమైన ఆడపిల్లలు'

అనే తిలక్ మాటలలోనే ఆయన కవిత్వతత్త్వం గుర్తించవచ్చు. మానవత్వమూ, అభ్యుదయమూ, సౌందర్యమూ ఆయన కవిత్వాంగాలు. ఆయన కవితా చందన శాలా సుందర చిత్ర విచిత్రాలు. ఆయన కళా కరవాల ధగద్ధగిత రవాలుగా 1941 లోనే తిలక్ ప్రకటించుకొన్నారు. ఆ నాటినుండి ఆయన నిర్విరామంగా కాకపోయినా వ్రాస్తూనే వచ్చారు. మధ్యకాలంలో ఆయన తీవ్రఅస్వస్థతకు గురియై సాహిత్యసీమతో సంబంధాన్ని తగ్గించుకున్నా, ఆయన వ్రాసిన ప్రతిగీతాన్ని ఆంధ్రలోకం ఆదరంతో అందుకున్నది.

ఇన్నాళ్ళకు తిలక్‌గీతాలు పుస్తకరూపంలో రావటాన్నిచూచి రసజ్ఞులెల్లరూ ఆనందిస్తారు. తిలక్‌గీతాలలో ప్రసిద్ధమైన 'అమృతం కురిసిన రాత్రి' అనే పేరుతో యీ పుస్తకం వెలువడింది. తిలక్ కవితాతత్వాన్ని అనుసరించి, యిందులోని గీతాలను మానవత్వాన్ని ప్రధానంగా దృష్టిలో ఉంచుకొని వ్రాసినవీ; అభ్యుదయ కవిత్వపు ప్రగతి నాశించేవీ; సౌందర్య ప్రధానమైనవిగానూ విభజించవచ్చు.

తిలక్‌ను ప్రధానంగా కారుణ్యవాదిగా గ్రయెంచవచ్చు. ఈ కారుణ్యంలోనే ఏ కవీ చూడని జీవన కోణాలను తిలక్ చూచి తనదైన వ్యక్తిత్వపుముద్రను ఆ దృశ్యంతో అచ్చువేసి చెమ్మగిల్లిన కన్నులతో కారుణ్యంతో వణికే కంఠంతో తన గీతాలను వినిపిస్తూ మానవతావాదులలో కొద్దిమంది మాత్రమే అందుకోగలిగిన శిఖరాలను చేరుకొన్నారు. 'ఆర్తగీతం'; 'నీడలు'; 'వెళ్ళిపోండి, వెళ్ళిపోండి'; 'పాడుపోయిన ఊరు'; 'శిఖరారోహణ'; 'వేసవి'; 'కఠినోపనిషత్'; 'నిన్నరాత్రి'; 'ముసలివాడు'; 'ఈ రాత్రి'; 'ప్లస్ యింటూ మైనస్'; 'మ్యా సిలబస్'; 'కాయ్‌రాజా కాయ్'; 'ప్రార్థన'; గీతాలలోని తిలక్ కారుణ్యం హృదయమున్న ప్రతివారినీ కరిగిస్తుంది. కానరాకే కదిలిస్తుంది. మనిషిని మనిషి ప్రేమించేటట్లు చేస్తుంది. ముఖ్యంగా 'ఆర్తగీతం'; 'ప్రార్థన'గీతాలు ఆధునికాంధ్ర కవిత్వంలో తిలక్‌ను అజరామరుణ్ణి చేశాయి.

ఆర్తగీతం'లో

'నా దేశాన్ని గూర్చి పాడలేను;
నీ ఆదేశాన్ని మన్నించలేను,
ఈ విపంచికకు శ్రుతి కలుపలేను'

అనే యెత్తుగడ చదువరులను యేకాగ్రచిత్తులను చేస్తుంది. ఘోరాతిఘోరమైన దృశ్యాలను చూచి తాను రుద్ధకంఠంతో

'నేడు నేను కన్నీరుగా కరిగిన గీతికను,
సిగ్గుతో రెండుగా చీలిన వెదురుబొంగును
మంటలో అంతరాంతర దగ్ధమైన బాడిదను
పైన దైవమునకు, కింద మానవునకు
జవాబు చెప్పవలసినవాణ్ణి
రాత్రిముఖరుదితబాధాకంఠనశాన్ని'

అంటారు. ఇంక తాను చూచిన దృశ్యాలు దుర్భరం. వాటిని నేరుగా గుండెకు తాకేలాగ

నేను చూశాను నిజంగా ఆకలితో
అల్లాడి మర్రిచెట్టుకింద
మరణించిన ముసలివాణ్ణి
నేను చూశాను నిజంగా నిరంధ్రవర్షాన
వంతెన కింద
నిండుచూలాలు ప్రసవించి మూర్ఛిల్లిన
దృశ్యాన్ని'

అని చెప్పి, యెన్నెన్నో దృశ్యాలను కళ్లకు కట్టించి

'ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి?
ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి?
ఏ బుద్ధదేవుడి జన్మభూమికి గర్వస్మృతి'?

అని ప్రశ్నిస్తారు. అంతేగాని పాడుసంఘం; కుళ్లుబోతుసంఘం అంటూ జనసముదాయాన్ని మించి యెక్కడోలేని సంఘాన్ని దుయ్యబట్టరు 'ఒక్క నిరుపేద వున్నంతవరకు, ఒక్క మలినాశ్రుబిందు వొరిగినంతవరకు, ఒక్క పేగు ఆకలి కనలినంతవరకు ఒక్క శుష్కస్తన్య సన్నిధిని క్షుధార్తివేద్పు పసిపాప ఉన్నంతవరకు, ఒక తల్లి నీరవాక్రోశరవమ్ము విన్నంత వరకు, ఒక క్షత దుఃఖిత హృదయ మూరడిల్లనంత వరకు, తనకు శాంతి కలుగదని దృఢంగా చెవుతారు. అంతలోనే బాధతో కరిగిపోతూ

'ఈ గుండె గూడుపట్లు ఎక్కడో కదిలినవి
ఈ కనులు వరదలై పారినవి
ఈ కలలు కాగితపు పీలికలై రాలినవి'

అని కన్నీరు ప్రవహింపజేసి 'ఈ ఆర్తి ఏ సిద్ధాంతరాలకు పయనింపగలదు?' అని దిగులుగా ప్రశ్నించి చదువరుల గుండెలలో చెరిగిపోని ప్రశ్నగుర్తును మిగిల్చారు. ఇంతగా కరిగించగలిగిన యీ గీతం చదవగా, చదవగా భావరమణీయమని పాఠకులను పట్టి విడువకపోయినా, భాషలో కొంత సాంస్కృతిక పదజాలం అక్కర లేనంతగా చోటు చేసుకున్నది. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ శ్రీ కుందుర్తి 'పూర్వ వాసనలను పూర్తిగా వదలించుకోకపోవడం వల్లనూ, గట్టి సమాసాలో' గొట్టుసంస్కృత పదాలో లేనిదే కావ్యరూపం సిద్ధించదేమోననే సందేహంవల్లనూ, ఆధునికులైన కవుల్లో చాలమంది, యీ దృష్ట్యా చూసినప్పుడు తప్పటడుగు వేస్తూ వున్నారనే చెప్పవలసి వస్తుంది. తిలక్ కూడ యీ పరిస్థితిని తప్పించుకోలేక పోయిన సందర్భాలు చాలా చోట్ల కనిపిస్తాయి' అని ఉదాహరణంగా 'కొత్తసింగారమ్ము వలదు, ఉదాత్త సురభిళాత్తశయ్యా సజ్జితము వలదు, రసప్లావితము వలదు' అనే పంక్తులను చూపించారు. కాని క్షయ్యగ్రస్త భార్య యిక బ్రతకదని డాక్టరు చెప్పినపుడు 'ప్రచండ వాతూల హత నీపశాఖివలె గజగజ వణికిపోయిన అరక్త అశక్త గుమాస్తాని'గూర్చి చెప్పేటప్పుడుమాత్రం ఆ విధమైన శైలీవిన్యాసం తిలక్ ప్రత్యేకత. ఈ ప్రత్యేకతను రసజ్ఞులాదరిస్తూనే ఉన్నారు. 'ప్రార్థన' అనే గీతంలో

దేవుడా
రక్షించు నా దేశాన్ని
పవిత్రులనుండి, పతివ్రతలనుండి
పెద్దమనుషులనుండి, పెద్దపులులనుండి
..........................
లక్షలాది దేవుళ్ళనుండి వారి పూజారులనుండి
..........................
శ్రీ మన్మద్గురు పరంపరలనుండి'

అంటూ ప్రారంభించిన గీతంలో బిగాచిపట్టిన పాత విలువలను దులిపేసి'

'నలభై కోట్ల మనుష్యుల నిజమైన ప్రాణంవున్న
మనుష్యులతో నిండినదేశం నాది'

అని వాస్తవాన్ని ప్రదర్శించి మానవత్వానికి పట్టం గట్టి

'మంచిగంధంలాగ పరిమళించే
మానవత్వం మాకున్న ఒకేఒక అలంకారం'

అని ప్రకటించి 'ఆశల వెచ్చని పాన్పుమీద స్వప్నాల పుష్పాలు జల్లుకుని' నిద్రపోవడాని కనుమతించమని దేవుని ప్రార్థన చేశారు.

రేపటి గురించిన భయంతో, సంఘభయంతో అజ్ఞాతంగా తమలో దాగిన తమను చూసిన భయంతో గతంలో కూరుకుపోయిన ఆ మనుష్యులను చూసి "కోపగించకు,; అసహ్యించుకోకు' అని 'చిన్నమ్మ'తో "సింబాలిక్'గా చెప్పారు. ఈ గీతానికి నీడలు అనే పేరుపెట్టటంలోనే కావ్యౌన్నత్యం కన్పిస్తుంది. వీళ్ళు మనుష్యులు కారు, మరి సగంసగం మనుష్యులు గదా! అందుకనే 'నీడలు'. బరువుగా బెదురుగా వీళ్ళిలా బ్రతకటానికి వీల్లేదు. వీళ్ళ మధ్య "డైనమైట్' పేలాలి; 'డైనమోలు' తిరగాలి; వీళ్ళు రేపటి ఉదయానికి యీ వేళ వెలుగుల్ని సమకూర్చుకోవాలి' అని సామాన్యం జీవితాన్ని ప్రతిభావంతంగా తీర్చిదిద్దారు. వీరికి మనుష్యులపట్ల కసి, జాలి యీ గీతంలో ద్యోతకమవుతాయి.

'వెళ్ళిపొండి; వెళ్ళిపొండి' అనే గీతంలో యుద్ధం ముగిసినపిమ్మట రణస్థలిలో తిరుగాడుతున్న అభాగినులనుచూసి జాలిపడి, కన్నీళ్ళు కార్చి, యుద్ధానికి కారకులైనవారిపట్ల ద్వేషం ప్రకటించి "వెళ్ళిపొండి – మీ రోదన మీలోనే అణచుకొని; మీ కళ్ళను మీరే పొడుచుకుని' అని పిచ్చెత్తిన్నట్లు అరిచి యీ గీతాన్ని ముగించారు. యుద్ధాల చరిత్ర ఎప్పుడూ ఒకటే; కారకులందరూ వొకటే. కృష్ణుడయినా, బుస్సీయయినా, బిస్మార్క్ అయినా, హిట్లరయినా అందరూ మహాహంతకులేగా మరి! కాని దుర్భరమైన ఆ సంధ్యాసమయం ముగిసేవేళను, చీకటిపడేవేళను–యీ విధంగా వర్ణించారు.

'చిరుతపులులు పశువుల్ని
వోట కరచుకుని పోయేవేళ
పాడుబావిలోకి పడుచు
విధవలు దూకేవేళ
చచ్చిన చరిత్ర భూమికలకోసం
కుక్కలు కొట్లాడుకునే వేళ
దెయ్యపు మర్రిచెట్టుమీద
దీనంగా అరుస్తూ పిట్టలుకళ్ళు తేలవేసేవేళ'

యిన్నిన్ని దృశ్యాలొకే గీతంలో చూపింపగలిగిన ప్రతిభ మహాకవులకే సాధ్యం.

'పాడుపోయిన ఊరు'లో జీవితం కాలిపోయే యిల్లులాగ, కాలం పాడునుయ్యిలా కవికి కనిపించగా నిస్పృహతో కుంగిపోయారు. 'శిఖరారోహణ' అనే గీతం ఉగాది సందర్భంలో రేడియోలో ప్రసారితమై భారతిలో అచ్చయి వచ్చింది. తిలక్ కవితలోని మంచి గీతాలలో యిది వొకటి. 'లైట్లు వెలిగిన స్టేషన్ లోకి రైలు వచ్చినట్లుగా కొత్తసంవత్సరం హుషారుగా రావాలి మన మధ్యకి' అని కొత్త సంవత్సరాన్ని ఆహ్వానిస్తూ, వట్టిమాటల రాజకీయనేతలనూ, పాతమాటల మూటల కవులనూ అపహాళనచేస్తూ

'రైలింగ్ అవతల టిక్కెట్లు దొరక్క
ప్రజలు దిగులుపడి నుంచున్నారు
రేపటి ఉదయానికి వేసిన పట్టాల్ని
ఎవరో "తొలగించి వేశారు'

అని ప్రజపట్ల ప్రగాఢమైన అభిమానాన్ని ప్రదర్శించారు. ఈ గీతంలో తిలక్ కవిత సౌందర్యంతోనూ, మానవతతోనూ, అభ్యుదయంతోనూ పరవళ్ళు తొక్కింది.

'ఇక్షుకోదండ జ్యావల్లి వాస్ఫాలించబోయి
చటుక్కున ఎందుకో మన్మథుడు వెనక్కి
అడుగు వేశాడు.
ఆమ్రశాఖాగ్ర పుంస్కోకిల నమ్రై ప్రకటించింది
పల్లవం ముట్టదు గొంతుక విప్పదు
అన్యోన్యానురక్తులైన యువతీ యువకు
లొక్కపిరిగా
హలాహలావ్ ట్విస్ట్‌లా పిపి అపమ్మతి ప్రకటించారు'

కాల్పనికోద్యమపు రమ్యభావన యీ పాదాలలో రూపుదిద్దుకొన్నది–'పుంస్కోకిల'కూ 'ట్విస్ట్'కూ

ఒకే గీతంలో పొత్తు కుదర్చటం భాషపై కవికిగల అధికారాన్ని వ్యక్తం చేస్తున్నది. కొత్త సంవత్సరాన్ని కొత్త కోడలుతోనూ, మధ్యతరగతి సంసారంతోనూ పోల్చారు. ఖండ ఖండాంతరాలలోని మానవుని గూర్చి తలపోస్తూ'

అది మానవుడు నిలిచి పూరించిన శంఖం
ఇది సంగ్రామానికి సూచన
ఇది ప్రస్థానోష్ర కనుణిక'

అని మానవతలోని మహత్యాన్ని యెలుగెత్తి చాటుతూ మానవుని చరిత్రగమనం నిరంతర సత్యసౌందర్యాన్వేషణయనీ 'శిఖరారోహణ'యనీ వివరిస్తారు. ఈ గీతంలో కాలంగూర్చి వర్ణిస్తూ 'అంధయుగమైనా స్వర్ణయుగమైనా అది మన ప్రతిబింబం' అని స్పష్టం చేసి, గతకాలపు గొప్పతనం తక్కువేనని తెలియజెప్పి,

'మురికి కాల్వమీద ముసలితనంమీద
మృషాజగతి మీద
మహోదయం వికసించదు, వసంతం హసించదు'
'సంప్రదాయ భీరువుకీ
అన్వతంత్ర వితంతువుకీ వసంతం లేదు'

అని హెచ్చరించి 'సాహసికానివాడు జీవన సమరానికి స్వర్గానికి పనికిరాడు' అని మునుముందుకు నడిపిస్తారు.

'వేసవి'గీతంలో తిలక్ ఛందశ్శక్తి పాఠకులకు వేసవి తీవ్రతను వ్యక్తంచేస్తుంది. వేసవిలో

'కాలం కదలదు, గుహలో పులి
పంజా విప్పదు, చేపకు
గాలం తగలదు'

అని గడుసుగా వేసవిని కొద్దిమాటలతోనే సూచిస్తారు. కరుణరసానికి పరాకాష్ఠ యనదగిన

'ఎండుటాకులు సుడిగాలికి తిరిగెను
గిర్రున, వడగొట్టిన భిక్షుకి అరచెను వెర్రిగ
పంకాకింద శ్రీమంతుడు ప్రాణం
విడచెను, గుండెకింద నెత్తురు నడచెను'

అనే పంక్తులలో శ్రీమంతునకూ, భిక్షుకికీ మరణం సహజమే నంటారు. శ్రీ శ్రీ 'భిక్షువర్షీయసి'లాగే యీ గీతమూ పాఠకులను నిలువెల్లా కరిగిస్తుంది.

'కఠినోపనిషత్'లో సంప్రదాయాన్ని త్యజించి అభ్యుదయంవైపుకు కవి పాఠకులను నడిపించారు. మానవారణ్యంలోని పెద్దపులులు సిటీలో సభావేదిక మీద కథాకళి నృత్యంచేస్తున్న దుర్దినాలను చూస్తూ 'అతగాడు' ఒక్కడూ బిడ్డతేరిన ముఖాన్ని కన్నీళ్లతో టాయిలెట్ చేసుకొని చేసుకొని ఊపిరాడని గదిలో ఉరిపోసుకు చనిపోతాడు.

'వెలుగుని వెనక్కి నెట్టుతూ రేపటిరోజుకి
పదివేల సంవత్సరాలనాటి పాతముఖాన్ని
అతికించేందుకు
ఒక హాహాహూహూవు ప్రయత్నిస్తున్న
ప్రాతఃకాలాన'

వారి నెదిరించి అతగాడేం చెయ్యగలడు? 'చరిత్ర శిశువుకు బొడ్డుకు బదులు పొట్టను కోసిన అవివేకపు మంత్రసానులవలె దేశాధినేతలు తెల్లబోయి నిల్చిన సమయాన, 'అతగాడు పరీక్షనాళికలో ఎండిన నాగరకత గుండెని పరీక్షించి కొంచెంకొంచెం నెత్తురుతో తడుపుతున్నా'డట !

'తూలిన తాగుబోతు, కూలినయింటి వడికుప్ప
'బతుకు రైలుదారిలో వాలిన మృత్యుపురెక్క'

వీటిని జీవితపు తత్వంతో మేళవించి కవిత్వాపు కేన్వాస్‌మీద తిలక్ రచించాడు.

'నిన్నరాత్రి'లో జగతిని సృష్టించిన జగన్నాటక సూత్రధారినే చూచి జాలిపడి, తాను సృష్టించిన సృష్టియే తన కెదురుతిరగ్గా దేవుని చెక్కిళ్ల మీద దీనంగాజారే కన్నీటిని దీపకాంతిలో చూసి చటుక్కునలేచి కౌగిలించుకుని ఊరడించి వీధి చివర దాకా సాగనంపివచ్చి కవిగా

'మానవుడే దానవుడై తిరగబడినప్పుడు
పాపం పెద్దవాడు—కన్నకడుపు—ఏంచేస్తాడని!

జాలిపడే మహోన్నత మానవుడు తిలక్.

ముసలితనంవచ్చాక మరణభయంపట్టుకొని వేధించగా తాను సాధించేదేమో వెనుదిరిగి చూసుకుంటే ఒకనాడు తాను సామ్యవాదియైనా, ప్రొఫెసరైనా, గ్రంథకర్తయైనా వాటితో తాను సాధించేదేమీలేదని, ప్రేమించి పెండ్లాడిన భార్యశుష్కించి

పక్షవాతం వొస్తుందనే భయంతో దీనంగా ఉండగా, తనకు మిగిలిన కలలు 'డాక్టరు స్టెతస్కోపు; విరిగిన బాతుమెడ; దున్నపోతులు; తన భార్య శవమే' కాగా తన బ్రతుకొక్క ఆరిన వత్తికొడిలా తలచి తనను గూర్చి జాలిపడమని అడిగే 'సగటు మనిషి' 'ముసలివాడు' గీతంలో ప్రత్యక్షమౌతాడు.

'ప్లస్ యింటూ మైనస్' గీతంలో కవి ఔపనిషదిక సత్యాలు బోధించినట్లుగా'

తాను లేనిదే దేవుడిని
తలచే వాడెవడూ లేడంటాడు మానవుడు
తాను లేనిదే మనిషికి ఆలంబన ఏదంటాడు
సదరు దేవుడు
ఈ రహస్యం రహస్యంగా వుంచకండి
అందరికీ చెప్పెయ్యండి
దేవుడిని తింగేస్తే మానవుడు,
మానవుణ్ణి తలక్రిందుచేస్తే దానవుడు'

సూక్తులను చెప్పినా కవితాపరిమళం ఆ సూక్తులలో లోపించలేదు. 'న్యూసిలబస్' అనే గీతంలోనూ చమత్కారమూ గంభీరమైన అర్థమూ కలిసి వచ్చేటట్లుగా,

ఆశ ఉత్తర ధ్రువం,
విధి దక్షిణ ధ్రువం
మనిషి రెండింటి మధ్యా
యెగిరిపడే ప్రహసనం'

'ఇజంలో యింప్రిజన్ అయితే
యింగిత జ్ఞానం నశిస్తుంది
'విశ్వనాథవారు వెనక్కి
నడవగా నడవగా
వేదకాలం యింకా
వెనక్కి వెనక్కి పోయిందట.'

'మతం నల్లమందు
గతం ముదిమికి విందు'

వీటితో వచన కవిత్వంలో రసాత్మకమైన వాక్యాలను పలికి వాటిని చిరస్మరణీయాలొనరించ గలిగారు. జీవితపుజూదంలో 'బెదరిపోకు, భీతావహుల కిచట స్థానం లేదు, ఎదురుగుండె సరితీసుకు మండేఅగ్నికుండానదూకు, చివరికి మిగిలిన బూడిదలో చిన్నమెత్తు స్వర్గం దొరకదు—యీ విధంగా తాత్త్వికుడై పెదవి విరచి, జీవితాన్నిచూచి నిస్పృహ పడిగూడ కవి, జీవితం అగ్నిగుండమైనా భయం లేక దుముకమనే ప్రబోధించారు.

సామాజిక ప్రగతి నాశించే అభ్యుదయ కవిత్వం తిలక్ కావ్యఖండికలలో 'వసుధైక గీతం; సి. ఐ. డి. రిపోర్టు; మేగ్నాకార్టా; ప్రకటన; గొంగళి పురుగులు; భూలోకం; శిక్షాపత్రం; స్వేచ్ఛావిహారం'— మొదలైన వాటిలో అనుభూతికి ప్రాధాన్యమిచ్చే వ్యక్తివాదాన్ని కూడ కలుపుకుని దర్శనమిచ్చింది.

మానవులందరినీ 'ఏకరక్తబంధువులుగా, అవిభక్త కుటుంబులు'గా భావించే వసుధైక భావన వసుధైక గీతంలో ఉన్నది. ప్రసన్నమైన పలుకులతోనే కవి జాతిమతాల సరిహద్దుల్ని చెరప ప్రయత్నిస్తున్నాడు. అందుకే

'సంకుచితమైన జాతిమతాల
సరిహద్దుల్ని చెరిపి వేస్తున్నాను నేను
అకుంఠితమైన మానవీయ పతాకను ఎగుర
వేస్తున్నాను చూడు
చరిత్రల రక్తజలధికి స్నేహసేతువు
నిర్మిస్తున్నాను రండి
కవి వచస్సవిత్పకాంతి పూరమిది స్వేచ్ఛగా
జలక మాడండి'

అన్నారు.

సి. ఐ. డి రిపోర్టు; గొంగళి పురుగులు అనే ఖండికలు రెండూ సామాన్య గుమాస్తా జీవితచిత్రణలు. అయినా పురం కోటేశ్వరరావు అనే సాదా గుమస్తా హఠాత్తుగ చనిపోతే సి. ఐ. డి. రిపోర్టు వెలువడిన తీరు సీ వచనగీతంలో చిత్రించారు.

'ఇతని తాలూకు వివరాలేవీ
ప్రమాదంరంగా లేవు
ఇతని తండ్రి గుమాస్తా
తాత గుమస్తా ముత్తాత గుమాస్తా'

అని కోటేశ్వరరావు నిరపాయకరమైన మనిషిగా పేర్కొంటాడు. కోటేశ్వరరావుయింట్లో బాత్‌రూమ్

ఔలివిజన్ లాంటిదట. 'ఎట్టి చొక్కాలు ధరిస్తాడుకాని కమ్యూనిస్టుకాడు; ఇతను సందుల్లోంచి నడుస్తాడుకాని స్కరియలిస్టుకాడు; నడుస్తూ నడుస్తూ నవ్వుతాడు, గొణుక్కుంటాడు, కాని యోగికాడు; అలా ఆకాశంకేసి వెర్రిగా చూస్తాడు కాని అసలు కవేకాడు' 'పి. డీ. లు ఎందుకొస్తాయో తెలియదు; ఆఖరుకి బీడీలు కాల్చడమైనా ఎరగడు'— ఈ విధంగా క్లార్కు కోటేశ్వరరావు జీవితాన్ని తుణ్ణంగా చదివినట్లు చమత్కారంగా తాత్త్వికంగా వివరించారు. ఈ విధమైన ప్రతిభ ఆరుద్రగారి 'సినీవాలి'లో క్లార్కు సూర్యారావు చిత్రణలో కనుపిస్తుంది. కోటేశ్వరరావు జీవితంలో సుఖపడనే లేదనే విషయాన్ని సూచనగాచెప్పి 'రిపోర్టు' ముగించారు. గుమాస్తా జీవితం దుర్భరమనీ, ఆగామి ఆశల మకరందాని కెదురుచూస్తూ, ఎప్పటికీ సీతాకోక చిలుకలుగా మారని 'గొంగళి పురుగులు'గా గుమాస్తా జీవితాన్ని దయనీయంగా కళ్ళకు కట్టించారు. చావటానికూడ ధైర్యం లేనట్లుగా బతికే గుమాస్తా జీవితంలోనూ కలలుకమ్మగానే (అవి కూడ అతడి దౌర్భాగ్యానికి తగ్గట్లే) వస్తాయి!

'బస్ స్టాప్ దగ్గర పరాయి ఆడది
తనకేసి చూసిందని
మెరీనా కాంటీన్ యువతల నుంచుంటే
మినపట్టు వాసన ఘాటుగా వేసిందని
అసలు అప్పుడే కాంగ్రెస్‌లో చేరివుంటే
ఈ పాటికి మినిష్టర్ని అయిపోయి వుండేవాడినని
పెళ్ళాం దగ్గర చెప్పాలని సర్దాపడి
'అయ్యో రామ నీ బతుక్కి' అన్నట్టు మూతి
విరిచే
అర్ధాంగి ఆకారం తల్చుకుని,
ముడుచుకు పోయిన
గొంగళి పురుగు
అతన్ని తనే తీసుకుని గోడ అవతలికి
తన్ని తనే గిరవాటేసుకుంది'—

కోటేశ్వరరావయినా, వీరేశ్వరరావయినా, జోగేశ్వరరావయినా సాదా గుమాస్తా జీవితం యింతే, యింతే! అందరూ గొంగళీ పురుగులే!

తిలక్ కవిత్వానికి ఖ్యాతి తెచ్చిన గీతం
'మేగ్న కార్టా'.
దీనిలో—
'మేం నవీనులం
మేం భావుకులం
పాత లోకపు గుండెలో శతఘ్ని పగిలించి
భావికాలపుచంద్రకాంతశిలల కరగించి
పాటపాటకి సోకు స్వర్గంలాగ
మాటమాటకి దూకు సింహంలాగ
మేం నిలుస్తాం
మేం పిలుస్తాం'

అని యెలుగెత్తి చాటారు. అభ్యుదయంతోపాటు కరుణకూడ తిలక్ కవిత్వానికి బొమ్మాబొరుసులే.

'మాకు దాస్యంలేదు
మాకు శాస్త్రం లేదు
మాకు లోకం ఒక గీటురాయి
మాకు కరుణ చిగురు తురాయి'

గీతమంతా వొక యెత్తు; శీర్షిక 'మేగ్న కార్టా' వొకయెత్తు. 'ప్రకటన' అనేగీతంలో పుష్కలంగా ధ్వని ఉండటాన దానికి ప్రత్యేకమయిన అందం వచ్చింది. 'శాంతి' పరారీ అయితే పట్టుకోవటానికి జరిగే ప్రయత్నంలో యీ ప్రకటన వెలువడుతుంది. ప్రగతి భావాన్ని గుండెలోనుండి వెచ్చగా వాడిగా గుండెకు తాకేలాగ

'కూడులేని లోకం యిది
గుండెలోతు తాపం యిది
సోమయాజి శాపం యిది
భూమి అడుగులోకం యిది'

అని చెప్పి ఆగకుండా

ఒకే రకపు తోలు బొమ్మ
లొకేవైపు ఒకే నడక
ఎక్కడికే తల్లీ — యిట
ఏదో కత్తులనది'

అని కాలస్వభావాన్నిగూర్చి విచారం ప్రకటించారు.

'ఆకలేసినపుడు కొట్లో మిఠాయి కాజేద్దామనే
యానాదిపిల్ల ఆటకళ్ళు

ఆపుకోలేని యౌవనంలో తప్పటడుగు వేసిన
పెళ్ళికాని పిల్ల కన్నీళ్ళు
అరులక్షలున్నా దొంగ నిలువలు వేసే
షావుకారు అజ్ఞానపు కుళ్ళు
తోడేలు గొర్రెను చంపి తాగుతూన్న నెత్తుటితో
సృష్టి క్రూరపు ముళ్ళు
ఆకతాయి మొగుడైనా ఆ వేదన ప్రతిబింబాన్ని
అప్యాయంగా మోసే ఆడదాని ఒళ్ళు'
వీటన్నిటినీ యీ రచనలో చూపించి
'ఎన్నెన్ని ప్రాణాలు ఇవన్నీ దీపాలు'

అని వాటికి అంజలి ఘటించారు 'దీపం' అనే గీతంలో.

'న్యాయం తన భయంకర
ఛత్రం విప్పినపుడు
ధర్మం కత్తుల బావుటా
ఎగురవైచినపుడు
గత చరిత్రలు నక్షత్రాలై
కన్నీళ్ళు కార్చినపుడు
ఓ వర్తకుడా! ప్రభుత్వాధ్యక్షా
ఓ స్వార్థజీవి!'—

భావి మైదానంలో మాకోసం విద్యుత్ రజ్జులతో ఉరి వుచ్చులు' ఎదురు చూస్తున్నాయని 'శిక్షాపత్రం' వ్రాసి సిద్ధంచేసి ఉంచారు. 'స్వేచ్ఛా విహారం'లో అభ్యుదయ కవిపలె

'జామెట్రీ, కాలెక్యులస్
అక్కయ్యకు రెండో కామువు
తమ్ముడికి మోకాలివాపు
చింతపండు ధర హెచ్చింది
చిన్నాన్నకు మతిభ్రమ కలిగింది
లేచిన మరుక్షణం ఎన్నో ప్రశ్నలు'

అని ప్రారంభించి అంతలోనే కాల్పనిక కవుల కలల లోనికి కొనిపోతూ

'కొంచెం సేపు స్వప్నంలోకి
గోర్వంకల రెక్కలతో
ఎగిరిపోదా మన్నీ మరచి'

అని పలాయన వాదం ప్రబోధించారు. దీనిని పలాయన వాదమంటారని శ్రీ తిలక్ ఎఱుగును. అందుకే

'నన్నూ నిన్నూ బలహీనులనీ
ఎస్కేపిస్టులనీ నిందిస్తుంది
ఊపిరాడక గిజగిజలాడే యీ లోకం'

అని చెప్తూ సమర్థించుకో జూచారు. సింధూరం కన్న ఎరుపైన తన హృదయాన్ని చదువలేదంటూ అనుభూతులలోకి జారిపోయి పలాయనవాదమే స్వీకరించారు. అన్యాయపరులపైన జాలిని చూపించి 'శిక్షాపత్రం' రచించిన కవి యీ విధంగా జారి పోవటం క్షంతవ్యం కాదు. తిలక్ కవిత్వంలో అభ్యుదయం యెంత ఉన్నా ఆయన హృదయం సౌందర్యం కోసమే తహతహలాడిందని చెప్పవచ్చు

సౌందర్యోపాసనతో కవి వెలువరించిన గీతాలీ సంపుటంలో 'చావులేనిపాట; కిటికీ; యుగఃగీతిక; అదృష్టాధ్వగమనం; ప్రవహ్లిక; సంధ్య; గుండెకింద నవ్వు; విరహోత్కంఠిత; చిన్నారికి చిన్నమాట; రాత్రి వేళ; అద్వితీయం; నువ్వు లేవు నీ పాట వుంది; ఆ రోజులు; మొదలైన వాటిల్లో కొన్నిచోట్ల స్పష్టంగా, కొన్నిచోట్ల అభ్యుదయంతో విడదీయ రానంతగా కలగలసిపోయి కన్పిస్తాయి.

'అమృతం కురిసిన రాత్రి'అనే ఖండికలో వెన్నెల మైదానంలోనికి కవి ఒక్కడే వెళ్ళి అప్సరసలు వొయ్యారంగా వేరుగెత్తడాన్ని, పృథువక్షోజనితంబ భారలై యౌవనధనుస్సుల్లా వంగిపోవడాన్ని చూసి మనకూ చూపించారు. అప్సర లాతణ్ణి చూసి 'ఆనందం మనిషైనవాడు' 'జీవితాన్ని ప్రేమించిన వాడు జీవించడం తెలిసినవాడు' 'ఇతడే సుమీ మన ప్రియుడు' అనీ అనుకున్నారట. అమృతాన్ని త్రాగి దుఃఖాన్ని చావుని వెళ్ళిపొమ్మని, కాంక్షామధుర కాశ్మీరాంబరం కప్పుకొని, జీవితాన్ని హసన్మందార మాలగా' ధరించాడట తాను.

తాను నిర్మించుకొన్న ఆశాచంద్రశాలలో కాలం కరిగి వెన్నెలకాగా, భావం వీణానిక్వాణము కాగా, ఒక్క కౌముదీశీతలకిరణరేఖ జాల్వారినా, ఒక దయామయి అడుగుసవ్వడి పలుకరించినా పరవశించి

పోయి 'కోటిపువ్వుల్ని పూస్తాను; కోటినవ్వుల్ని జల్లుతాను' అంటారు.

'కిటికీ' తెరిస్తే క్షితిజరేఖ కనబడటమే గాకుండ తనకూ అనంతానికీ మధ్య వ్రాలిన వినీల తమాలశాఖ కనిపించిందనీ, ఉన్మదిష్ణువుస్పృష్ట వేణువూదిన రహస్యగానం వినబడిందనీ, ఇంకా తనకు ఉత్తాలశిఖరంమీద పగిలిన సూర్యగోళపుకాంతి, ఊదా రంగు మంచు కురిసిన ప్రథమోదయ దృశ్యమూ కన్పించాయట. కిటికీ తెరిస్తే యింకా రోడ్డుమీద వచ్చిపోయే జనం ఆశానిరాశల వంతెనల మీదనుంచి దిగటమూ, ఆకలీ కామం అవసరాల మార్కెట్‌లో వెళ్ళడమూ కనిపించిందట. గదికీ మదికీ కూడా గవాక్షాలుంటాయి కాబట్టి మదిలోని గవాక్షం తెరిస్తే ఆనందప్రియబాంధవికోసం మరో వూరు వెళ్ళాలని తహతహలాడే అసంఖ్యాక ప్రయాణీకులు పడిగాపులు పడినుంచుని ఉండటం కనపించిందట. ఐతే.

'ఎడ్వాన్సు బుకింగ్ లేదు
ఎప్పుడు రైలొస్తుందో తెలియదు
పిగ్నలిచ్చేవాడు తన గదిలో
చిత్తుగా తాగి పడుకున్నాడు'

ఎల్లా మరి? కిటికీ అవతల దృశ్యాలను 'యుగళ గీతిక'లో చూపించారు. ఆమె చిరునవ్వులో కవిత్వం లాంటి క్రొత్తదనం మెరియటమూ, ఒక వెన్నెల బిందువు కొబ్బరి మొవ్వులోనికి జారినట్లు వినపడీ వినపడని చప్పుడు వినపడిందనీ అంటారు. 'అదృష్టాధ్వగమనం'లో తాను పుట్టినప్పుడు 'ఏపిచ్చి పొగడపువ్వులగాలి సోకిందో, ఏ పండువెన్నెల మత్తు కమ్మిందో, ఏ పికిలిపిట్ట కిటికీలోకి తనకేసి చూసి నవ్విందో'గాని ఆశతో, విశ్వాసంతో, ఆత్మబలంతో 'రాత్రిందివాలమధ్య రహఃకిర్మీరరథ్య' పడిపోతుండగా ఎన్నెన్నో అఘాతాలు, అడ్డంకులు వచ్చి తన గుండెలో మానని గాయాలను చేశాయని వివరించారు. అయినా యిప్పటికీ మధుమాసంలో తన గళాన సౌందర్య మధూళిచిందుతుందనీ, కోటి మనస్సరస్తీరాల తన కవిత కోరికలకోణాకారపు కొత్తచెట్లని నాటుతుందనీ సంతృప్తినీ ప్రకటించుకున్నారు.

'వవహ్లీక'లో దట్టమైన అడవులలోని
నిగూఢ రహస్యాలు
దాచుకున్న కన్నులు
కలదానా ఆడదానా!'

యని పిలిచి 'నాకు తల్లివి నెచ్చెలివి చెలివి; నన్ను కౌగలించుకొన్న పెద్దపులివి' అన్నారు. ఈ మాటలు పాఠకుల నాలోచనా మగ్నుల్ని చేసి ఆనందంలో ముంచెత్తుతాయి.

'సంజెపెదవులఎరుపు కడలి అంచుల విరిగి
సంజె పరికిణీ చెరగు ఎడద లోతుల మెరసి
ఏటి కొంగల నిదుర ఎర్రగా ప్రాకింది
బాతురెక్కలనీడ బరువుగా సోలింది'

సంధ్యాసమయపుటందాన్ని 'సంధ్య' అనే పేరుగల ఖండికలో పదచిత్రంగా వ్రాశారు. ఆకు ఆకునీ రాల్చిన కడిమి చెట్టుకన్నా, రేకు రేకునీ తొడగిన మొగలి మొక్కకన్నా 'గుండెకింద నవ్వు' అనే శీర్షికే చాలు మనలను ముగ్ధులను చేయటానికి. 'వానలో నీతో' అనేది యెంచక్కటి ప్రేమగీతం—అరటితోట నడుం చుట్టి కాలువ ఏటవాలుగా మలుపు తిరగటాన్ని ప్రకృతి చిత్రకారులవలె వ్రాశారు. విరహోత్కంఠిత లోని కవిత్వం కొత్తసీసాలో పోసిన కొత్త ద్రవం. Mystic గా

'హేమంత సమీర పోత మేమింతగా క్రొవ్వి
నన్నలయించుము
ఎందుకింత నిర్దయ ప్రభూ!'
అని జాలిగా వేడుకొన్నారు.
'చిన్నారికి చిన్నమాట'—ఏమని?'
'జీవితం దేవతల దరస్మితం
చిన్నారీ! పెదవిమీద సింగారించు'మని.

ఇంకా 'బ్రతుకే ఊగే ముత్యాల ఉయ్యాల; బ్రతుకే ఉలిసిరి కౌగిలం చందం; బ్రతుకే లలిత లలిత లతాంత మాల' యనీ, 'రాత్రివేళ' అనే గీతము ఒకనాటి తన అనుభూతిని చక్కని పలుకులలో మధురంగా వివరించినది.

'ఇది నీవు ఇది నేను ఇరువురము
ఒకటైన ఈ నిముషమ్ము'

కాబట్టే, 'అద్వితీయం' అనే గీతంలో గంభీరంగా

'నాలో ఒదిగి ఒదిగి ఆక్రమించు
నీ లోపలనే కదలి పునరుద్భవించి
ఇది సృష్టి ఇది మిథస్సమాశ్లేష
చకిత తనుయష్టి
నేనొక పరమేష్ఠి'

నని పలికారు.

తిలక్ గీతాలను జ్ఞాపకం చేసుకొన్న వారికి 'నువ్వులేవు నీ పాట వుంది' అన్న గీతం మరపురాదు. ప్రియురాలితో తన జ్ఞాపకాలను తలచి తలచి మురిసిపోతూ, కలకవేస్తున్న తన జ్ఞాపకాలను ఛేదిస్తూ తన యెడందను తియ్యగాకోస్తూ ప్రవహించే అనురాగపు జాలు, పాఠకులను వశుల్ని చేసికొని ఊపిరాడ నివ్వదు. 'ఆ రోజులు' అనే గీతంలోకూడ ప్రణయానుభూతి చదువరులను వివశుల్ని చేసివేస్తుంది.

మానవత్వమూ, అభ్యుదయమూ, సౌందర్యమూ వీటిలో ఏయొక్క దృక్పథమూ ప్రత్యేకంగా రూపు దిద్దుకోకుండకూడ వ్రాసిన గీతాలున్నాయి. అవి 'సైనికుడి ఉత్తరం; టులాన్; కాస్మాపాలిటన్; నెహ్రూ; త్రిమూర్తులు; లయగీతం; నగరంమీద ప్రేమగీతం; యుద్ధంలో రేవుపట్టణం; మన సంస్కృతి; నవత–కవిత; దృశ్యభావాలు; శివరాత్రి; రాజమండ్రి పాటలు; నివు; పోయిన వజ్రం; తపాలా బంట్రోతు' మొదలైనవి. యుద్ధం యొక్క భీకరత్వాన్ని అభివర్ణిస్తూ, మానవుని దైన్యస్థితికి కన్నీళ్లు కారుస్తూ దేశభక్తి దృష్టితో వ్రాసినవి సైనికుడి ఉత్తరం; టులాన్; లయగీతం; యుద్ధంలో రేవుపట్టణం అనేవి వీటిల్లో చదువరులను కదిలించగలిగే రసస్పర్శ గలిగిన వాక్యాలున్నా, యీ గీతాలను కవి తగినంత కవితావేశంతో వ్రాసినట్లు కన్పించవు. లిబియాలో, బెర్లిన్‌లో, స్టాలిన్ గ్రాడ్‌లో స్వార్థం పిచ్చికుక్కలా పరుగెత్తిందని యుద్ధోన్మాదాన్నిగూర్చి వివరించారు. సైనికుని ఉత్తరం చదువుతున్నప్పుడు చదువరుల మనస్సులు యుద్ధభూమిలో విహరిస్తాయి. రణకాష్ఠము లన్ని దెసలా రాజుకొనగా పిడుగులవాన రాలుచుండగా రాబందులు గొణిగికొనెనని 'లయగీతం'లో ఆ ధ్వనులు వినిపిస్తూ, యుద్ధం అనేది 'మనిషిమేధ మనిషి గుండె విడిపోయిన ఆనవాలు' అనిచెప్పి విధిహసించు— ఇది ముగింపు అని పర్యవసానంగూర్చి భయపెట్టారు. రంగులతో కేన్వాస్‌మీద చిత్రించినట్లు యుద్ధ సమయంలో రేవుపట్టణాన్ని చిత్రించారు.

'కాస్మాపాలిటన్' అనేది చిత్రమైన గేయం. ప్రపంచమంతటా తన పేరును వ్యాపింపజేసికొన్న భవిష్యత్తులో అరవైశతాబ్దాల పర్యంతం చెప్పుకో దగినంత పేరుపొందిన 'కాస్మాపాలిటన్‌బోర్' అనే పేరుతో ప్రసిద్ధమైన వ్యక్తిని పరిచయం చేస్తారు. పిచ్చివాడిలా కనుపించే యీ వ్యక్తి

'దేవుడూ, మానవుడూ వీరిద్దరే
యీ అనంతవిశ్వంలో మూర్ఖులు
ఏ కోణంనుండి చూచినా
వీరిద్దరూ మిజరబుల్ ఫెయిల్యూర్స్'

అని చెప్పిన రహస్యం విన్నాక పాఠకులు వొక్కఉదటున ఉలిక్కిపడి మళ్లీ మొదట్నించి యీ గీతాన్ని చదువుతారు.

'త్రిమూర్తులు' ఆధునికాంధ్ర సాహిత్యపు కవిత్రయ మనదగిన విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీలనుగూర్చి సూచనగా చెప్తూ, వారి కవిత్వ తత్వాన్ని కొద్దిమాటల్లో వెలువరించిన గీతం. ఈ ముగ్గుర్నీ చక్కగా అంచనావేసి, గడుసుగా ముగ్గుర్నీ మూడు విధాలుగా శంకించారు. విశ్వనాథవారినిగూర్చి మర్యాదల్ని అతిక్రమించినందున 'మరి పనికిరాడు' అనీ, కృష్ణశాస్త్రిగారి గురించి 'మాతోపాటు నడుస్తానంటాడు; మరి నిజంగా వస్తాడా?' అనీ శంకించి, శ్రీ శ్రీగారి గురించి 'మత్తుగా పడుకున్నాడు; మరి యిప్పట్లో లేవడు' అనీ చక్కగా 'కార్టూన్లు' వ్రాసినట్లు చెప్పారు. అంతేగాని యివి ఆయన వారి కవిత్వంగూర్చి ప్రకటించిన నిశ్చితాభిప్రాయా లనటానికి వీల్లేదు.

'స్నేహా మరణిస్తే ప్రపంచమంతా ఏ విధంగా విలపించిందో, ఆకాశంలో వారాయన కేవిధంగా స్వాగతమిచ్చారో చెప్పారేగాని తన గుండె ఏ విధంగా గాయపడిందో వల్కాలేదు. 'ఎలిజీ'కి ఉండవలసిన అనుభూతిప్రాధాన్యం యీ గీతంలో లోపించింది. 'ఏకాంతంలో భూమి ధ్రువగళాలెత్తి ఏడ్చిన రోజు' అనీ 'విధుర వసుమతి మౌన విషాద గీతమాలపిస్తున్నది' అనీ చెప్పటంలో గుండెల్ని చీల్చుకుని వచ్చిన విషాదగీతంలాగ కన్పించక, భాషాసౌందర్యంకోసం తహతహలాడి ప్రయత్నించి రచించినట్లు కన్పిస్తుంది.

'నగరంమీద ప్రేమగీతం'లో సౌందర్యంకంటె వైచిత్రి: ఆనందంకంటె అద్భుతమూ ఎక్కువై కుందిర్తి 'నగరంలో వాన' గీతంతో పోలిస్తే కొంత పేలవంగానూ, ఫ్యూడలిస్టు సమాజం అనుభవించిన అందాలను కవి మెచ్చుకుంటున్నట్లూ కనిపిస్తుంది. వైచిత్రిమీద మోజు తగ్గించుకుని ఉంటే యీ గీతం మరింత బాగుండేదేమో!

సంప్రదాయాన్ని తెలిసి ధిక్కరించే సాహసమూ, అభ్యుదయమూ 'మన సంస్కృతి' గీతంలో కన్పిస్తుంది. వర్తమానావర్తఘూర్ణవీచికలకి కాళ్ళు తేలిపోయే పెద్దన్నలు ప్రాతనే పట్టుకు వేళ్ళాడతారు. కాని ప్రాతలోని మంచిని పోగొట్టుకొనే బుద్ధిహీను డెవడు? ఏ దేశ సంస్కృతియైనా యేనాడూ స్థిరబిందువుకాదు. అది 'నైకనదీ నదాలు అదృశ్యంగా కలిసిన అంతస్సింధువు'. ఈ భావం క్లుప్తంగా మహోదాత్తంగా ఉన్నది. కాని యీ గీతంలో కావ్యత్వంకంటె వ్యాసం రూపు ఎక్కువ కన్పిస్తుంది.

కవిత్వం 'ట్రాన్స్‌పరెంట్ చీకటి'గా ఉండాలని, కదిలించాలనీ, కాంతిపేటికను తెరవాలనీ తిలక్ 'నవత—కవిత'లో భావించారు. కవిత్వం ఒక 'ఆల్కెమీ' దాని రహస్యం కవికే తెలుసునంటారు. కవిత్వమనేది అంతరాంతరజ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలనీ, యీ కాలంలో బ్రతుకు; యీ ప్రపంచాన్ని ప్రతిఫలించు' అని కవికి కర్తవ్యం గుర్తు చేసి కవిత్వ ప్రయోజనంగూర్చి

'అగ్నిజల్లినా, అమృతం కురిసినా
అందం, ఆనందం దాని పరమావధి'

యని చక్కగా చెప్పారు. కవిత్వ ప్రయోజనంగూర్చి యింత చక్కగా చెప్పిన కవులు ఆధునికాంధ్ర సాహిత్యంలో అరుదుగా వున్నారు.

తిలక్ కవిత్వాన్ని అంచనా వేయటం అసాధ్యం. అభ్యుదయమూ, సౌందర్యమూ ఆయనకు రెండు ఊపిరితిత్తులు కాగా మానవత్వం ఆయన కంఠంలో నుండి ఏకైక కరుణ రసంగా వెలికుబికి పాఠకులను కదిలించి కరగించింది. సౌందర్యమే ప్రధానంగా ఉన్న గీతాలలో అభ్యుదయం ఉపాంగంగానూ, ప్రగతి ప్రధానమైన గీతాలలో సౌందర్యం ఉపాంగంగానూ ఉన్నాయి. అనుభూతి ప్రాధాన్యమైన వ్యక్తిత్వవాదంతో వెలువడిన మానవత్వమే ఏకైకలక్ష్యంగా వ్రాసిన గీతాలూ ఉన్నాయి. భాషపట్ల తిలక్‌కు మక్కువ జాస్తి. ఛందోలంకారాలకోసం ఆయన పాటుపడకపోయినా 'నా అక్షరాలు వెన్నెలలో ఆడుకొనే అందమైన ఆడపిల్లలు' అని ఆయన చెప్పుకున్నట్లే పదాలను కొన్నిచోట్ల చిత్రికలుపట్టి కొన్నిచోట్ల స్వచ్ఛందసుందరంగానూ 'సవ్యసాచి'యై ఆయన ప్రయోగించారు. తిలక్ గీతాలతో వచన కవిత్వం నిండుదనాన్ని సంతరించుకున్నది. అభ్యుదయ కవులు సౌందర్యాన్ని విడనాడకూడదన్న సత్యాన్ని కొంత వరకు గ్రహించారు. కాల్పనికోద్యమపు కవులు యీ కాలంల్లో బ్రతకాలనీ యీ ప్రపంచాన్ని ప్రతిఫలించాలనీ, మళ్లీ జ్ఞాపకం తెచ్చుకుని, కొంతదూరమైనా ప్రగతివాదులతో నడువటానికి భుజం కలిపారు. 'శబ్దవిరించి' శ్రీ శ్రీ ప్రభావం తిలక్ కవిత్వంలో అంతర్వాహినిగా కనుపిస్తుంది.

ఈ పుస్తకాన్ని ప్రచురించి విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులౌతున్నారు. అచ్చుతప్పుల విషయంలో అవి ఎక్కువగా దొరలినందుకు తమను మన్నించమంటున్నారు. అందంగా పుస్తకాన్ని అచ్చువేయాలని సంకల్పించటం మంచిదే. అందమైన ముఖంమీద దట్టంగా స్ఫోటకం మచ్చలు గుంటలుగా పడ్డట్లు యీ

పుస్తకంలో అచ్చు తప్పులు కన్పించటాన పాఠకులు మన్నించటం కష్టం. ఆరు పేజీల అచ్చు తప్పు లివ్వటంలోనూ, మళ్లీ వాటిలో గూడ అచ్చు తప్పులు పడటంవలన ప్రచురణకర్తల నిర్లక్ష్యం తెలుస్తున్నది. పాదాలకు పాదాలే విడిచిపుచ్చటం క్షంతవ్యంకాదు. మచ్చుకొకటి 'వధ్యశిలపై విరహగీతం వ్రాస్తాడు' అని 'త్రిమూర్తులు' అనే గీతంలో కృష్ణశాస్త్రిగారి గూర్చి ఉండవలసిన మరొకపాదం లేదు. శ్రీ శ్రీ వ్రాసిన 'కావాలోయ్ నవకవనానికి'అని చెప్పిన కవితా వస్తువులతో భేదిస్తూ తిలక్ వ్రాసిన 'పులి చంపిన లేడి నెత్తురూ అక్కర్లేదు' అని వ్రాసిన గీతం ఈ సంపుటంలో కనిపించదు. శ్రీ శ్రీ తిలక్ గూర్చి వ్రాసిన 'ఎలిజీ' ఈ సంపుటంలో చేర్చటం సముచితంగా ఉన్నది. చైనా దురాక్రమణ గూర్చి తిలక్ వ్రాసిన గీతా లీ సంపుటంలో ఎందుకు చేర్చ లేదో తెలియదు. ఇది వచనకవిత్వ సంపుటమైనా, మరో అధ్యాయంగానైనా కొద్దిగానే ఉన్న తిలక్ పద్యాలను, మధురమైన ఆ పద్యాలను రసజ్ఞులు విడిచి పుచ్చలేరు గనుక ఈ సంపుటంలోనే చేర్చితే బాగుండేది. ఆ పద్యాలు కొద్దిగనుక వేఱు సంపుటంగా వస్తుందనే ఆశ మరి కన్పించదు. లేక విశాలాంధ్ర ప్రచురణాలయంవారే పూనుకొంటా రేమో తెలియదు. ద్వితీయ ముద్రణలోనైనా తప్పు లన్నింటినీ సరిదిద్దుకొని సర్వాంగసుందరంగా తిలక్ కవిత్వాన్ని ఒకే సంపుటంలో అందించగలరని ఆశిద్దాము.

[కవితా సంపుటి : రచన కీ. శే. బాలగంగాధర తిలక్; ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు—విజయవాడ–2; 150 పేజీలు; వెల : సాదాప్రతి రు. 4–00. మేలు ప్రతి : రు. 5–00.]

---



# చీకట్లో మెరిసే అక్షరాలు

శ్రీ పరిగి రాధాకృష్ణ

నాకూ బాధ వుంది
నాకూ కన్నీళ్లున్నాయి
అలాని అందరికీ చాటడం గిట్టదు.
జీవితంలో తడి తగ్గినపుడు
కన్నీళ్లు ఆ తడిని
మనిషి కందిస్తాయని నాకు తెలుసు.
నా కన్నీళ్లు చీకటికే తెలుసు
నన్నెవరూ గుర్తుపట్టలేని చీకట్లో
ఆ కన్నీటిని ఖాళీ చేస్తాను.
పగలంతా గాంభీర్యముద్ర వహించే నేను!
నా కన్నీటిపై విద్యుత్కాంతి ప్రసరించి
నా దైన్యం నలుగురికంటబడకుండా
జాగ్రత్త పడతాను
జాలికోస మెదురు చూడను.
విరిగిన ఆశల ఇంద్రధనుస్సుల్ని
కాంతిలో కన్నీటి మీడియమ్ద్వారా చూపి
సానుభూతి మూటగట్టుకోవాలని
లేనిపోని తాపత్రయమెందుకు చెప్పు!
ఆ విరిగిన కలలెలాగూ తిరిగిరావు
ఆవిరైన కోర్కెలకి రూపమూ వుండదు.
అయినా నన్నుచూసి
నేనేదో సుఖపడిపోతున్నానని భ్రమించి
అసూయాద్వారాలు తెరుస్తారు కొందరు
ఆ మాటా ఈమాటా అల్లి
అల్లరి పెట్టాలని చూస్తారు.

అలాంటప్పుడే నవ్వొచ్చేది
అపుడు నే బిగ్గరగా నవ్వేస్తాను
ఆ నవ్వే లోకవృత్తానికి నా సమాధానం!

## 2

ఎప్పుడూ ఏదో ఓదానికి
ఏడవటం అలవాటైన మనిషికి
ఎప్పుడుమాత్రం సుఖముంది?
ఈ ఏడుపు చిత్రముంది
కొందరి ఏడుపు చూస్తే నవ్వొస్తుంది
కొందరి నవ్వు చూస్తే ఏడుపొస్తుంది.
ఆ ఏడుప్పు కర్థముండదు
ఈ నవ్వులో జీవముండదు.
రెంటిలోనూ ఒకే తత్వం స్ఫురిస్తుంది
స్వార్థం తొంగిచూస్తూవుంటుంది
స్వాతిశయం గంతులేస్తూ వుంటుంది
అయినా ఎప్పుడూ ఏడ్చేవానికి
ఎవరెప్పు శిఖరౌన్నత్యాన్ని గురించి
ఎగిరే పక్షుల కలరవాల గురించి
ఎత్తునుంచి దూకే జలపాతాల గురించి
ఉప్పొంగే సముద్రతరంగాల గురించి
వసంతాన్ని గురించి
ప్రశాంత జీవన మాధుర్యాన్ని గురించి
ఎంతచెప్పి ఏం ప్రయోజనం?
ఆలోచనకు తావులేని
అనుభూతి చేతకాని అవస్థలో
అయోమయాన్ని వరించిన వీళ్లని చూసి
నవ్వాలో ఏడవాలో తెలీదు.
కష్టనష్టాలకు గురై
దుఃఖం మనసు నావరించుకొని కదులుతున్నా
కన్నీళ్లురాని విషాదస్థితిలో యిరుక్కున్న
నిస్సహాయుల జీవనగమ్యాన్నిగూర్చి

నిర్భయంగా ఆలోచించలేని పిరికితనాన్ని చూసి
జాలిపడాలో వేలుపెట్టి చూపాలో పాలుపోదు!
అయినా ఒకటిమాత్రం నిజం,
ఎవరిని చూసినా
ఏదో వెతుక్కుంటున్నట్టు కనిపిస్తారు.
ఎవరిని కదిపినా
ఏదో పోగొట్టుకున్నట్టే మాట్లాడుతారు.
ఎవరినైనా అడుగు మరి
ఎగుడుదిగుడు సమాధానమే వస్తుంది
ఏదో లోపించిన భావమే స్ఫురిస్తుంది
ఎక్కడికో తెలీని ప్రయాణీకుని మనస్స్థితి గోచరిస్తుంది.

### 3

ఎప్పటికీ ఒకేలా వుండని జీవితం
ఎన్నిరంగులు మారుస్తోంది
ఎంత వయ్యారం నేర్చుకుంది
అవును మరి
అదలా మారకపోతే
జీవిత మనిపించుకోదు.
జిజ్ఞాసకు చోటూలేదు,
మనుగడ కర్థంలేదు
మనిషికి మోక్షంలేదు
ఏదో అయిపోయిందని
బ్రతుకే కుళ్ళిపోయిందని
ఆశకు తావులేదని
నిరాశకు చావులేదని
నెత్తిపై చేతులు పెట్టుకుంటే
అక్షరాల్ని సాగదీసి
అధివాస్తవిక చిత్రాలు గీస్తే
అందం హత్య చెయ్యబడుతుంది!
అంతకన్నా ఏం జరుగుతుంది?
దహించే విచారాలు తొలగిపోవు.

దిగజారే విలువలు ఎగ్రబాకవు.
మనిషిలోకి నైరాశ్యాన్నెక్కించి
మోహంమ్మాత్రం మందహాసాల పూలు
పూయాలంటే హాస్యాస్పదంగా వుండదూ!
చూసిన ప్రతిదీ చిరాకే కలిగిస్తే
తమ్ముతామే ఏవగించుకుని
మనసులో అయోమయాన్ని నింపుకుని
మార్గం కనిపించని స్థితిలో
కాంతికి దూరమైన దుస్థితిలో
కొట్టుమిట్టాడుతున్నారు కొందరు.
జీవితంలోని వెలుగు కిరణాల్ని
పట్టుకోలేకున్నారు
స్వల్పంగా వీచిన సుడిగాలికే
తట్టుకోలేకున్నారు
అనారోగ్యాన్ని అరింతలు ఊహలో పెంచుకుని
ఉన్న ఆరోగ్యాన్ని చెడగొట్టుకుంటున్నారు.
దృష్టి మాంద్యం దట్టమౌతోంది
సృష్టిపట్ల ఏవగింపు స్పష్టమవుతోంది.
ఆరిపోతున్న దీపాల్లాగా
అణగారిపోతున్న ఆశల్లాగా
విరిగి ముక్కలైన అలల్లా
కరిగి కల్లలైన కలల్లా
అస్తిత్వానికి దూరమవుతున్నారు వీళ్ళు,
ప్రస్థానం ప్రమాదాల బాటలో సాగిస్తున్నారు.

## 4

కొడిగట్టుతున్న దీపాలముందు కూచుని
కోటి నక్షత్రాల కాంతిపుంజం తమను చేరలేదని
చిరచిర లాడేవాళ్లు
గిరికీలు కొట్టేవాళ్లు
చైతన్యాన్నెలా సాధిస్తారు?
చైత్రాన్నెలా ఊహిస్తారు?

వసంతం రానేరాదనే వాళ్లను వదిలేద్దాం,
బ్రతుకు రసవంతం కానేకాదనే వాళ్ల జోలి మానేద్దాం,
కసి పెంచుకున్నవాళ్ల కళ్లకి
ముసిముసినవ్వుల్లోనూ
మోసమే కనిపిస్తుంది
కార్పణ్యం హృదయాల్లో నింపుకున్నవాళ్లకి
కారణంలేని కోపం పిలిస్తే పలుకుతుంది.
మనిషిని ఏవగించుకునే ప్రక్రియపై మమకార మెందుకు?
మనసును మోసగించుకునే మార్గాలకోస మన్వేషణ ఎందుకు?

కత్తిమీద సాములాంటి జీవితం
ఉత్తకోతలరాయుళ్లకి లొంగదు,
జారిపోయే ప్రవృత్తిగల జీవితాన్ని
పారిపోయే మనస్తత్వం పట్టుకోజాలదు.
విసురేవుంటే
కసిరే మనసేవుంటే
బ్రతుకు స్వరూపం సరిగా కంటికానదు,
ఆనందానికి బదులు అనర్థం పుట్టకమానదు.
పుట్టి మునిగిందని గట్టిగా కేకలేస్తే
అరాజకం మనిషించుకుంటుంది
అసహ్యానికి దారి తీస్తుంది
ఇది తెలుసుకున్నవాళ్లు
తెరిపినబడి తమలోకి తాము
చూసుకోగలిగినవాళ్లు—
వీళ్లే జీవితపు విలువ పెంచినవాళ్లు!
మహిని స్వర్గంగా మార్చడానికి
మెట్లు నిర్మింపగలిగినవాళ్లు!
అలాంటివారికోసమే నే వెతికేది
ఆ అన్వేషణలోనే నా ఆశ బ్రతికేది
అందుకే నా కళ్లు చీకటిగదిలో
రేడియమ్ అక్షరాల్ని చూసేది
అందుకే నా వేళ్లు
ఆశాగీతమే రాసేది!

---

# ఆధునికాంధ్ర గద్యయుగావతరణిక

శ్రీ బయ్యా వెంకటసూర్యనారాయణ

వందలాది శతాబ్దములు శాసనములలో నేకచ్ఛత్రాధిపత్యము వహించి, పద్యముతోఁగూడి ఇక రెండు శతాబ్దములు ఆ శాసనములందే కాపురము చేసి, ఇంచుమించుగ నెన్మిది శతాబ్దములకు పైగా చంపూ రచనారూప రమణీయోద్యానముల నెల్లెడ విహరించి, పద వచన విన్నపాదులలో పలుపోకడలు పోయి టీకావ్యాఖ్యాద్యలలిత సాహిత్యమునను కథా యక్షగానాది లలిత సాహిత్యమునను పదేపదే పలుకరించి, చారిత్రక ధార్మిక శాస్త్రీయ రచనల యందుండి తరచుగ తొంగిచూచి, కడకు మధురాధిపతుల కేలూతతో చాలవరకు స్వతంత్ర ప్రతిపత్తినికూడ పొందియు మా గద్యభారతి సాహిత్య సౌధము గడప త్రొక్కినపుడెల్ల నుపరితల గవాక్షము నొక్కింత తెరచి పద్యభారతి రవంత తిరస్కార భావముతో 'ఎక్కడనుండియో ఎందులకో ఈ రాక!' అనియే ప్రశ్నించుచుండెడిది. క్రీ. శ. పందొమ్మిదవ శతాబ్దము పూర్వార్ధముకూడ నిట్లే గడచిపోయెను. 'ఎవ్వరో అతిథులను సత్కరించినటుల ప్రశ్నించెదవేల? ఈ సౌధమునం దర్ధ భాగము పై నాకును నీకుఁబోలె నధికారము కలదని' యంతదనుక గద్యభారతి గద్దించి పలుకలేక పోయినది.

గద్యసందర్శన మాత్రమున నద్దానిని గద్యావతరణ కాలముగనే చెప్పఁగలముకాని గద్యయుగావతరణ కాలముగ చెప్పఁజాలము. అనేకు లొక్కుమ్మడిగ ననేకమార్గములలో నవిచ్ఛిన్నముగ నొక ప్రక్రియా విశేషము నాదరించినపుడే దానిని సాహిత్య చరిత్రలో ఆ విశిష్ట ప్రక్రియా సంబంధియగు యుగముగ పరిగణించుట సంప్రదాయము. ఈ హేతువుచేతనే క్రీ. శ. 6, 7 శతాబ్దములనుండి ఏదో యొక రూపమున గద్యము గోచరించుచునే యున్నను 19వ శతాబ్దమునుగాని ఆధునికాంధ్ర గద్యయుగావతరణ కాలముగ పరిగణించుట లేదు. కథలు కావ్యములు, నవలలు నాటకములు, వ్యాసములు ఉపన్యాసములు, ఆత్మకథలు జీవిత చరిత్రలు, యాత్రారచనలు, విమర్శలు, వ్యాఖ్యాదులునగు ననేక రూపములలో నొకేకాలమున నాంధ్రమున గద్యరచన కొనసాగుట కారంభించిన దీ పందొమ్మిదవ శతాబ్ది చరమ పాదముననే. సాహితీ స్రవంతిలో త్రుళ్లింత నాట్యమాడుచున్న యీ యాంధ్ర (గద్య) నౌకకు శ్రీ కందుకూరివారే కర్ణధారులు.

సకలప్రాణి సంతాపాపనోదనములై పృథివిని సస్యశ్యామల మొనర్పఁజాలు నమృత జలధారలఁ గురియుచున్న నీలనీరదములఁ గాంచి కేకి సమూహము వోలె నానందపారవశ్యమున కేకలు వేయుదుము కోసి కొంపకుఁ గొనివచ్చిన పంటధాన్యమును పరికించి పాటలు పాడుచు పండుగ చేసికొందుము. విద్యాబుద్ధులు గడించి, పెరిగి పెద్దవారై ప్రయోజకులైన ప్రియతనూజులఁగాంచి మాతాపితరులు ఆనంద బాష్పములతోఁబాటు వాత్సల్యసుధావృష్టిఁ గురియుచున్నారు. కమనీయ కావ్యఖండములఁ బఠియించి మనము బ్రహ్మానందసహోదరమగు రసానందానుభవమును పొందుచున్నారము. కాని ఫలప్రాప్తికాలము నందలి యీ యానందపారవశ్యమున తత్ఫలసిద్ధికి సహకారులగు పరిస్థితుల ప్రాధాన్యము వేవేళను స్మరింపకుండుట పాడిగాదు. కావున ఆధునికాంధ్రగద్య యుగావతరణమునకు సహకరించిన కొన్ని విశిష్టపరిస్థితుల నీ యవతరణికాంతర్గతముగ నిపు డొక్కింత పరామర్శింతము.

క్రైస్తవ మిషనరీల మతప్రచారోద్యమములు, ఆంగ్లేయుల ప్రభుత్వ స్థిరీకరణ ప్రయత్నములు, ముద్రణశిక్షావిధానము, సమృద్ధమగు నాంగ్లసాహిత్యముతోడి పరిచయము, అన్య సంస్కృతీ సంపర్క

సంజనిత సమాజ నవ జాగరణము, ముద్రణకళా వ్యక్తి కారచనాదికము మున్నగునవి ఇప్పట్టున చర్చింప వలసిన ముఖ్యాంశములు.

మతప్రచారము, వర్తక వ్యాపారాభివృద్ధి, రాజ్య విస్తరణము అను ప్రముఖప్రయోజనములతో పశ్చిమ దేశీయులు భారతదేశమున వ్యవహరించియుండిరి. వీనిలో మతప్రచారము మిగిలినవానితో పనిలేకుండ మొదటినుండియు సాగుచు వచ్చినది. ప్రజాసామాన్యమునందు తమ మతమును ప్రచారము చేయుట అను తమ లక్ష్యమును సాధించుటకు చిత్తశుద్ధితో వీరనుసరించిన మార్గములు ధార్మిక రంగమున పెట్టి ఫలితములు తెచ్చిపెట్టినను ఇతర రంగములలో మాత్రము దేశహితమునకే తోడ్పడినవి. అజ్ఞానము, పేదరికము జతకూడి యావహింప మూఢాచారము లకు లొంగి, పీడింపఁబడుచున్న దేశీయులకు వైద్య విద్యాసౌకర్యములను గల్పించియు, జీవనభృతిని గల్పించియు వీరు దేశీయుల సహానుభూతిని ఆకర్షించి వారిలో తమ మతమును ప్రచారము చేయసాగిరి. కేవలము క్రైస్తవమతమునందలి వ్యామోహమునఁగాక పీడితులైనతమకు విదేశీయులగు నీ మతప్రచారకులు ఉత్సాహముతో, సహానుభూతితో చేయుచున్న సేవా కార్యక్రమములకే తొలుత మన దేశీయులు వశమైరి. ఈ మిషనరీల విభిన్నములగు కార్యక్రమము లన్నిటికిని లక్ష్యము మాత్ర మొక్కటే — అది దేశీయులలో క్రైస్తవమతవ్యాపనము. ఇందులకై వారు వౌఖికము లగు ఉపదేశ విధానములవేగాక లిఖిత రచనలను విరివిగా దేశీయులకందించుటయును మార్గమునుగూడ అవలంబించియున్నారు ఇట్టి రచనలను తమంత తాముగ చదువఁగల శక్తి పొందఁగలుగునట్లు దేశీయులకు తదనుగుణమగు విద్య నభ్యసింపఁజేయు కార్యక్రమములు విస్తారముగ కొనసాగినవి. ఇందు మూలముగ ప్రజలయెదుట వారు చదువఁగలిగిన లిఖిత రచన లసంఖ్యాకముగ వెలువడఁజొచ్చెను. లిఖిత రచనలకు ప్రజాసామాన్యముతోడి సన్నిహిత సంబంధము ఏర్పడునంతవరకు గద్యరచనలు విస్తరింపవేరవు. కుల మతవర్గ భేదములతో పనిలేక సమాజములో ఎల్లరకును చదువను, వ్రాయను నేర్చుటయును పదవకాశము లభించుటకు భారతదేశ చరిత్రలో నిదియే ఆరంభము. ప్రజలలో ఉన్నత విద్యావ్యాప్తిగాని, దేశభాషలలో అత్యుత్తమసాహిత్య సృష్టిగాని వీరి లక్ష్యములు కాకపోయినను తమ మతమును ప్రచారము చేయుట అను స్వార్థముతోనైన ఈ మిషనరీలు చేసిన కృషి విద్యారంగమునను, సాహిత్య క్షేత్రమునను ముందు ముందు సత్ఫలితములు సాధించుటకు పునాదిగ నేర్పడినదనుట నిశ్చయము.

సాహిత్యమున అంతవరకు పరంపరగా వచ్చుచున్న కొన్ని ప్రక్రియలలో మాత్రమే రచనలు సాగుచు వచ్చినవి. అవియును సమాజమందలి ప్రజాసామాన్యమును దృష్టిలోనుంచుకొనికాక కొలదిమంది కవులు, పండితులు, తత్పోషకులు మున్నగువారినే దృష్టియం దిడుకొని వ్రాయఁబడినవి. సామాన్య ప్రజలు తమ తమ వృత్తులను నిర్వహించుకొనుచు విజ్ఞానమును, వినోదమును కొలదిగనో గొప్పగనో విజ్ఞులనుండి వినుట మూలముననే పొందెడివారు. అక్షరాస్యులుకాని — లేదా అట్లు కావలయుననెడి కోరికయే ఉదయింపని — నాటి ప్రజాసమూహమునకు లిఖిత రచనలతో పని యేముండును? ఇట్టి స్థితి నుండి మరలించి మొట్టమొదటిసారిగ ఏ ఒక వర్గమునకుమాత్రమేగాక ప్రజలందరికిని పఠన లేఖనములతో పరిచయము కల్పించిన మిషనరీలు చేసిన మేలు మరువరానిది.

పై ప్రయోజనములు సాధించుటకై మిషనరీలు తొలుతగ తామే దేశీయ భాషల నభ్యసింప వలసివచ్చెను. విదేశీయుల ధర్మమును విదేశీయుల భాషలోనే ప్రచారముసేయు ప్రయత్నము జరుగలేదు. తమ ప్రచార కార్యముల కామార్గము సహకారి కాకపోగా అవరోధమును, విలంబమును గల్పించునని వారెరుంగుదురు. కావున వారే దేశభాషల నేర్వ సమకట్టిరి. కాని అప్పటికి అట్టి విదేశీయులుగాని, అంతమాత్రముగనే పఠనమును లేఖనమును అభ్యసింపఁగోరిన దేశీయులుగాని ఉపయోగించుకొనఁదగిన గ్రంథములు దేశభాషలలో వెలువడలేదు. అధ్యయనము జీవితమున నవశ్యాచరణీయముగఁ దలంచిన ఒక వర్గమునకు చెందిన వ్యక్తులకు మాత్రమే వారి వారి అభిరుచి కనువగు కావ్య శాస్త్రాలంకారాది పాండిత్యపూరిత రచన లుండెడివి. ఈ

వర్గమునకు చెందని దేశీయులకు, క్రొత్తగా పరిమిత ప్రయోజనములతో ఈ భాషల నేర్వఁదలచిన విదేశీయులకు ఉపకరించు క్రమబద్ధములగు సరళ రచనలు అవసరమయ్యెను. ఇట్టి తరుణమున మిషనరీలు మన భాషల నభ్యసించుటకు వలయు కోశములు, సరళ వ్యాకరణములు, సరళములు, కుతూహల జనకములు, విజ్ఞానప్రదములునగు చిన్నచిన్న గద్య కృతులు రచియింపసాగిరి వీరు క్రైస్తవ ధర్మ సూత్రముల ప్రచారమునకును, అట్టి రచనల ప్రచురణకును భారతదేశమున ముద్రణకళను, పత్రికా రచనమును ప్రవేశపెట్టిరి. అప్పటిలో గద్యభారతి పురోభివృద్ధికి ఏ దేవతలైన ప్రసాదింపగలిగిన వీ రెండిటికన్న నుత్కృష్టములైనవి అన్యము లేమున్నవి?

భారతదేశమున నాంగ్లేయుల రాజ్య సిరీకరణ ప్రయత్నముకూడ నాడు గద్యవికాసమునకు యథోచితముగ తోడ్పడినదనియే చెప్పవలెను. పరదేశములలో పశుబలమును జూపి ప్రభుత్వమును చేపట్టిన యాంగ్లేయులు తరువాత నుంత మనుష్యత్వమును ప్రదర్శించి మనుగడను సాగింపఁజూచిరి. దేశీయులతోడి సన్నిహిత సంబంధము, దేశపాలనములో వారి సహకారము లేనిదే విదేశీయులకిట పరిపాలనము కష్టతరముగుట సహజమే కదా! కావుననే విదేశీయులగు పాలకులును పాలితులగు దేశీయుల భాషలను నేర్వవలసినవారైరి. అదే సమయమున దేశీయులలో కొందరినైన తమకు విశ్వాసపాత్రులుగను, ప్రభుత్వ కార్యకలాపములలో తమకు తోడ్పడుశక్తిగలవారుగను చేయవలసిన అవసరమేర్పడెను. ఇట్టి ప్రయత్నములకు అంతకుముందే మిషనరీలు ఏర్పరచిన మార్గములు కొన్ని సిద్ధముగనే యున్నవి. లక్ష్యములు భిన్నములయ్యు దేశీయభాషాభ్యసనమునను, దేశీయులలో సామాన్యవిద్యావ్యాపనమునందును విదేశీయులగు పాలకులు, విదేశీయులునగు మిషనరీలు త్రొక్కిన మార్గములు ఇంచుమించుగ నేకసూత్రానుగాములని చెప్పవచ్చును. అయినను ఇట్టి కార్యక్రమముల నడిపించుటలో సద్భావము, సహనము, సేవానిరతి మున్నగు ధర్మములే ఊతగాఁగల మిషనరీలకును, అధికారము చేతిలోఁగల పాలకులకును నడుమగల అవకాశములలో చాల అంతరము కలదు కదా! పాలకవర్గమునకు దేశీయభాషల నభ్యసింప ననువగు విద్యాసంస్థ లేర్పడినవి. దేశప్రజ లెల్లరకు విద్యాప్రదానమున కేర్పడిన తరువాతివిద్యాసంస్థలవంటివి కావివి. ఇవి ప్రభుత్వ యంత్రాంగము లోనివారికే ప్రధానముగ నుద్దేశింపఁబడినవి. మిషనరీల విద్యాసంస్థలు కేవల సామాన్య ప్రజాహితమునకై ఉద్దిష్టములు. ప్రభుత్వ పక్షమున నెలకొల్పఁబడిన ఇట్టి తొల్లిటి విద్యాసంస్థలలో నియమింపఁబడిన పండితులు ముఖ్యముగ విదేశీయులకు భాషాబోధన చేయుటయే గాక తదనుగుణమగు సరళ వచన రచనలను అనువాదరూపముననను, స్వతంత్రముగనుకూడ రచించెడివారు. కొందరు ప్రభుత్వోద్యోగులగు నాంగ్లేయులు ఇట్టి సంస్థలతో పనిలేకయే భాషాపండితులను చేరఁదీసి, ఆ భాషలను తా మభ్యసించుటయేగాక ఆ పండితులకు క్రమబద్ధమగు రచనామార్గమును నిర్దేశించుచుండెడివారు. దేశభాషలపై అంతగా గౌరవములేని ఆనాడు జీవనభృతికి సైతము కడు శ్రమించుచున్న ఈ భాషా పండితులు విదేశీయులగు కొందరు సహృదయుల ఆదరణ ప్రోత్సాహముల మూలమున ఆత్మవిశ్వాసమును పొంది యథాశక్తిగ తమ తమ భాషలలో సరళ రచనలు చేయసాగిరి.

గద్యరచనా విస్తరణానుకూలమగు మూఁడవ ప్రబలహేతువు నవీన విద్యావిధానము. ఆంగ్లేయులు తమ చేఁజిక్కిన భారతదేశమును కేవల బలప్రయోగమున నెల్లకాలము చేఁబట్టుకొనుటకంటె భారతీయులను ఒక నూత్నవిద్యావిధానము మూలమున తమ వేషభాషలయందు, సంస్కృతియందు మోజు కలవారినిగ చేసికొనుట చాల ఉపయోగకారియని గుర్తించిరి. తదనుగుణముగ నూత్నవిద్యావిధానము, ఆంగ్లభాషాబోధనము దేశమం దెల్లెడల వ్యాపించినవి. దీని మూలమున దేశమునం దంతవరకుగల విద్యావిధానమున విప్లవాత్మకమగు మార్పులు కలిగెను. గురుకులాశ్రమ విధానము మూలపడి మిషనరీలు, ప్రభుత్వమువారు, కొందరు సంఘసంస్కర్తలు దేశమందు నలుతావుల నెలకొల్పిన విద్యాసంస్థలు దేశీయుల విద్యాభ్యాసమునకు కేంద్రములైనవి. సమాజమున కొన్నివర్గములవారికే జీవితమున విద్యాభ్యాసముతోడి సంబంధమను నభిప్రాయములు మూలపడినవి.

కావ్యశాస్త్రాలంకారములేకాక ఆధునిక విజ్ఞానప్రదము లగు అనేకవిషయములను ఎల్లరును క్రమపద్ధతిలో నభ్యసించుట అవసరమను నంశము గుర్తింపఁబడినది. ఈ విద్యాసంస్థలలో పఠించువారికై భిన్నములగు నంతరువులలో రచింపఁబడిన సరళములగు భాషాగద్య రచనలు వివిధ విషయములలో నవసరమైనవి. నవీన విద్యావిధానము ననుసరించి పఠనీయములగు విషయముల వైవిధ్యబాహుళ్యములనుబట్టియు, పఠించువారి సంఖ్యావృద్ధినిబట్టియు దేశభాషలలో సరళములగు గద్యరచన లనంతముగ బయలుదేరఁ జొచ్చినవి. సంస్కృతాంగ్లాదులేకాక ఇతరములగు దేశభాషలును కళాశాలాస్థాయిలోకూడ పఠనీయములే అన్న విషయము గుర్తింపఁబడి తదనుగుణములగు సలక్షణ గద్యగ్రంథములు మన భాషలలో రచింపఁబడినవి. ఈ విధముగ నవీన విద్యావిధానము విషయ వైవిధ్యముతోడి అసంఖ్యాకములగు దేశభాషా గద్యరచనలు వెలువడుటకు ఎంతో దోహదకారియైనదని చెప్పఁగలము.

సాహిత్యము సమాజమునకు దర్పణము వంటిదని పెద్దలు అభిభాషణము. నాడు ధార్మిక సామాజిక రంగములఁ గల్గిన మార్పు లనంతములు. ప్రాచీనాచారము లొకప్పుడెంతటి విలువగలవయ్యు దేశకాలానుగుణముగా వాని విలువలు మారుచుండుననియు, కావున వాని నెప్పటికప్పుడు ముందుకు సాగిపోవలసిన సమాజశ్రేయస్సు దృష్టితో మార్చుకొను టావశ్యకమనియు గుర్తింపక ఆ ప్రాత సంప్రదాయములనే అనుసరించు నిద్రాణమైయున్న జాతికి చైతన్యవంతమగు పాశ్చాత్యులతోడి సంపర్కము మేల్కొలుపు గల్గించినదని చెప్పవచ్చును. అప్పటికే చాల నష్టమునకు గురియైన జాతి ఈ విషయమును వెంటనే గుర్తించినది. మతము విషయమున నౌదార్యము చూపి ప్రాచీనాచారములలో దేశకాలానుగుణమగు మార్పులు సేయు యత్నమారంభమైనది. ఇట్టి భావ విప్లవము గలుగుటచే దీనిని ప్రజాసామాన్యము నెదుట నభివ్యక్తము చేయవలసినఅవసరమేర్పడినది. అభివ్యక్తము చేయవలసిన యంశములు, వానిని వెంటనే గ్రహించి తదనుగుణముగ మెలంగవలసిన వ్యక్తులు అసంఖ్యాకముగ బయలుదేరుటచే తదర్థమై పలుభాషాగద్య రచనలు పుట్టుట కవకాశమేర్పడెను. ఏ దేని ప్రజాసామాన్యమున కెరుక పరుపవలసి వచ్చినపుడు దేశభాషలు గాక పరభాషలెట్లు సహకారులు కాఁగలవు! పాలకుల పక్షముచేరి ఆంగ్లమునఁగాని, పండితుల పక్షమును చేరి సంస్కృతమునఁగాని ప్రజాసామాన్యమునకేమి చెప్పినను చెవిటికి సంకూదిన చందమే కదా! ఇట్టి విశిష్ట సన్నివేశముల యొత్తిడియే దేశభాషా గద్య రచనలు పుట్టుటకు మూలకందములు. అధునాతనములగు పద్ధతులలో, అంతులేని పూనికతో పాశ్చాత్యులు హైందవ సమాజమును ఎనలేని వేగముతో మార్చివేయుచు మనోవాక్కాయ కర్మలన్నింటను వారిని తమ బానిసలుగ చేసివేసికొనుచుండ హిందువులు దీనిని కొంతవరకైన అరికట్టి తమ పృథక్త్వమును, అస్తిత్వమును నిలువఁబెట్టు కొన

వలసిన వారైరి. ఇందులకు సమాజమునంతను ఒక్కుమ్మడిగా కూడఁగట్టుకొనవలసి వచ్చుటచే విదేశీయ భాషా రచనలుగాని, పాండిత్య పూర్ణములగు పద్యరచనలుగాని పనికిరాక దేశభాషలలో సరళములగు గద్యరచనలు వెలువరింపక తప్పని స్థితి యేర్పడెను.

గద్య సామాన్య విస్తరణమున కధికముగ కారణములైన పై పరిస్థితులు గద్య సాహిత్య విస్తరణకును తోడ్పడినవని చెప్పక తప్పదు. ఇవి గద్య రచనావిర్భావము నవశ్య సంభావ్యము చేయుటయే గాక అట్టి రచనలకు వలయు నితివృత్తమును పర్యాప్తముగ ప్రసాదించినవి. పర్యాప్తము, వివిధము నగు నితివృత్తమును చేఁబూని, ఆవశ్యకతా ప్రేరితమగు కౌతుకముతో గద్యకృతుల వెలయింప ముత్సహించుచున్న నాటి రచయితలకు తదనుగుణములగు నూత్న గద్యప్రక్రియల రూపకల్పనాజ్ఞాన మావశ్యకమయ్యెను. ఉచితమగు వికాసమును పొందలేక, పరిమిత రూపములలోనే బంధింపఁబడి యుండిపోయిన ప్రాచీన గద్యము వారికి దిక్సూచి కాఁజాలక పోయినది. నూత్న స్థితిగతులకు సంబంధించిన నూత్న విషయములను వెలువరించుటకు వారికి నూత్న గద్య ప్రక్రియలతోడి పరిచయ మావశ్యకమయ్యెను.

ఇట్టి తరుణమున నూత్నవిద్యావిధాన సంప్రాప్తమగు పాశ్చాత్య సాహిత్యశాఖా పరిచయ మేర్పడినది. ప్రాచీనగ్రంథసేకరణ పరిష్కరణ ముద్రణాది మూలమున దేశభాషాసాహిత్య పునరుద్ధరణము జరిగి, కోశవ్యాకరణాది రచనమున తదధ్యయనాద్యానుకూల్యము కూడ నేర్పడినది. ఎందరో ప్రాచ్యపాశ్చాత్య పండితులు అనేకవ్యయప్రయాసలకోర్చి ప్రాచీన గ్రంథముల సేకరించిరి. అనేకప్రతులను పరిశీలించి, శుద్ధపాఠముల నిర్ణయించి, వ్యాఖ్యాదులతోఁగూడ ముద్రించిరి. ఇవి యన్నియుఁగూడి అంతదనుకఁగల సాహిత్యముయొక్క సమష్టిరూపము, నిశ్చితరూపము, విస్తృతరూపము గాంచుట కవకాశము గల్గినది. సాహిత్య నూత్న యుగోదయమునకు వలయు జవసత్త్వముల నిది ప్రసాదించినది. ఈ పునాదులపైననే ఆధునిక సాహిత్య సౌధ నిర్మాణము జరిగినదన్న నతిశయోక్తికాదు.

గద్యరచనావిస్తరణవిషయమున పత్రికా రచనము, ముద్రణకళ అనునవి అగ్ని, వాయువువలె తోడైనవి. ఆనాటి సంఘ సంస్కర్తలు, సాహిత్య సంస్కర్తలునగు లేఖకులు పలువురు స్వతంత్రముగ భాషాపత్రికల నిర్వహించియు, ముద్రాయంత్రముల నెలకొల్పియు సాహిత్య సాహిత్యేతర గద్యరచనా వికాస విస్తరణములకు చేసిన మేలు ఇంతింతని చెప్పనలవి కానిది. సాహిత్యచరిత్రలో ముఖ్యముగ గద్యశాఖా చరిత్రలో పందొమ్మిదవ శతాబ్దములోని ఈ రెండును విప్లవాత్మకములగు సంఘటనలని చెప్పక తప్పదు.

ఇంకను ఈ అవతరణికయందు అనేక ముఖ్యాంశములఁగూర్చి తెలుపవలసియున్నను సంక్షిప్తతకై ఒండు రెండు సంస్థలఁగూర్చియు, ఒకరిద్దరు వ్యక్తులగూర్చియు మాత్రమే కొలదిగ ముచ్చటించి గద్యయుగప్రవర్తక సంస్మరణ పూర్వకముగ తద్యుగోదయము నుద్ఘోషింతము గాక.

మిషనరీల ధార్మిక ప్రబోధ ప్రచారోపయోగి కార్యకలాపములే ఆధునిక భారతీయభాషలనేకములలో వలె తెలుగునను గద్యరచనావికాసవిస్తరణములకు ప్రథమ హేతువుగా పరిగణింపఁబడినను కలకత్తా ప్రాంతమునందలి శ్రీరామపురకేంద్రము ఉత్తర హిందూస్థానభాషలలో కొన్నింటికి చేసిన సేవ దక్షిణ భారతమున ఏ ఒక్క మిషనరీ సంస్థయు చేయఁజాలక పోయెనని చెప్పక తప్పదు. ఒకవిధముగ మతప్రచారమునఁగాని, దేశభాషాసేవాకార్యక్రమమునఁగాని నాఁడు యావద్భారతమున శ్రీరామపురమే మిషనరీల ప్రధాన కేంద్రముగ మండెను. అటులనే కలకత్తా ఫోర్టు విలియం కాలేజీలో ఉత్తర హిందూస్థానభాషలలో కొన్నింటి వికాసమునకు జరిగినంత కృషి మద్రాసులో దాని అడుగుజాడలలో నెలకొల్పఁబడిన ఫోర్టు సెయింటు జార్జి కాలేజీలో జరుగకపోవుట చింత్యము. అయినను ఫోర్టు సెయింటు జార్జి కాలేజీలోని శ్రీ వేదం పట్టాభిరామశాస్త్రిగారు, శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు, శ్రీ పుదూరి సీతారామ శాస్త్రిగారు, పాటూరి సోదరులు మున్నగు పండితులు యథాశక్తిగ తెలుగులో సరళ గద్యరచనల రచియించి గద్యయుగోదయోపయోగికృషిలో కాగడాను వెలి

గించియే యున్నారు. ఉన్నది నిల్పుకొనుటకుకాదా లేనిదానికై యత్నించుట! ప్రాచీన గ్రంథసేకరణ పరిష్కరణ ముద్రణాదికమున వెనలేని కృషి యొనర్చిన సి. పి. బ్రౌనును ఈ సందర్భమున స్మరింపకుండుట కృతఘ్నతయే కాఁగలదు క్రీ. శ. 1820లో మద్రాసులో నెలకొల్పఁబడిన ఉపయుక్త దేశభాషా గ్రంథకరణసభ పరశ్రమలు, వివిధ విషయ సమ్మితములునగు గద్యరచనల వెలయించుటలో చేసిన ప్రయత్నములు అమూల్యములు. నవీన విద్యావిధానము కారణముగ నెలకొన్న అనేక విద్యాసంస్థలలో మద్రాసులో విశ్వవిద్యాలయ స్థాపనము ఒక ప్రముఖ సంఘటనమని చెప్పక తప్పదు. చిన్నయసూరిగారి అధ్వర్యమున, ఉన్నత విద్యా ప్రణాళిక ఆదరణముతో తెలుగుభాష, ప్రధానముగ తెలుగుగద్య—మరింత శక్తిమంతమై రూపు సవరించుకొన్నది. ఆ శతాబ్ది ఆరంభము నుండి చతుర్థ చరణమువరకును ఆంధ్రగద్యసాహిత్య వికాసమునకు జరిగిన కృషిలో చిన్నయసూరి స్థానము అత్యున్నతమనుట నిర్వివాదము. ఇట్లుండ ముద్రణ కళను, పత్రికా రచనమును ఆధారముగాఁగొని ఆంధ్ర భాషావేదికపై నడుగిడిన మహాపండితు లొకరు గలరు. వారే బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు. విభిన్నరంగములలో వీరి యత్నములు చాలవరకు శ్రీ కందుకూరివారి భాషాసాంఘిక సాహిత్య సేవా కార్యక్రమములకు ప్రేరకములుగ పనిచేసిన వన్నచో సత్యదూరము కాదని మా ఆశయము.

ఈ పూర్వరంగముతో శ్రీ వీరేశలింగంపంతులు గారు ఆంధ్రగద్యయుగోదయకారకులైనారు. ఇప్పట్టున పంతులుగారియొక్కగాని, ఇతరులయొక్కగాని ఏ ఒక్క రచనమునైనఁ బేర్కొని దానితో తెలుగులో గద్య యుగ మారంభమైనదని చెప్పుట మా అభిమతము కాదు. ఆనాడు సమాజోద్ధరణమునకుఁబోలె సాహిత్య విస్తరణమునకును పత్రికలే పట్టుగొమ్మలు. కావున పంతులుగారి ప్రముఖ పత్రికయగు వివేకవర్ధని ఉదయమునే ఆధునికాంధ్రగద్యయుగారంభముగ నెన్నుట సర్వథా సముచితమని భావించుచున్నారము.

రత్నఖచితములై కమనీయకాంతులఁ గ్రుమ్మరించు ఆ సువర్ణకంకణము లెరికనియు, సురుచిర వర్ణ సంశోభితములై కమ్మతావుల దశదిశలం గుబాళించు ఆ పుష్పహారము లెవ్వరికనియు ప్రశ్నించుచున్నారా? ఇంకెవ్వరికి? వివిధరచనారత్నసంభరితమై దూరతీరములఁ కలవోకగాఁ బోవుచు వచ్చుచు వెల్లెడల సవిలాసముగ నీవిగ విహరింపఁజాలునటుల నాశీర్వదించి మా ఆంధ్రగద్యనౌకను విశ్వసాహిత్య సుధాసింధువులోనికి తన పవిత్రహస్తములతో ప్రవేశపెట్టిన శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారికే ఈ అమూల్యోపహారములు.



నాటిక:

# ప్రేమలేఖ

## శ్రీ కె. సుదర్శనం

పాత్రలు:

పరంధామయ్య (45–50);
పి. రంగధామయ్య (40–45);
సుధాకరం (22–23);
మధుసూదనం (23–30);
రాధారమణ్ (35–40).

సమయం:

ఒకనాటి ఉదయం, 9; 9–30 ని॥ ప్రాంతంలో.

స్థలం:

పరంధామయ్యగారి ఇంటి చావడి.

తెర తొలగేసరికి

[ఒక మధ్యరకం కుటుంబీకుడి యింటిచావడి. వడకకుర్చీలో కూర్చుని, పేపరు చూస్తూ, చేతి వేళ్లు ముడుస్తూ, తెరుస్తూ, ఏవో లెఖ్ఖ పెడుతూ వుంటాడు పరంధామయ్య. గోడకు ఇద్దరు ముగ్గురి దేశనాయకుల క్యాలెండర్లు వుంటాయి. అంత మాత్రాన, పరంధామయ్య అకుంఠిత దేశభక్తుడు, రాజకీయదురంధరుడు· అని మనం అపోహ పడ వలసిన పనిలేదు. పరంధామయ్య వాటన్నింటికీ అతీతుడు. రంగస్థలంమీదనుంచి మూడువైపులా మూడు ద్వార్లా లుంటాయ్. ఒకటి వంటింటిలోకి దారి తీసేది; రెండు: లోపలి గదులలోనికి; మూడోది వీధిలోకి.]

పరం: (పెదవి విరుస్తూ) ఊఁ హుఁ! లాభం లేదు. ఎప్పుడు చూసినా ఇదే రకం. ఒక్కసారి...ఒక్కసారి కూడా......పొరపాటుగా నైనా...చక్కగా వ్రాసి ఏడుస్తేనా?– 'అప జయం–ధనహాని–అనవసరశ్రమ', అని తప్ప– 'అకస్మాత్తుగా ధనలాభం' అనో 'శుభవార్తలు వింటారు' అనో వ్రాసి చావడు వారఫలా లలో. వీడికంటే ఆ 'తెలుగుదీపం' వాడు నయం. ఎంచక్కా వ్రాస్తాడు — జరిగినా, జరగకపోయినా!–అవీ వార ఫలాలు అన్నా, రాశిఫలాలు అన్నా.

(పేజీ త్రిప్పుతూ) 'వియత్నాంలో అమెరికా సేనలు...ఇజ్రాయెల్ అమానుష పైశాచిక చర్య...చైనా అణుబాంబు ప్రయోగం... ఆంధ్రలో చక్కెర కోటా...అమెరికానుండి ఇండియాకు గోధుమలు దిగుమతి...రష్యానుండి పాకిస్తాన్‌కు ఆయుధాల ఎగుమతి...సరిహద్దు లలో సంఘర్షణలు...మహిళాసంఘ వార్షి కోత్సవాలలో మంత్రిగారి ప్రారంభోపన్యాసం'– ఎక్కడ? 'నల్లపాడులో'–ఆఁ! వల్లకాడు. ఇవీ వార్తలు. ఏముంటాయి ఇవిగాక. ఇంక ఇంక అయిదువందల సంవత్సరాల తరువాత కూడా ఇవే వార్తలు!

(లోపలికి చూస్తూ) ఒసేవ్! పంచదార పేపర్లో కూడా లేదులే. లేకపోతే పోయింది. ఆ బెల్లమే కొస్త తగలేసి యిలా అందించు. నోరెండి ఛస్తున్నాను. (మళ్లీ ఒక పేజీ త్రిప్పి) 'మీ కుటుంబమును పరిమితము

చేసుకోనండి—ఇద్దరు లేక ముగ్గురు పిల్లలు చాలు!' అబ్బ—ఎక్కడ చూసినా పీడి గోడవే కదా. ప్రాణం ఊదరగొట్టేస్తున్నాడు. ఇదేమిటీ?..'ఫిట్‌వెల్‌రకం బ్రాసరీలనేవాడం..' ఛీ...ఛీ...ఛీ...! ఏం పిదపకాలం వచ్చిపడి పోయింది? ఇదేమిటీ ఏదో సినీమాలా వున్నదే... 'నేడే విడుదల—ముప్పై మూడు కేంద్రాలలో ఒకేసారి! పదహారుమంది మేటినటులు పాల్గొన్న మేటికళాఖండం! మహోజ్వల సాంఘికచిత్రం—'మరదలుపిల్ల'. ఓరి పీడిని తగలెయ్య! 'రాశి ఫలాలు' అని ఓ సినిమా తీయకూడదూ?—వేన్నైతేనా?

(లోపలికి చూస్తూ) ఏమేవ్? కషాయం ఇంకా తయారు కాలేదా?...ఒరేయ్ సుధాకరం! నువ్వు తా సుధాకరం!

సుధా : (కాఫీ గ్లాసు పట్టుకొస్తూ) అబ్బ. ఏమిటి నాన్నా మరీ నువ్వు. అమ్మ పనిమీద వుంది. ఇదిగో కాఫీ.

పరం : (అందుకుంటూ) మీ అమ్మకు పనిలేని దెప్పు డోయ్? పాతికేళ్ళనుంచీ నాకు కాఫీ ఇవ్వటానికి తీరికే లేదు. యివ్వాళ మాత్రం యిస్తుందని కలగన్నానా ఏమిటి? కాకపోతే వెధవనోరు, అలవాటుగా అలా అరుస్తూనే వుంటుంది.

సుధా : (నవ్వుతాడు)

పరం : (ఓ గుటకవేసి) రామా! రామా!

సుధా : (తెల్లబోయి) ఏమిటి నాన్నా? ఏమైంది?

పరం : నువు తీసుకొచ్చిందేమిటా?

సుధా : కాఫీ! ఏం?

పరం : (విచారంగా) మీ అమ్మకు వేమ బ్రతకటం ఇష్టం లేదురా.

సుధా : ఛ! అదేమిటి నాన్నా?

పరం : కాకపోతే, కాఫీ పంపించమంటే విషం పంపు తుందా?

సుధా: (కంగారుపడి) అదా...అది...నేను చేసి పట్టు కొచ్చాను.

పరం : (ఆశ్చర్యపోయి) నువ్వా? నువ్వు చేసావా?

సుధా : (బలవంతాన నవ్వి) మరే. ఏం? ఎలా వుందే మిటి?

పరం : నీ ముఖంలా వుంది. ఎలాగూ ఉద్యోగం సద్యోగం లేదు కదా అని కాఫీ హోటలుపెట్టి జనాన్ని చంపుదామనుకున్నావటరా, వెధవ! ఇందులో వేసింది పంచదారా? లేక ఉప్పు గడ్డలా??

సుధా : (తెల్లబోయి) అబ్బే! అదికాదు నాన్నా, తెల్లగా వుంటేనూ పంచదారే అనుకుని...

పరం : రామా! రామా! తెల్లగా వున్నదల్లా పంచ దారేనటరా?— ఎందుకొచ్చిన డిగ్రీ చదువు రా?—అయినా, రేషను రోజుల్లో పంచదార తెల్లగా వుంటుందని ఎవడు చెప్పాడురా నీకు?

సుధా: ఇప్పుడే మళ్ళీచేసి పట్టుకొస్తాను నాన్నా! (వెళ్ళబోతాడు).

పరం : (అదిరిపడి) ఒరేయ్! నువ్వుచేసి తీసుకొస్తావా మళ్ళీ! వద్దులే. ఎలాగూ పొద్దెక్కి పోయింది గానీ, భోజనం ఏర్పాట్లు అయివాయేమో చూడు.

సుధా : అయిపో వచ్చింది నాన్నా.

పరం : అరగంట క్రితంకూడా అదే మాటన్నావు?

సుధా: ఏమో మరి, అమ్మ అలాగే చెప్పింది.

పరం : ఆడవాళ్లు అలాగే అంటారుకానీ, కళ్ళుండి ప్రయోజన మేమిట్రా? చూసి తెలుసుకో లేవు; అయిందో లేదో? నిన్ను బోలెడు డబ్బు పోసి చదివించడం దండగరా.

సుధా: మా పరీక్షల్లో వంటల గురించి అడగరు నాన్నా.

పరం : ఇంకేం అడుగుతారోయ్? — చచ్చుప్రశ్నలు! ఎప్పుడో రెండు శతాబ్దాల క్రిందట ఎవడో ఎవడో కొట్టుకుంటే, అది యిప్పుడు బట్టీ

పట్టినందువల్ల ఉపయోగం ఏమిటంట? యిప్పుడు మళ్ళీ కొట్టుకోవడం మానేస్తున్నారా?

సుధా : అదంతా మాకేం తెలుసు?—వాళ్ళు చెప్పింది అది, మేం చదివింది అది.

పరం : అంతకంటే ఎక్కువ వాళ్ళకూ తెలిసేడవదు—మీకూ అర్థంకాదు!—అది సరేగానీ, నీ ఉద్యోగ ప్రయత్నాలు ఎంతవరకూ వచ్చినయ్?

సుధా : ఇంకా ఏమీ లేదు.

పరం : ఎలా వుంటుంది? అసలు పేపరు చూస్తున్నావా? పేపరులో వాంటెడ్ కాలమ్సు చూస్తున్నావా?

సుధా: ఆఁ! చూడకేం?—కానీ, అందులో మాకు పనికివచ్చేదేం లేదు. సేల్సు గరల్సూ, టైపిస్టులూ, పర్సనల్ సెక్రటరీలు—అనుభవంవున్న అందమైన ఆడవాళ్ళు కావాలిట.

పరం : అవునులే ఈ కాలంలో ఆడవాళ్ళకు దొరికినంత తేలిగ్గా మగవాళ్ళకు ఉద్యోగాలు దొరకటంలేదు. అప్పుడికీ నేను మీ అమ్మకు ముందే చెప్పాను. ముందుముందు ఆడవాళ్ళదే ఛాన్సు—మనకి అబ్బాయి వద్దూ అని. వింటేనా? చటుక్కున నిన్ను కాస్తా కని కూర్చుంది.

సుధా : అసలు ఒకడి క్రింద ఉద్యోగం చేసేకన్నా, స్వయంగా ఏదైనా వ్యాపారం పెట్టుకోవటం నయం నాన్నా!

పరం : ఇంకా నయం! వెధవది!—ఆడది చేస్తూంటే సిగ్గులేదుట్రా?—ఉద్యోగం పురుషలక్షణంరా!

సుధా : అది మీ కాలంలో నాన్నా! ఈ కాలంలో ఉద్యోగం చేయటం, ఊళ్లేలటం ఆడవాళ్ళ లక్షణాలు!

పరం : ఏడిసావ్! ఊళ్లేలే ఆడదాన్ని, గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే మగవాడినీ నమ్మకూడదు అని, వెనుకటికి మీ నాయనమ్మ అంటూ వుండేది.

సుధా : మీ నాయనమ్మలకాలం అంతే నాన్నా. ఈ కాలం వేరు.

పరం : ఏం కాలం? పోయే కాలం! రూపాయి బిళ్ళ మారిస్తే తను తిని పదిమందికి పెట్టే రోజులువి. ఈ నాడు మూడొందలు సంపాదించేవాడు కూడా ముప్పైతార్సివచ్చే!

సుధా : అదే నాన్నా ప్రగతి!—అన్నట్లు నాకో అయిదు రూపాయలు...

పరం : కావాలా? నిన్ననేగా తీసుకున్నావు.

సుధా: నిన్న నిన్నే! ఇవ్వాళ్ళ ఇవ్వాళే! వెనక్కి తిరిగి చూడకూడదు నాన్నా. ప్రగతికి దెబ్బ.

పరం: అయిదు రూపాయ లెందుకురా అంటే చచ్చు కబుర్లు చెపుతావేం?

సుధా: అదే నాన్నా. ఉద్యోగ ప్రయత్నంలో వున్నాను. మరి ఉద్యోగం వచ్చినా రాకపోయినా రోజువారీ ఖర్చులు తప్పవుగా.

పరం : ఏమిటోయ్ అంతలావు ఖర్చులు?

సుధా : షరా మామూలే. ఇక్కడినుంచి బస్సుమీద 'ఎమ్ప్లాయిమెంట్ ఆఫీస్'కి వెళ్ళాలి. అక్కడో రెండు గంటలు నిలబడాలి. అంటే కనీసం అర్ధరూపాయి హోటల్ వాడికివ్వాలి. కాలక్షేపానికి ఓ అరో, పావలావో కిళ్ళీబడ్డీ వాడికివ్వాలి. తరువాత: వాళ్ళు వెళ్ళమన్నచోటకల్లా వెళ్ళి, అడ్డమైన వాడువేసే అడ్డమైన ప్రశ్నలకీ సమాధానాలు చెప్పేసరికి వచ్చేతలనొప్పి పోగొట్టుకోటానికి మళ్ళీ హోటలు కంటూ వెళ్ళాలిగదా!

పరం : ఒరేయ్! ఒరేయ్! నీ లాంటి వాళ్ళుండబట్టే ఆ రంగధామయ్యలాటి వాళ్ళు వెధవ హోటేలు మీద రెండతస్థులు వేసారు.

సుధా : ఆ వ్యాపారాన్ని మించిది లేదు నాన్నా. ఇప్పుడు పెద్దపెద్ద మంత్రులే ఎటొచ్చి ఎటుపోయినా

మంచిదని ముందుగా హోటల్సు పెట్టు కుంటున్నారు.

పరం : ఇంతకీ ఆ హోటేలు వాళ్ళని బాగు చెయ్యట మేనా, లేక ఉద్యోగం దొరికేదేమైనా వుందా?

సుధా : అప్పుడే దొరికితే, ఇంకా ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీల గొప్పతనం ఏముంది? మేం యింతా కష్టపడితే చివరకు ఎవరో ఒక వరప్రసాది ఆ ఉద్యోగం కొస్తా కొట్టేస్తాడు.

పరం : వాడెవడు?

సుధా: రికమెండేషనున్నవాడు. ఏ డైరక్టరుగారి మన వడో, మంత్రిగారి మునిమనవడో.

పరం : అయితే యింక ఈ దండగ ఖర్చులెందుకురా? హాయిగా దొరికే రోజునే పోవచ్చుగా.

సుధా ; అలా అని ముందు తెలియదు నాన్నా! కనీసం అయిదారు వెలలయినా పోవాలి

పరం : అంటే రోజుకి అయిదు చొప్పున మొత్తం ఏడువందల ఎనభై రూపాయలు క్షవరం!

సుధా : అంతేనా?...ఇంకా వాళ్లకీ వీళ్లకీ జేబులు నింపాలి గదా

పరం : అదెంతవుతుంది? ఓ వందో, రెండో సరా?

సుధా : ఉహుఁ. అది వెనుక. ఇప్పుడు అన్నూంబాపతూ కలుపుకుని ఏ అయిదారు వందలో...

పరం : వెరశి వెయ్యిన్నర తగలబెడితే దొరికేది ముష్టి రెండువందల రూపాయ లుద్యోగం.

సుధా : అప్పటికదే అదృష్టం.

పరం : ఒరేయ్! నువ్వు డిగ్రీ పూర్తిచేయటాని కెంతయిందో తెలుసా?

సుధా : ఆఁ.

పరం : ఆదే దండుగ ఇంకా ఇలా తగలేసేదానికన్నా, వాడెవడో సంగతి చెప్పావే — వాడిలాగా నువ్వు ఈ డబ్బుతో ఓ హోటేలు పెట్టుకో ఎంచక్కా!

సుధా : ఆ సంగతి నే నిందాకే చెప్పాను.

పరం : ఆ బుద్ధి ముందేవుంటే ఆ వెధవ రెండు ముక్కల డిగ్రీకి తగలెట్టిందంతా వ్యాపారంలో పెడితే, ఈపాటికి మనమూ రెండం తస్థులు వేసేవాళ్లం.

సుధా : ఇప్పటికయినా మించిపోయిందిలేదు.

పరం : అయితే వాటి లోపాయకారీ విషయా లేవో తెలిసినవాళ్ల నడుగుతే బావుంటుంది.

సుధా : నేనూ అదే అనుకుంటున్నాను.

పరం : అన్నట్లు వాళ్లా వీళ్లా ఎందుకూ? మన ప్రక్కవీధి రంగధామయ్యనే అడిగితే సరిపోదూ?

సుధా : ఆయన ఒప్పుకుంటే వాళ్ల వ్యాపారంలోనే వాటా కలిస్తే బావుంటుంది.

పరం : అదీ అడుగుదాం.

సుధా : మరి నేను యిందాక అడిగింది...

పరం : ఏమిటది?

సుధా : అదే...

పరం : అయిదు రూపాయలా?

సుధా : ఆఁ.

పరం : ఇంకా ఎందుకురా, ఉద్యోగం వద్దనుకున్నాక?

సుధా : అలా అని వాళ్లకు చెప్పిరావాలి నాన్నా!

పరం : అయితే యిదిగో తీసుకో. ఇకముందు ఛస్తే యివ్వను. తెలిసిందా?

సుధా : ఆఁ.

పరం : ఒరేయ్! వాళ్లతో గట్టిగా చెప్పేయ్. 'మీరిచ్చే బోడి ఉద్యోగం నాకు అక్కర్లేదు. నేను వ్యాపారం చేసుకొంటాను'—అని.

సుధా : అలా చెప్పకూడదు నాన్నా!

పరం : ఏం? తలకొట్టి మొలేస్తారా? సరే, వెంకి ఏ అయిదారు వందలో వచ్చే వుద్యోగం అయితే కబురెట్టమను.

సుధా : అయిదారు వందలా?

పరం : ఏం? యివ్వరా? అవునులే. మీరు చదివిన ఆ రెండు ముక్కల డిగ్రీకి ఎవడిస్తాడు, ఆ

పాటి నౌఖరి? సరే పో. పోయి నేను రమ్మన్నానని ఆ రంగధామయ్యతో చెప్పు.

సుధా : అలాగే (వెళ్ళబోతాడు)

పరం : ఏమిటీ? అలాగే చెబుతావా? నీకు మరీ లౌక్యం తెలియదేమిరా? 'పిలుంటే ఒకసారి మా నాన్నగారు కలుసుకోమన్నారు' అని చెప్పాలి.

సుధా : నేనూ అలాగే చెబుదామనుకున్నాను.

పరం : ఆగాగు. యివ్వాళ ఏం రోజు? ఏదీ...ఆ వెంక ట్రామా క్యాలెండరు యిలా పట్టుకురా...చూద్దాం!

సుధా : (లోపలికి వెళ్ళబోతాడు)

పరం : ఒరేయ్ వద్దులే. నేనే తర్వాత పిలుచూసి ఆయన్ను కలుసుకుంటాలే.

సుధా : సరే.

పరం : మరి యింకా నిలుచున్నావేం? నువ్వెళ్ళొచ్చు.

సుధా : ఇదిగో వెళ్తున్నాను—

పరం : ఒరేయ్! ఆ అయిదు రూపాయల నోటు జాగ్రత్త. ఏ దొంగ వెధవయినా కొట్టేయగలడు అయినా నా మొఖం, అది యింకో గంటదాకా వుండి ఏడుస్తేగా?

సుధా : నేను వెళ్తున్నాను.

పరం : ఆ. అన్నట్టు వంటయిందేమో తివి పోకూడదూ?

సుధా : ఇప్పుడా?

పరం : టైం లేదు గామోను. మరి యింకా నిల్చున్నావేం?

సుధా : నువ్వెళ్ళనిస్తేగా (అంటూ వీధి గుమ్మంవైపు రెండడుగులు వేస్తాడు)

(రంగధామయ్య ప్రవేశం. పరంధామయ్యకంటే ఓ అయిదేళ్ళు చిన్నవాడేమో. మనిషి దురుసు. మాటలు పెళుసు. మనసు మంచిదే)

సుధా : న...నమస్కారమండి. మీ గురించే ఇప్పుడే అనుకుంటున్నాం.

రంగ : నువ్వేనా సుధాకరం అంటే?

సుధా : అవునండి.

పరం : అరే—రంగధామయ్యా! నేనే నిన్ను చూడాలనుకుంటూంటే నువ్వే వచ్చేశావు అవునూ... అప్పుడే నీకు ఎలా తెలిసింది, మా వాడు హోటేలు వ్యాపారం చెయ్యదలచుకున్నట్టు?

రంగ : మీ వాడు హోటలు పెడితే నా కెందుకు? ఇంకోటి పెడితే నా కెందుకు? అసలు ఇదే మన్నా బావుందా అని?

పరం : ఏమిటోయ్ అంత కోపం?...ఏదో క్రొత్తగా వ్యాపారం...చిన్నవాడు...

రంగ : చిన్నవాడా? మీ వాడు చిన్నవాడా? చేసేది ఎటువంటి పని?...

పరం : నిజమే అనుకో. పెద్ద వ్యాపారమే. అందుకే గదా నిన్ను కల్సుకుందామని, సలహా అడగాలనీ అనుకుంది.

రంగ : చాల్లేవయ్యా. పెద్దమనిషివి బయల్దేరావు మహా!

పరం: ఒరేయ్ సుధాకరం!

సుధా : ఏం నాన్నా?

పరం : ప్రొహిబిషను ఎత్తేశారా ఈ మధ్యేమైనా?

రంగ : అంటే, నేను తాగి వచ్చానంటావా నీ దగ్గరకు?

పరం : అబ్బే అంత మాటంటావా?—ఏదో అదోలా మాట్లాడుతూవుంటే?...

సుధా : నాన్నా! మీ రిద్దరూ మాట్లాడుకుంటూ వుండండి నేను యిప్పుడే వచ్చేస్తాను.

రంగ : ఆగవోయ్. ఎక్కడికి వెళ్ళేది — విషయం తేల్చకుండా...

పరం : ఇదిగో రంగధామయ్యా! పెద్దవాళ్ళం, విషయాలేమిటో మనం మనం మాట్లాడుకుందాం.

కుర్ర సన్నాసి వాడిదేముంది? (సుధాకరంతో) యింకా నిల్చున్నావే నీపని చూసుకోకుండా?

సుధా : ఆఁ! ఆఁ! వెళ్తున్నాను. (అంటూ వెళ్ళి పోతాడు వేగంగా)

రంగ : మళ్ళీ కుర్రవాడంటున్నావు. మీ వాడు కుర్ర వాడా? అయితే మా అమ్మాయి వసంతకి ప్రేమలేఖ అంటూ రాయడంకూడా కుర్ర చేష్టేనా? చిన్నవాడు చేసే పనేనా అని?

పరం : ఆఁ! (తెల్లబోతాడు)

రంగ : ఆడపిల్లలకి ప్రేమలేఖలు వ్రాసి అల్లరి పెట్టటం చిన్నవాడు చేసేపనేనా?

పరం : (ఇంకా తేరుకోకుండానే) ఏమన్నావ్?

రంగ : ఉన్నమాటే. మీ వాడు చేసిన పని ఏమైనా బావుందా అని?

పరం : (ఇప్పుడు తేరుకుం డు. కోపంతో) ఏడీ వాడు? ఎక్కడ? ఒరేయ్ సుధాకరం!

రంగ : ఇంకా ఎక్కడుంటాడు? విషయం వినకుండా పంపించేసావుగదా, నాలుగూ ముఖం మీదే అడిగేద్దామని వస్తే.

పరం : విషయం అంటే హోటేలు వ్యాపారం అను కున్నాను కానీ, వీడుచేసే వ్యాపారం యిదని నాకేం తెలుసు?

రంగ : చిన్నవాడైతే చిన్నవాడు లాగానే వుండాలిగానీ— దారిన పోయే ప్రతి అమ్మాయిని ప్రేమించా నంటూ ఉత్తరాలు వ్రాయటమేనా పని?

పరం : ఇదిగో రంగధామయ్యా! కోపం తగ్గించి, అసలు విషయం ఏమిటో చెప్పు. ఉత్తరా లేవిటి? మా వాడు రాయడమేవిటి?

రంగ : (కోపంతో) అంటే, మీవాడు అసలు మా అమ్మాయికి ప్రేమించానంటూ వుత్తరమే వ్రాయలేదు పొమ్మంటావు?

పరం : అసలు జరిగిన సంగతేమిటో చెప్పకుండా అలా నిలేస్తే నేనేం చెప్పగలను?

రంగ : ఇంకా నువు చెప్పేదేమిటయ్యా? అసలు ఏం చేసాడో తెలుసా? – మా అమ్మాయి వసంత లేదూ, వసంత! మొన్న కాలేజీకి వెళుతూవుంటే...

పరం : వెళుతూవుంటే...?

రంగ : వెళుతూవుంటే, వెంటబడి—'ఓ రెండుజెళ్ల అమ్మాయీ, రెండుజెళ్ల అమ్మాయీ! నువ్వు నాకు నచ్చావు. నేను నిన్ను ప్రేమి స్తున్నాను. నువ్వు నన్ను ప్రేమించూ' అన్నాడట.

పరం : (కోపంతో) ఓరి నిన్ను తగలెయ్య!

రంగ : (తెల్లబోయి) ఆఁ! ?

పరం : అబ్బే మిమ్మల్నికాదులెండి. మా వాడిని. ఆఁ! ఆ తర్వాత?

రంగ : ఇంకా తర్వాతేమిటయ్యా నా మొఖం! ప్రేమిం చానంటూ వచ్చిన అడ్డమైనవాడినల్లా ప్రేమిస్తూ కూర్చోటమే మీ అమ్మాయి పని అనుకున్నాడా? దారినపొయ్యే ప్రతి దానయ్యనీ ప్రేమించటానికి మా అమ్మాయి అంత గతిలేనిదా...?

పరం : ఛ! ఛ! మా వాడి ఉద్దేశ్యం అది అయ్యుండదులెండి.

రంగ : ఏదయితేనేమీ త్రం? బరితెగించి అలా అనొచ్చునా అని!

పరం : అలా అనటం తప్పేలెండి.

రంగ : తప్పా? తప్పన్నరా??

పరం : అయితే మీ అమ్మాయి మాట్లాడకుండా వూరుకుందా?

రంగ : ఊరుకోక? పరువుగల ఆడపిల్ల—ఈ రంగ ధామయ్య కూతురు, దారినపోయే ప్రతివాడి తోనూ జగడం పెట్టుకొని పదిమందిలో పరువు చేటుపని చేస్తుందా?

పరం : అంతేలెండి. ఇంకోటైతే ఝాడించి రెండుచ్చు కొనేది.

రంగ : అవునా! మా అమ్మాయి మంచిది కనుక— 'ఏదో పోనీలే, పిచ్చివాడు పాపం!' అనుకుని వచ్చేసింది.

పరం : మంచిపని చేసింది.

రంగ : అక్కడి కది అలా ముగిసిందా?—నిన్నగాక నిన్న దారిలో అడ్డుతగిలి...

పరం : ఎవడు?

రంగ : ఇంకెవడు? మీవాడే! అడ్డుతగిలి, ఇంగ్లీషులో 'నా ప్రేయసీ' అని పిలిచి, 'ఏవిటి నీ సమాధానం' అని నిలేస్తాడా?

పరం : ఎంత గుండెధైర్యం?

రంగ : ఆఁ! ?

పరం : మిమ్మల్నికాదు, మావాడిని లెండి.

రంగ : ఆఁ! ఏం చూసుకొనో ఆ గుండెధైర్యం? పదిమందిచేతా మొదటిసారే నడిబజార్లో చివాట్లు పెట్టించలేదనేగా?

పరం : అబ్బె అంతవరకూ ఎందుకు లెండి.

రంగ : పోనీ; అంతటితో వూరుకున్నాడా?

పరం : (నీరసంగా) యింకా ఏం చేసాడు?

రంగ : పిచ్చి ముదిరితే ఏమైనా చేస్తాడు. ప్రేమ లేఖ అట, ప్రేమ లేఖ. వ్రాసాడు పది పేజీలు.

పరం : మా వాడికి పరీక్ష పేపర్లో సరిగ్గా వ్రాయటం చేతకాదు...

రంగ : అంటే, నేను పనిగట్టుకువచ్చి అబద్ధాలు చెపుతున్నాననా? ఇదిగో, మీరే చూడండి, ఈ మహాభారతాన్ని (కాగితాలు పరంధామయ్య ముందు గిరాటేస్తాడు.)

పరం : అబ్బే, ఎందుకులెండి? మీ మాట మీద నమ్మకం లేక కాదు మా వాడు ఇంతటి ప్రయోజకత్వం ఎప్పుడు సాధించాడా అని!

రంగ : పనీపాటూ లేకుండా తిరిగే వాడికి అంతకంటే చేతనైంది ఏముంది – ఆడపిల్లల వెనకబడి ప్రేమించాను అంటూ వాగటంతప్ప?

పరం : ఆ మాట నిజమే లెండి. అందుకే గదా మా వాడిచేత హోటేలు వ్యాపారం పెట్టిద్దామని అనుకుంది. అరె! మీరు నిలబడే వున్నారు, కూర్చోండి.

రంగ : అఖ్కర్లేదు.

పరం : అమ్మమ్మమ్మ! అలా అనటం భావ్యం కాదు. తమరు కూర్చోవాలి మరి. అలా ఆ కుర్చీ మీద కూర్చోండి.

రంగ : ఫర్వాలేదు (కూర్చోబోతాడు)

పరం : ఆగండి. దుమ్ముదులపనీయండి. (కండువాతో కుర్చీ దుమ్ముగర గొడతాడు) ఆఁ! కూర్చోండి ఇక. అన్నట్లు కాఫీ తీసుకుంటారా... (లోపలికి చూస్తూ) ఒసేవ్, రంగధామయ్య గారికి కాఫీ పంచదారవేసి పట్టుకురావే.

రంగ : (కూర్చోబోతూ) అబ్బే, ఎందుకులెండి శ్రమ!

పరం : అంతేనంటారా? అవునులెండి. కాఫీ హోటేలే మీది. (లోపలికి) ఒసేవ్! కాఫీ వద్దులే. తీసుకు రాబోకు.

రంగ : (చటుక్కున లేచి నిలబడి) మీ మర్యాదల కోసం నేనేమీ రాలేదు. పెద్దమనిషివని చెబుతున్నాను. మీ అబ్బాయిని అలా వీధిలోకి వదలకుండా, ఏ ఆసుపత్రిలోనైనా చేరిస్తే మంచిది.

పరం : అంటే మా వాడికి మతి స్థిమితం లేదంటారా? ఏవండోయ్! కొంచెం మర్యాదగా మాట్లాడితే బావుంటుంది.

రంగ : (కోపంతో) ఏవిటయ్యా నీ మర్యాదా? ఇంకోసారి గనుక మీ వాడు ఇలాంటి వేషాలు వేస్తే, వ్యవహారం చాలా దూరం వెడుతుంది.

పరం : ఇదిగో రంగధామయ్యా! మనం పోట్లాడుకుని ప్రయోజనంలేదు. మా అబ్బాయి మీ అమ్మాయికి ఓ ఉత్తరమ్ముక్క వ్రాసాడే అనుకుందాం. నిమ్మా నమ్మా అడక్కుండా అలా వ్రాయటం తప్పే. ఏదో వయసులో

వున్నవాడు, ఒక అడుగు పొరపాటే వేశాడను కుందాం. మనం దానిని సరిదిద్దితే పోలా?

రంగ : అంటే...?

పరం : చెపుతాను కూర్చో. కూర్చోవయ్యా. ఏమిటో వెధవది, ఇంటికి వచ్చినవాళ్లని మర్యాద చెయ్యకపోతే మనసు పీకుతుంది. అరె, ఇంకా నిలబడే వున్నావా? మరీ అంత బెట్టు చేయ గూడదయ్యా రంగధామయ్యా!

రంగ : (మొఖమాటపడుతూ) మర్యాద కేంలే? — విషయంకానీ...(కూర్చుంటాడు.)

పరం : (తాపీగా) ఇప్పుడు విను. వయసులో వున్న వాళ్లు; వాళ్లు వ్రాసుకోకపోతే నువ్వూ నేనూ వ్రాసుకొంటామటయ్యా ప్రేమలేఖలు! (అంటూ నవ్వుతాడు.)

రంగ : (కూర్చున్నవాడల్లా లేవబోతాడు)

పరం : ఆఁ! ఫర్వాలేదు కూర్చో (అంటూ అతణ్ణి ఆపి) నా సలహా ఏమిటంటే...నీ అమ్మాయికీ మా అబ్బాయికీ భేషుగ్గా పెళ్లిచేసేద్దాం.

రంగ : (చటుక్కున లేచి నిలబడతాడు) ఏమిటీ...?

పరం : మా వాడు నీ వ్యాపారం చూసుకుంటాడు. మనిద్దరం కృష్ణారామా అనుకోవచ్చు!

రంగ : (కోపంతో) ఆపవయ్యా. రౌడీ వెధవలందరికీ మా అమ్మాయి నిచ్చి, పైగా వ్యాపారం అప్పచెప్పటానికి నేనేం గతిలేనివాడినా? పిచ్చివాడినా??

పరం : (అభిమానంతో) మా వాడు రౌడీ వెధవా?

రంగ : మాటంటే మాటే. దారినపోయే ఆడపిల్లల్ని అల్లరి పెట్టేవాడు రౌడీవెధవకాక బుద్ధి మంతుడా?

పరం : చాల్ చాల్లేవయ్యా. మహా చెప్పొచ్చావు. నీ కూతురు ఏమీ అలుసివ్వకుండానే మా వాడు ప్రేమించానంటూ వెంటబడ్డాడా?

రంగ : నీతో వాదించటానికి నేను రాలేదు. పెద్ద మనిషివని, ముందుగా చెబుతే అబ్బాయిని అదుపులో పెట్టుకుంటావనీ వచ్చానుగానీ...

పరం : కాకపోతే ఏం చేసే వాడివేమిటి?

రంగ : ఏం చేసే వాడినో. మా వీధి వదలి, అసలు ఈ వీధికి వస్తాడా? ఈ సారి మళ్ళీ ఏమైనా జరిగినీ! చేసి చూపించకపోతే నా పేరు ప్రొప్రయిటరు పి. రంగధామయ్యేకాదు. హుఁ!

(విసురుగా వెళ్లిపోయాడు.)

: (స్వగతంలా) ఓరి వీడిని తగలెయ్యా! ఎంతెం తేసి మాటలన్నాడు? అయినా వీడి తప్పే మిటిలే? మన బంగారం మంచిదవ్వాలిగాని! (లోపలికి చూస్తూ) 'ఒసేవ్! విన్నావటే, నీ సుపుత్రుడు వెలగబెట్టే ఉద్యోగం! చది వింది చాలు. ఇక వద్దు, చెడిపోతాడంటే, కాదు—కూడదు అన్నావు.' అసలు వాడిని రానీ చెబుతాను వెధవని. అయినా ఆ రంగ ధామయ్య పాటి చేయనా నేను. నాడి కూతురు కంటే తీసిపోయాడా మా వాడు. రంగ ధామయ్య బాబులాంటి సంబంధం చూడక పోతే నా పేరు పరంధామయ్యే కాదు. ఏమను కున్నాడో?

(మధుసూదనం ప్రవేశం. మనిషి వెకిలిగా వుంటాడు. అతి తెలివి ఎక్కువలా కన్పిస్తాడు.)

మధు : (ప్రవేశిస్తూనే) ఏయ్! ఎవర్రా సుధాకరం? ఎక్కడ? 'కమాన్'. 'కవౌట్.'

పరం : (ఎగాదిగా చూస్తూ—స్వగతంలో) ఎవడ్రా వీడు? (మధుని ఉద్దేశించి) ఇదుగో అబ్బాయ్! ఎవరు నువ్వు? మంచీమర్యాదలేకుండా, ఏయ్! ఓయ్! ఏమిటి?—నీ బావమరిది అనుకున్నావా?

మధు : (ఆశ్చర్యంగా) మంచీ మర్యాదా అంటే ఏమిటి? (నవ్వేసి) ఓహో 'మేనర్సా?'. అవు నయ్యా. నేనూ అదే అడుగుతున్నాను—ఏమను కున్నాడు?' వాటీజ్ యువర్ సన్ థింకింగ్?' నేను తన బావమరదినా?

పరం : (విసుగ్గా) ఏమిటయ్యా అలా నోరు తించుకుంటావు?

మధు : (తెల్లబోయి) 'వాట్?' ఏయ్, మునలీ! 'ఓల్డ్‌ఫెలో!' సరిగ్గా మాట్లాడు. అసలు 'హూ ఆర్ యూ?' నువ్వెవరోయ్ మధ్యన?

పరం : (నిర్లక్ష్యంగా) నేను వాడి బాబుని. నువ్వెవర్రా?

మధు : (కొంచెం వెనక్కి తగ్గుతాడు) అలా మాట్లాడకండి. మంచిగా అడగండి—'హూ ఆర్ యూ'— అని. చెబుతాను.

పరం : (అదే విసుగుతో) ఏదో ఒకటిలే. త్వరగా ఏడ్చిపో.

మధు : అంటే? త్వరగా చెప్పమనా? 'డోన్ట్‌వర్రీ!' తొందరేమీ లేదు. తీరిగ్గానే మాట్లాడుకుందాం. (అంటూ కూర్చుంటాడు).

పరం : (కోపంతో) లేవండి. లేవయ్యా కుర్చీలోంచి. (మధు చటుక్కున లేచి నిలబడతాడు). నీతో తీరిగ్గా కూర్చుని కబుర్లుచెప్పే అవుసరం లేదు. దయచెయ్.

మధు : (మొండిగా) ద ట్సాల్ రైట్! ఆ మాటకొస్తే నాకూ నీతో మాట్లాడే టైం లేదు. కాల్ హిమ్. పిలు నీ కొడుకుని.

పరం : వాడు ఇంట్లో లేడు.

మధు : లేడా? అప్పుడే నేను వస్తానని తెలుసుకుని పారిపోయాడా? వాటే అన్‌లక్కీ బర్డ్?

పరం : (కోపం వస్తుంది) ఏవిటీ? బర్డా? నువ్వే పక్షివి.

మధు : కోపం వద్దు. ఆ మాటకొస్తే కోపం తెచ్చుకోవలిసినవాడిని నేను. కానీ నాకే మీ అబ్బాయిమీద కోపంలేదు. సానుభూతి. ఐ ఫీల్ సారీ ఫర్ యువర్ సన్!

పరం : ఆ కూసేదేదో తెలుగులోనే కూయరాదూ?

మధు : యస్. యస్. కమింగ్ టు ది పాయింట్! అసలు విషయానికే వస్తున్నాను. మీవాడు డిగ్రీ పుచ్చుకున్నాడా?

పరం : (గర్వంగా) ఫస్టుగా! ఏం? ఉద్యోగ మిస్తావా? అక్కర్లేదు. నీలాంటి వన్యాసుల దగ్గర మావాడు నౌకరీ చేయడు. వ్యాపారం చేసుకుంటాడు.

మధు : నో. నో. యూ ఆర్ మిస్అండర్‌స్టాండింగ్ మి. అంటే మీరు పొరపాటు మాట్లాడుతున్నారు. యూనివర్శిటీవాళ్ళు డిగ్రీ ఎవడికో యివ్వబోయి పొరపాటున మీవాడి కిచ్చేసివుంటారు. పూర్ యూనివర్శిటీ!

పరం : (ఎగిరిపడతాడు) అంటే?—మావాడు వెధవ రెండుముక్కల డిగ్రీకి కూడా పనికిరాడనా నీ ఉద్దేశం?

మధు : (ఆశ్చర్యంతో) అదే నేనూ విచారవడుతున్నాను. ఐ సర్‌ప్రైజు!—ప్రేమలేఖలు, అంటే, లవ్ లెటర్స్‌కూడా సరిగ్గా రాయటం చేతకానివాడు డిగ్రీ ఎలా తీసుకున్నాడా అని?

పరం : (తెల్లబోతాడు) ఏవిటేవిటీ?

మధు : లవ్ చేయటం ఎలాగో తెలీకపోతే ఆ విషయం నన్నడిగితేనే చెప్పేవాడినిగదా? కనీసం లవ్‌లెటర్స్ రాయటంఅన్నా నేర్చుకోలేదంటే —వాటే పిటీ. మీవాడు కాలేజీలో ఇంకా ఏం నేర్చుకున్నట్లు?

పరం : (అనుమానంతో) బాబూ! మీ దేవూరు?

మధు : అంటే? (అర్థం అయినట్లు నవ్వి) ఓహ్! యూ ఆర్ వెరీ హ్యూమరస్!—మీరు భలే నవ్విస్తారు రంగధామయ్యగారూ!

పరం : నా పేరు పరంధామయ్య, బాబూ! రంగధామయ్యది ప్రక్కవీధి.

మధు : అయాం సారీ. ఏదయితేనేంలెండి.

పరం : సందేహంలేదు, మీది విశాఖపట్నం కదూ?

మధు : (ఆశ్చర్యపోయి) అరె! మీ కెలా తెలుసు?

పరం : తెలియాలా పేరే. కనిపిస్తూనే వుందాయె!

మధు : నో. నో. యూ ఆర్ రాంగ్. మాది విశాఖ పట్టణమేకానీ, పిచ్చాసుపత్రికి మా యింటికి చాలాదూరం.

పరం : అలా చెప్పు మరి.

మధు : అబ్బే. యిప్పుడు విశాఖపట్టణం కాదులెండి. మా ఏన్‌సిస్టర్సు...

పరం : ఏ సిస్టర్సూ?

మధు : నో. నో. సిస్టర్స్ కాదు. ఏన్‌సిస్టరు, అంటే మా పూర్వీకులు, 60 సంవత్సరాల క్రితం అక్కడే వుండేవారు.

పరం : ఓహో. అలాగా. ప్రస్తుతం ఎక్కడ వుంటు న్నారు?

మధు : ఇక్కడే. అన్నట్టు అసలు మేటరు చెప్పలేదను కుంటాను. మీ అబ్బాయి సుధాకరం, మా చెల్లాయికి లవ్‌లెటర్ వ్రాశాడు.

పరం : (తెల్లబోయి) ఆ? ! ?

మధు : అఫ్ కోర్స్. వాట్ నౌ. ఇప్పుడు కాదనుకోండి. ఆరునెలల క్రిందట!

మధు : యస్. ఎగ్జాట్లీ!' 'అదేమిటి? ఇప్పుడువచ్చి అడుగుతున్నాడు' అని సర్‌ప్రయిజు అవు తున్నారు కదూ? నాకూ రీసెంట్‌గానే తెలి సింది. అఫ్‌కోర్సు నే నేమీ బాధపడటం లేదనుకోండి. ఎందుకంటే?—మా సిస్టర్‌ని లవ్ చేసేవాడు చాలా చాలా దురదృష్టవంతుడై వుండాలని నా నమ్మకం.

పరం : (తలబాదుకుని) ఖర్మ!

మధు: అఫ్ కోర్స్. నేనూ అదే అనుకున్నాను. మనం ఏం చేస్తాం? ఎవరి ఫేట్ వాళ్లది. ఉయ్ కాంట్ హెల్ప్!

పరం : అంటే, నువ్విప్పుడు వచ్చింది...

మధు : నో. నో. కయ్యానికి కాదు. వియ్యానికే!

పరం : వియ్యానికా?

మధు : యస్. ఎగ్జాట్‌లీ! అసలు మేటర్ ఏమిటంటే, మిస్టర్ సుధాకరం వ్రాసిన లవ్‌లెటర్ పుస్త కంలోపెట్టి మా సిస్టర్ మరిచిపోయిందట. మొన్న నెందుకో బుక్స్ దులుపుతూవుంటే అది బయటపడింది. దాన్ని చదివే సరికి మామీద, ఐ మీన్—మా అబ్బాయిమీద ఎక్కడలేని ఇమ్మోర్టల్‌లవ్వు పుట్టుకొచ్చి— అతణ్ణి తప్ప యింకొర్ని పెళ్లి చేసుకోనని పట్టుపట్టి కూర్చుంది!

పరం : (ముక్కుమీద వేలేసుకొని) ఔరా?!?

మధు : ఏం చేస్తాం చెప్పండి—ఆడవాళ్లు!

పరం : అయితే అబ్బాయ్! నీ చెల్లెలిగారికి మావాడు వ్రాసిన ఉత్తరమ్ముక్కతప్ప ఇంకోటేదీ దొరక లేదూ?

మధు : (నవ్వేసి) మీరు భలేవారు రంగధామయ్య గారూ!

పరం : బాబూ! నా పేరు పరంధామయ్య.

మధు : ఐయామ్ సారీ! పరంధామయ్యగారూ, నేను ఇందాకే చెప్పానుగదా, తెలిసిన వాడెవడూ అంతటి సాహసం చెయ్యడని! మీ వాడు— ఎడ్వెంచర్ చేశాడు—అందుకే కొట్టేశాడు లక్కీఛాన్సు!

పరం : ఆరు నెలలకి!

మధు : అఫ్‌కోర్స్! కొంచెం లేటే అనుకోండి. అయితే మాత్రం...?

పరం : ఆ! ఈమాత్రం పెళ్లికూతురు ఇంకెక్కడా దొరకదని!

మధు : ఛాలెంజ్! ఆరు జిల్లాలవరకూ ఛాయిస్ యిచ్చాను. చదువులోగానీ...

పరం : ఏం చదివిందేమిటి?

మధు : మెట్రిక్ మూడో సంవత్సరం! అందంలో అంటారా...

పరం : ఆ?

మధు : ఈ ఊళ్లో పౌడర్, స్నో, లిప్‌స్టిక్—సేల్స్ అన్నీ మా చెల్లాయివే!

పరం : అర్థం అయింది. ఇక చాలు,

మధు : సంగీతంలో...

పరం : ఆ? ఆ?

మధు : ఎవరూ చెప్పకుండానే సరిగమలు నేర్చేసుకొని, ప్రస్తుతం ఒంటరిగా డ్యూయెట్స్ బ్రహ్మాండంగా పాడేస్తూంది!

పరం : (ఎగతాళిగా) ఇంకా భరతనాట్యం అదీ...

మధు : డామ్! భరతనాట్యం ఏమిటి? రాకెన్‌రోల్, ట్విస్ట్ వేస్తే—ఎక్కడ? క్లబ్‌లో స్టేజ్ స్టేజంతా అదిరిపోయింది—అట్ట ముక్కలాగా!

పరం : (గుండెమీద చెయ్యేసుకొని) అమ్మ బాబోయ్!

మధు : ఆ! అందుకే అన్నాను—ఛాలెంజ్ అని. ఇప్పుడు చెప్పండి. ఇంతకంటే మంచిసంబంధం తేగలరా మీరు?

పరం : (నమస్కారంచేసి) బాబూ! నిజంగానే నువ్వన్నట్లు నాకా తాహతులేదు. మా అబ్బాయికి కూడా మీ పిల్లను పెళ్లాడే అర్హతలేదు. నువ్వు నన్ను క్షమించాలి!

మధు : భలేవారు మావగారూ!

పరం : (తెల్లబోయి) మావగారూ?

మధు : అవును మావగారూ! మీరే అలా అంటే ఎలా? ఏరి కోరి వరించింది, మా సిస్టరు!

పరం : (ఎగతాళిగా) ఆరునెలలకి!

మధు : అఫ్‌కోర్సు. (ఆలోచించినట్లు నటించి) పోనీ, ఆరు లక్షల రూపాయలు మీకు సడెన్‌గా ఇచ్చేస్తాననుకోండి! అప్పుడు, అప్పుడు వప్పుకుంటారా?

పరం : (నోరు తెరచి) ఆరు లక్షలా?

మధు : ఔను సిక్స్ లాక్స్! సడెన్‌గా మీకు వచ్చేస్తాయనుకోండి...

పరం : వచ్చేస్తే...?

మధు : అప్పుడు మీరు మీ అబ్బాయికి మా సిస్టర్‌ని చేసుకుంటారా?

పరం : అంతకంటేనా? అరె నిలబడేవున్నావు. కూర్చోవోయ్ (అంటూ తోస్తాడు కుర్చీలోకి చనువుగా!)

మధు : (కుర్చీలో సర్దుకుంటూ) నిజం! ఈజ్ ఇట్ ట్రూ? మీ మాటమీద నిలబడతారా?

పరం : నీ మీద ఒట్టు. ఆరు లక్షలంటే చేదా?, ఈ మాట ముందే ఎందుకు చెప్పలేదోయ్ నువ్వు. ఇంతకంటే మంచిసంబంధం ఎక్కడినుంచి వస్తుంది? పైగా, పిల్ల చదువుకున్నది, సంగీత సరస్వతి, నాట్యశాస్త్రపారంగతురాలు!

మధు: అన్నిటికీ మించి సిక్స్‌లాక్స్ అని చెప్పండి.

పరం: అదే లేవోయ్. అన్నట్లు మరిచేపోయాను. (లోపలికి చూస్తూ) ఒసేవ్! పెద్దమనుషులొచ్చారుగానీ కాఫీ పంచదారవేసి చేసుకురా.

మధు : (మొహమాటపడి) ఇప్పుడు కాఫీకి తొందరేముంది అంకుల్!

పరం : అవునుతే. భోజనం వేళయి పోయింది గదూ! (లోపలికి చూస్తూ) ఒసేవ్! కాఫీ వద్దులే. పట్టుకు రాబోకు!

మధు : (నోరు తెరుస్తాడు)

పరం : అవును! పెళ్లికి ముందే, ఆరులక్షలూ యిచ్చేస్తావా లేక అంతా అయిపోయాక అప్పుడూ ఇలాగే నోరు తెరుస్తావా?

మధు : అయ్యో! అప్పటిదాకా ఏంఖర్మ! నౌ ఇట్‌సెల్ఫ్! ఇప్పుడే ఇచ్చేస్తాను.

పరం : (ఈసారి ఆవలించటం పరంధామయ్యవంతు) ఆ! ఇప్పుడే ఇచ్చేస్తావా? ఇప్పుడే??

మధు: ఆ! ఆ! ఖంగారు పడకండి అంకుల్! డోన్ట్ బి హ్యారీ! గుండె దిటవు పరచుకోండి. ఒక్కసారి అన్ని లాక్స్ చూసి మీకు హార్ట్ ఫెయిలయితే—అనకూడదుకానీ, ఆ తర్వాత మా సిస్టర్ పెళ్ళి ఫెయిలే గదా!

పరం: భలేవాడివోయ్ నువ్వు. ఇంతకూ నీ పేరేమిటో చెప్పావుగాదు.

మధు: ఏదీ మీరు అడిగారు కనుకనా? మైనేమీజ్ మిస్టర్ మధుసూదనం! మధు అని పిలవండి చాలు. మా సిస్టర్ పేరు...అసలు పేరు 'సుబ్బులక్ష్మి' అనుకోండి! కానీ, లేటెస్టుగాదని మోడరేట్‌గాలేదని, ఫాషన్‌గా 'సుబుల్‌ఆష్మి' అని మార్చుకొంది. ఎలా వుందంటారు?

పరం: బ్రహ్మాండంగా వుంది. 'సుధాకరం-సుబుల్ ఆష్మి.' పేర్లుకూడా కలిసిపోయాయి.

మధు: అవును. మనసులు ఎప్పుడో కలిసిపోయాయ్. ఇక కలవాల్సింది...

పరం: చేతులు బాగా చెప్పావ్. ఇంతకీ డబ్బు...

మధు: ఆ. కమింగ్ టు ది పాయింట్. అక్కడికే వస్తున్నాను. (బాగ్‌లోంచి పేపర్ తీస్తాడు) ఇదిగో నా చేతిలో...

పరం: ఏముంది...?

మధు: (కంగారుగా) అందరికీ లాక్స్ వచ్చాక కళ్లకు ఏవో క్రమ్ముతాయంటారు మీకూ ఆ పేరు వినంగానే...

పరం: అబ్బ మాటలతో చంపకోయ్.

మధు: మరేవిటి? నా చేతిలో ఏమీ లేదా?

పరం: ఎందుకు లేదూ? ఏదో దినపత్రిక!

మధు: మైగాడ్! బ్రతికిచారు!...ఆ, దీని ఖరీదెంత?

పరం: (అర్థంకాక) దాని ఖరీదా??

మధు: యస్. వాటీజ్ ఇట్స్ వేల్యూ? ఖరీదు ఎంత?

పరం: పన్నెండు పైసలు.

మధు: (పకపక నవ్వి) నో. నో. అక్కడే పప్పులో కాలేసారు. దీని ఖరీదు పన్నెండు పైసలు కాదు.

పరం: మరి?

మధు: ఆరు లక్షలు! సిక్స్ లాక్స్!

పరం: ఆ!?!

మధు: యస్. ఆరు లక్షలు. అక్షరాలా ఆరు లక్షల రూపాయలు. తీయండి ఆరో పేజీ. చూడండి ఏడో కాలమ్. ఏముంది? ఫలితాలు! ఏం ఫలితాలు? లాటరీ ఫలితాలు! ఫస్ట్ ప్రయిజ్ ఎంత? ఆరు లక్షలు! ఎవరికి? ఏం పేరు?? ఏ ఊరు??? (పెద్దగా) 'పరంధామయ్య' 'ది గ్రేట్! ఊరు 'గుడివాడ'-ది గ్రేట్!

పరం: (బిగుసుకుపోతాడు)

మధు: ఇప్పుడేమంటావ్ అంకుల్! (చూస్తాడు పరంధామయ్యవైపు, కంగారుపడి) ఆ! అంకుల్! ఏమైంది? వాట్ హేపెన్డ్? నేనప్పుడే చెప్పాను. వెధవ హార్ట్! ఫెయి లవుతుందేమో జాగ్రత్త అని!

పరం: (తేరుకొని) మధుసూదనం! (పిలుస్తాడు గానీ ..చూపులు ఎక్కడో శూన్యంలో వుంటాయ్ మనిషి విచిత్రంగా వణుకుతూ వుంటాడు.)

మధు: అమ్మయ్య! గుర్తుపట్టారుకదా! బ్రతికి పోయాను.

పరం: అంతా నిజమేనంటావా?

మధు: కాక? — ఈ మధుసూదనం ఎప్పుడైనా అబద్ధాలు చెప్పాడా?

పరం: నాకు...లాటరీ...

మధు: రావడం నిజం!

పరం: ఆరు...ఆరు లక్షలు...రూపాయలు...

మధు: దొంగవోట్లివ్వరు. భయపడకండి. బ్లాకుమనీ కాదు.

పరం: (వినిపించుకోడు) ఒకటిరెండూ కాదు. ఆరు లక్షలు. ఆరు లక్షలు ఆరు...ఆరు..ఆరు...

మధు: ఏవిటది? అరిగిపోయిన గ్రామఫోనుప్లేటు లాగా. ఆరు లక్షలూ మీదే. మీరు కొంచెం నిఃమితంగా వుండాలి.

పరం: (మాట్లాడడు)

మధు: మంచినీళ్లు కావాలా?

పరం: వద్దులే.

మధు: ఇంకేం కావాలి? బ్లాక్‌డాగ్ అయితేగానీ అవదా ఇక?

పరం; మధుసూదనం !

మధు : ఇక్కడే వున్నాను అంకుల్!

పరం : (అనుమానంతో) పేపర్లో పేరు రైటే నంటావా?

మధు : (నవ్వి) ఆరు లక్షల దగ్గరకూడా అచ్చు తప్పులుంటాయా? మీకా డౌటేం అక్కర్లేదు. ఆరు లక్షలు వచ్చింది మీకు కానీ, అక్షరాలు కూర్చేవాడికి కాదుగా. వాడు వణకడు. కరెక్టు గానే వేసి వుంటాడు.

పరం : (ఇంకో అనుమానం) కానీ...నేను, లాటరీ టిక్కట్టు ఎప్పుడుకొన్నానో గుర్తుకు రావడం లేదోయ్.

మధు: (ఉలిక్కిపడి) ఏ...ఏ వన్నారూ?

పరం : లాటరీ ఎప్పుడు కట్టానో గుర్తు రావడం లేదోయ్.

మధు: మీరు అవేమీ థింక్ చేయకండి. మీరు కట్టకపోతే ఏం? మీకు తెలియకుండా మీ వైఫ్ కట్టి వుండొచ్చు. ఆడవాళ్లకు ఆశ ఎక్కువ గదా! లేక, మీ అబ్బాయే కట్టి వుండొచ్చు—మీ మీద భక్తి ఎక్కువై మీ పేరు మీద! అసలు, అదో పెద్ద ప్రాబ్లమా అని? ఛ!

పరం : (తల ఊపుతూ) నువుచెప్పింది కూడా నిజమేనోయ్.

మధు: అందుకే మీరింక అటువంటి సింపుల్ మేటర్స్ గురించి థింక్ చేయకూడదు. లీవ్ ఇట్ టు మి. నా కొదిలేయండి—నేను చూసుకుంటాను.

పరం : (ఏదో గుర్తువచ్చి) అబ్బా యింకా రాలేదూ?

మధు : ఎవరూ? సుధాకరం ది గ్రేట్? వస్తాడు. డోన్ట్‌వర్రీ. రాకేం చేస్తాడు? అదృష్టం కలి సొస్తే పరుగెత్తుకుంటూ వస్తాడు. అన్నట్లు పెళ్ళి ఎప్పుడు సెటిల్ చేద్దామంటారు?

పరం : (పరధ్యానంగా) ఏ పెళ్లి?

మధు: ఆ!?! (బిగుసుకు పోతాడు)

పరం: ఓహో! అదా? (చెట్టుగా) ఆలోచిద్దాం. తొందరేముంది?

మధు: అంతేనంటారా? (నీరసంగా) అంతే లెండి తొందరేముంది? అసలు జరగటం ముఖ్యంగానీ, ఆ మూడుముళ్ళు ఎప్పుడు పడితే ఏం? (హుషారు చూపిస్తూ), అన్నట్లు ముందుగా గ్రాండ్‌గా ఓ డిన్నర్‌పార్టీ, ఏదీ, ఈ శుభ సందర్భంలో, ఊళ్ళో పెద్దలందరికీ దంచేస్తే మన పేరు—ధనా, ధనా, మని...

పరం: (ముఖం చిట్లించి) ఎందుకోయ్?—దండగ ఖర్చులు.

మధు: ఆ?— అంతేనంటారా? - అంతేలెండి. ఎందు కొచ్చిన దండగ? తిన్నవాళ్ళు తినివెళ్ళకుండా అప్పుకూడా అడగొచ్చు. ఏదో సింపుల్‌గా అర్ధగంట ఉపన్యాసం, నేనే ఇస్తాలెండి, ఆ తర్వాత—అరకప్పు వేడి నీళ్ళు ఇచ్చి పంపిస్తే సరిపోతుంది. పేరుకు పేరూ...

పరం: (తీసిపారేస్తూ) ఆ. సింగినాదం. అదిమాత్రం తక్కువలో అవుతుందేమిటి?

మధు: అంతేనంటారా?—అంతే లెండి. అది మాత్రం తక్కువలోఅవుతుందేమిటి? ఇక పేరంటారా? ఇప్పటికే మీ నేమ్ చుట్టుప్రక్కల పరగణాల్లో మార్మ్రోగిపోతూవుంటుంది. అన్నట్లు, వచ్చాక, అత్తయగార్ని కలుసుకోనేలేదు. ఆవిడతోగూడా రెండుముక్కలు మాట్లాడి, గుడ్‌న్యూస్ నేనే అందజేసి మరీ వెళ్తాను. మీరు హాయిగా రెస్టు తీసుకోండి.

పరం : ఒక్కసారిగా చెప్పేవు జాగ్రత్త.

మధు : నాకు తెలియదంటారా? (లోపలికి నడుస్తూ) అత్తయ్యగారూ ! అత్తయ్యగారూ !
(వెళ్లిపోతాడు—పరంధామయ్యను ఆలోచనల్లో ఒంటరిగా ఒదిలేసి)

పరం : (ఆలోచనలన్నీ ఒక్కసారి బయటకు దుముకు తాయ్.) ఆరు లక్షలు ! తలుచుకొంటేనే కడుపు నిండిపోతోంది. (ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతూ) ఏం చెయ్యాలి అంత డబ్బు! (పైకి చూస్తాడు, చుట్టూ చూస్తాడు)

ఛీ! ఈ కొంప మరీ చిన్నదైపోయింది. ఒక చక్కటిమేడ కట్టుకోవాలి. (ఆశలకు అంతేముంది? — ఊహలకే తెక్కలొస్తే...) పెట్రోలు ఎక్కువ త్రాగినా...ఓ చక్కని కారు కొనాలి! వెధవబ్రతుకు...ఆరు లక్షలు వచ్చాక కూడా నేలమీద నడిస్తే ఏం బావుంటుంది? (అరచేతిలో స్వర్గం జారి పోతుందేమోఅన్న భయం వెంటనే కళ్లల్లో కన్పిస్తుంది) ఊరికే కూర్చుని తింటే కొండలే కరిగిపోతాయట! మిగతా డబ్బుపెట్టి వ్యాపారం చెయ్యాలి. ఈ ఆరు లక్షలనీ... అరవై లక్షలు చెయ్యాలి! (ఆలోచన) ఏం వ్యాపారంచేస్తే బావుంటుంది? వెధవహోటేలు వ్యాపారం ఏం ఖర్మం! పెద్దవ్యాపారం ఏదైనా చెయ్యాలి. రంగధామయ్య కళ్లు తిరిగిపోవాలి! (హద్దులు మించిన ఆనందావేశాలతో) అప్పుడు—'మీ అబ్బాయికి మా అమ్మాయిని చేసుకోండి' అంటే 'మా అమ్మాయిని చేసుకోండి' అని...పోటీలు పడుతూ లక్షలు గుమ్మరిస్తామని - మన కాళ్ల దగ్గరకు వస్తూంటే—హాఁ! అప్పుడు... అప్పుడు....ఈ పరంధామయ్య...ఆరు లక్షల పరంధామయ్య...ఠీవిగా...మీసం మెలేసి... ఆ రంగధామయ్యవైపు చూసి, ఒక్కటే... ఒక్కచిరునవ్వు పారేయాలి (నవ్వుతాడు ఘొల్లుమని, గుండె చేత్తో పట్టుకుని మరీ)

(రాధారమణ్ ప్రవేశం : ఈ ప్రపంచం తనదే అన్న ఠీవి కన్పిస్తుంది మనిషిలో.)

(అతడివేగాదు, ఇంకేమీ చూసే స్థితిలో లేడు పరంధామయ్య. తన ధోరణే తనది.)

పరం : అన్నట్లు—ఏం వ్యాపారంచేస్తే...ఈ ఆరు లక్షలూ, అరవైలక్ష లవుతాయ్? కమీషన్ వ్యాపారం చేస్తే?...ఊహుఁ: లాభంలేదు. అసలుకే మోసం రావొచ్చు. కంట్రాక్టు బిజినెస్ అయితే?...అదీ సుఖంలేదు. చుక్క ఎదురు తిరిగితే నెత్తిన చెంగేసుకుపోవాలి. పోనీ...ఎలక్షనులో నుంచుని, మంత్రిపదవికి ప్లానేస్తే?...మరీ ప్రమాదం! ఈ ప్రజల్ని నమ్మటానికి వీలులేదు. తీరా సమయానికి అవతలివాడి పెట్టెలో ఓటేయొచ్చు. ఛీ! ఇవ్వాళ అన్నీ ఇటువంటి ఆలోచనలే వస్తున్నాయేమిటి?...ఇంకా ఏమున్నాయబ్బా వ్యాపారాలు? (ఒక్కసారి ఎగిరిపడతాడు) ఆ! సినిమా! సినిమా తీస్తే?...(వెంటనే నీరసం) ప్చ్! చెప్పలేం అంతా గాలివాటం. మూడోనాటికి డబ్బాలు వెనక్కి తిరిగితే... శ్రీమద్రమారమణగోవిందోహారి!

రాధా: (చటుక్కున అందుకుంటాడు) గోవిందో హారి! అయినా సరే మీరు వెయ్యిచెప్పండి. లక్ష చెప్పండి. వ్యాపారం అంటే సినిమావే వ్యాపారం 'తీస్తే సినిమానే తీయాలి. చూస్తే సినిమాయే చూడాలి' అని సినీ వేమన అన్నాడు. అతను నా స్నేహితుడేలెండి.

పరం: (చూస్తాడు ఆశ్చర్యంతో) మీరు?

రాధా: (గర్వంగా నవ్వి) నా పేరు రాధారమణ్! 'రాధా ఆర్ట్ ప్రొడక్షన్స్' అధినేతను. గొప్ప చెప్పుకోడంకాదు కానీ...నేను తీసిన సినిమాలన్నిటినీ, ఇతర దేశాల్లో గొప్పగా చెప్పు కున్నారు. అఫ్‌కోర్స్! మన దేశం వాళ్లు ఇంకా డెవలప్ కాలేదనుకోండి...

పరం: (ఏదో గుర్తుకువచ్చి) ఉండండి. ఉండండి. ఒక్క విషయం చెప్పండి. మీ అబ్బాయి మీ అమ్మాయికికూడా ప్రేమలేఖలాంటి దేమైనా వ్రాసాడా?

రాధా: (తెల్లబోతాడు. వెంటనే నవ్వేసి) అదేమిటి అలా అడుగుతున్నారు? నాకు చుట్టుపక్కల బంధువులెవరూ లేరు. నేను ఏక్ నిరంజన్. బహుశా, పెళ్ళై, ఆడపిల్లలుంటే! వ్రాసే వాడేమో? క్షమించండి - మీ అబ్బాయికి, ప్రేమలేఖలు వ్రాయడం హాబీనా? అయితే మంచి రచయిత అయివుండాలే. ఆహా! ఏం

లేదు. మనం తీయబోయే సినిమాకు వీగా వాడిచేతే స్క్రిప్టు వ్రాయించేయొచ్చు.

పరం: అః! వాడి మొహం!

రాధా: ఏం? క్లోజప్‌లో బావుండదా? ఫర్వాలేదు. కలర్ కేక్స్‌కొట్టి, గ్లేజింగ్ లైట్స్ ఫోకస్ చేస్తే...

పరం: అది కాదయ్యా గొడవ. ప్రొద్దుటినుంచీ అందరూ లవ్‌లెటరూ, లవ్‌లెటరూ, అంటూంటే, నువ్వు అందుకే వచ్చావను కున్నాను.

రాధా: చెప్పానుగా. పెళ్ళి చేసుకుంటే ఆడపిల్లలు పుట్టొచ్చనీ, వాళ్ళు పుట్టి పెద్దయ్యాక, ఎవడో ఒకడు ప్రేమలేఖలు వ్రాస్తాడనీ, వాడితో మనం పోట్లాడుతూ కూర్చోవాలిసి వుంటుందనీ—అసలు, నేను పెళ్ళి చేసుకోవ డమే మానేసాను.

పరం: (ఎగతాళిగా) గొప్ప పని చేసావు!

రాధా: (గర్వంగా) చెప్పుకోటంకాదు కానీ, నేనేం చేసినా గొప్పగా వుంటుందని ఆస్ట్రేలియా మాజీ ప్రధాని అంటూండేవాడు. ఆయన నా స్నేహితుడే లెండి.

పరం: ఇంతకూ మీరు వచ్చిన పని?

రాధా: చూసారా, మాటల్లోపడి మర్చేపోయాను. అన్నట్లు, పరంధామయ్యగారున్నారా?

పరం: నేనేనయ్యా ఆ ప..రం..ధామయ్యను!

రాధా: వాట్? గుర్తుపట్టలేకపోయాను. (కావిలించు కుని) ఒరేయ్! పరంధాముడూ! నువ్వే నటరా? ఎంత మారిపోయావు? చిన్నప్పుడు ఎంత చలాకీగా, బొద్దుగా, బావుండేవాడివి. అవును. పెరిగేవయస్సేకాని తరిగేవయస్సు కాదుగా.

పరం: (తబ్బిబ్బుపడి) ఉండండి. ఉండండి.

రాధా: వాట్? గుర్తుపట్టలేదూ? నేనురా, రాధాయ్ గాడిని! చిన్నప్పుడు మనిద్దరం పిలక మాస్టారుదగ్గర కలిసి చదువుకున్నాం.

పరం: (అనుమానంతో) నువ్వా నేమానా?

రాధా: ఊఁ. బడి ఎగ్గొట్టి, గోడుంబిళ్ళ, కోతి కొమ్మచ్చి ఆడుకునేవాళ్ళం!

పరం: (ఆశ్చర్యంతో) బడి ఎగ్గొట్టి...గోడుంబిళ్ళ, కోతికొమ్మచ్చి ఆడుకునేవాళ్ళమా?

రాధా: ఊఁ! ఒకసారి మన పిలకపంతులికి దొరికి పోయాంకూడా. ఆయన పేముబెత్తం పుచ్చు కుని వెంటబడితే, మా మామిడితోటలోకి పారిపోయి చెట్టెక్కి కూర్చున్నాం.

పరం: (ఇంకా ఆశ్చర్యంతో) చెట్టెక్కి...... కూర్చున్నాం?

రాధా: ఆ...అప్పుడు (విరగబడి నవ్వి) చెట్టుమీదున్న కోతి ఒకటి—మన పిలకపంతుల్ని వెక్కిరించి, మామిడిపెండె పెట్టికొట్టింది. అది చూసి నువ్వూ నేనూ ఒకటే నవ్వు. (ఫక్కున నవ్వుతాడు).

పరం: (నవ్వొస్తుంది) ఏం చిత్రం?

రాధా: (సీరియస్‌గా) నిజమేరా. తలుచుకుంటే, చిన్నతనం అంతా విచిత్రమే. ఎందుకు పెద్ద వాళ్ళం అయ్యామా అని అన్పిస్తుంది.

పరం: (ఆలోచిస్తూ వుంటాడు)

రాధా: ఏవిటి? ఇంకా గుర్తు రాలేదూ? అవునులే. ఇప్పటి సంగతా అది? నేనే మొదట గుర్తు పట్టలేకపోయాను. నీ కసలు మొదటినుంచీ 'జ్ఞాపకశక్తి' తక్కువని పిలకపంతులు అంటూండేవారు.

పరం: (తెల్లబోయి) నాకా? జ్ఞాపకశక్తి తక్కువా??

రాధా: అవును. ఒకసారి...(నవ్వి) మరచిపోయి, లాగూ తొడుక్కోకుండా బడికొచ్చేసావు, అంతా నవ్వ గానే, పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయావు.

పరం: (నిజంగా సిగ్గుపడిపోతాడు.)

రాధా: పెళ్ళిఅయ్యాక, బహుశా...ఇప్పుడు మతి మరుపు తగ్గిపోయివుండాలి. అన్నట్లు, నీ పెళ్ళికి రాలేకపోయినందుకు చాలా విచా

రించానురా. అవునూ గ్రీటింగ్స్ పంపాను అందలేదూ?

పరం: అందే వుంటుంది—గుర్తులేదు.

రాధా: అది సరేగానీ, ఇందాక ఎవరో లవ్‌కుమార్ అని చెప్పావే! ఏడీ?

పరం: అలా వెళ్ళాడు, వస్తాడు. అరె. నిలబడే వున్నారు కూర్చోండి.

రాధా: వాట్ మేన్! ఇంకా బహువచనం ఉపయోగిస్తావ్. చిన్నప్పుడు, ఇద్దరం...ఒరేయ్ అంటే ఒరేయ్ అనుకునే వాళ్ళం.

పరం: దానిదేముందిలే, కూర్చోరా.

రాధా: (హుషారుగా) అహ్హా ఇప్పుడు...ఇప్పుడు నా చిన్ననాటి పరంధాముడువి అనిపించావు.

పరం: (తనూ కూర్చుని) అవునూ, ఇప్పుడేం చేస్తున్నావ్?

రాధా: (ఠీవిగా) బిజినెస్! లక్షలమీద తప్పితే బిజినెస్ చెయ్యబుద్ధికాదు నాకు. వస్తే యాభై లక్షలు, పోతే పది లక్షలు!

పరం: (నోరు తెరుస్తాడు) ఆహా! ఏమిటోయ్ ఆ వ్యాపారం?

రాధా: సినిమా!

పరం: సినిమా తీయటమా?

రాధా: ఆ. నువ్వు చూడలేదనుకుంటా. నేను తీసిన సినిమాలు ఈ దేశంలో ఎక్కువ ఆడవు. విదేశాల్లో మంచి గిరాకీ. బోలెడు ఫారెన్ ఎక్స్ఛేంజి! మొన్న ఆ మధ్యన నా పిక్చర్‌తో బాటు రష్యాకూడా వెళ్ళొచ్చా. పేపర్లో చదవలేదూ?

పరం: ఏమో గుర్తు లేదు. అయితే, మంచి లాభసాటి వ్యాపారం అంటావు?

రాధ: అంటావా ఏమిటి? బల్లగుద్ది చెబుతాను. అంతకంటే లాభసాటి ఇంకోటి చూపించు. మొదట నా పెట్టుబడి ఎంతంటావు?

పరం: ఎంత?

రాధా: రెండు లక్షలు! ఇప్పుడు నా దగ్గిర ఎంత వుందంటావు?

పరం: ఓ పది లక్షలు...

రాధా: ఛ. వెధవ పది. ప్రారంభోత్సవానికే చాలదు.

పరం: (బిత్తరపోయి) ఆఁ!

రాధా: పదికోట్లు. నెట్ క్యాష్ పదికోట్లు. (నెమ్మదిగా) ఇది ఎకౌంట్‌లో చూపించేది. ఇదిగాక, బ్లాక్‌మనీ, గోల్డు, ఫారెన్ కరెన్సీ అంతా కలుపుకుని ఇరవై కోట్లు వుంది!

పరం: మొత్తం ముఫ్ఫై...

రాధా: (చప్పరించేసి) ఆ. ఏమంతలే. ఈ మధ్య ఇంకో ఇంటర్నేషనల్ కలర్ పిక్చర్ సెవెన్టీ యమ్మెమ్‌లో తీస్తున్నాను. ఇంగ్లీషు, హిందీ, తెలుగు, తమిళ్ వర్షన్స్ ఎట్ ఏ టైమ్‌లో తయారు అయిపోతాయ్. ఇంగ్లీషులో—'లవ్—మి!', హిందీలో: 'ఆవో—ప్యార్‌కరో!', తెలుగు: 'నన్నే ప్రేమించు', తమిళ్: గొప్ప సెంటిమెంటల్ థీమ్. నోబుల్ ప్రైజు తప్పదనుకో. ఇక డబ్బు అంటావా? ఇది పూర్తి అయి విడుదలయితే నెట్‌క్యాష్ అరవై కోట్లు లాభం వస్తుందని అంచనా!

పరం: (నోట మాటరాదు) అ...అరవై..కో..కోట్లే?

రాధా: (నిర్లక్ష్యం) చెప్పలేం. ఇంకా ఎక్కువే రావొచ్చు.

పరం: (నెమ్మదిగా, బతిమాలుతున్న ధోరణిలో) ఒరేయ్ రాధాయ్! నీకు తెలుసో లేదో, నాకు ఆరు లక్షలు లాటరీలో వచ్చాయ్.

రాధా: (సంతోషం నటిస్తూ) వాట్? మరి చెప్పవేం! కంగ్రాచులేషన్స్ అంత పెద్ద చెప్పుకోతగిన ఎమౌంట్ కాకపోయినా ఫర్వాలేదు. అదృష్టం అంటే అలా జాక్‌పాట్‌లాగా తన్నుకురావాలి. డబ్బులేనివాడికీ లోకంలో, ముఖ్యంగా ఈ దేశంలో విలువలేదు. కనీసం లక్ష రూపాయలు మించివున్నవాడే మనిషిలో జమ. నువ్వు నా స్నేహితుడవని యిప్పుడు నేను నల్గురిలో గర్వంగా చెప్పుకొంటాను.

పరం: ఏదో, నీ తర్వాతనే గదా! (నసుగుతూ) నాకూ నీ అంతకాకపోయినా, నీలాగా ఓ చిన్నవ్యాపారం చేద్దామనివుంది.

రాధా: ఏం వ్యాపారం?

పరం : అదే!

రాధా : సినిమానా?

పరం మరే. నీ సలహా ఏమిటి?

రాధా : వెరీ గుడ్ అయిడియా! ఉన్నా, పూడ్చి పెట్టుకుపోయినా, సినిమా వ్యాపారమే బెస్టు! అడుక్కుతినే వాళ్లీ వ్యాపారంతో అయి దంతస్థుల భవనాలు కట్టారు. అద్దె కారుల్లో తిరిగేవాళ్లు అయిదారు కార్లు మెయిన్ టెయిన్ చేస్తున్నారు. ఒకప్పుడు, వాడిపేరు ప్రక్కవాడికి తెలీకుండా తిరిగినవాడు— ఈనాడు అంతర్జాతీయఖ్యాతి సంపా దిస్తున్నాడు. ఈ ఫీల్డులో దిగిన పెద్దమనుష్యు లకు, ఈనాడు వజ్ర బ్రహ్మరథం పడుతోంది అంటే, ఆ గ్లామరూ, గొప్పతనం ఎక్క డున్నాయి? సినిమాలోనే వుంది అదంతా!

పరం : అందుకే నేను కూడా...

రాధా : సినిమా తీస్తానంటావు. ఇన్నాళ్ళకి నీ బుద్ధి వికసిస్తోంది. ఆల్ రైట్! శుభస్యశీఘ్రం! మంచిరోజు చూసి ఓ మంత్రిచేత క్లాప్ కొట్టించేస్తే...

పరం : (చటుక్కుని మధ్యలో అందుకుంటాడు) క్రాపా? అదేమిటిరోయ్. సినిమా తీసేముందు క్షవరం చేయించుకోవాలా? దానికి, ఎవడో మంత్రిదాకా ఎందుకు?

రాధా : (కంగారుపడి) చంపావు పో! క్రాపు కాదు! క్లాప్. క్లాప్...అంటే...అంటే నీకు చెప్పినా అర్థం కాదులే.

పరం : నాకు మాత్రం ఏం తెలుసు? స్నేహితుడివి— కాస్త నువ్వే చూడా లీ వ్యవహారం.

రాధా : (అనుమానిస్తూ) నేనా? నా కెక్కడ తీరిక? సరేలే. ఏం చేస్తాం? స్నేహితుడివి గదా మరి. అడిగినప్పుడు తప్పుతుందా? భారం అంతా నేనే తీసుకుంటాను.

పరం : హమ్మయ్య. బ్రతికించావు.

(లోపలినుండి పళ్ళెంమీద గరిటెతో గంట కొట్టినట్లు చప్పుడవుతుంది)

రాధా: (ఉలిక్కిపడి) ఏమిటిరా ఆ చప్పుడు?

పరం: ఆఁ! ఏమీ లేదు. భోజనం సిద్ధం అయి వుంటుంది. అన్నట్లు...నీ సంగతి...

రాధా: ఆమహా! ఆ శ్రమ నీకేం వద్దు. అంతా అయ్యేకే వచ్చాను.

పరం: అదేమిటిరా, రాక రాక వచ్చి...

రాధా: అందుకే! అయినా రాత్రికి నువ్వు వద్దన్నా నీ ఆతిథ్యం స్వీకరిస్తాను లేవోయ్. ప్రస్తుతం నన్ను వదిలేయ్.

(మధుసూదనం వస్తాడు)

మధు : (వస్తూనే) అంకుల్! విూల్స్ రెడీ! అత్తయ్య కాలింగ్ (అంటూ రాధాని చూసి ఉలిక్కిపడి సర్దుకుంటాడు)

రాధా : (తలెత్తి మధునిచూసి ఉలిక్కిపడి)ఇతనుఎవ్వరా?

పరం : ఇతనూ...ఇతనూ...

మధు: (తాపీగా) పరంధామయ్యగారి అల్లుడిని. అంటే మా చెల్లాయినే వీరి అబ్బాయికి యిచ్చి పెళ్లి చేస్తున్నాం.

రాధా: గుడ్ న్యూస్. చెప్పలేదేం పరంధాముడూ?

పరం : అంటే...అంటే...ఇంకా నిశ్చయం కాలేదనుకో.

మధు : అఫ్ కోర్స్! తాంబూలాలు పుచ్చుకోలేదుగానీ, మాట అనుకున్నాం లెండి.

పరం: అంటే...అంతే.

రాధా : (తేలిగ్గా శ్వాస విడిచి) ఓహ్! మాట అను కున్నారా? నిజాని కీ దేశంలో మాటకు విలువ లేకపోయినా, మా పరంధాముడి మాటమాత్రం విలువైనది. వాడు చిన్నప్పుడుకూడాఅంతే.ఏలా?

పరం : ఏదోలే.

మధు : అంకుల్! మీకు వేళ కావటంలేదూ?

పరం : అవునవునూ (లేస్తూ) మీ రిద్దరూ మాట్లాడుకుంటూవుండండి. నేను ఇప్పుడే వచ్చేస్తాను.

మధు : అలాగే.

రాధా : నెమ్మదిగా భోంచెయ్‌రోయ్. తొందరేంలేదు.

[పరంధామయ్య వెళ్లిపోతాడు. రాధారమణ్ పేపర్‌తీసి ముఖానికి అడ్డం పెట్టుకుంటాడు. మధుసూదనంకూడా ముఖం ఇంకోవైపుకు త్రిప్పి పేపరు తీసుక్కూర్చుంటాడు. ఇద్దరూ మౌనంగా

వుంటారు. రాధారమణ్ లేచి నిలబడతాడు. మధుసూదనం కూడా లేచి నిల్చుంటాడు. ఒకరినొకరు చూడాలంటే భయం. పలకరించుకోటానికి భయం. చివరకు రాధారమణే ధైర్యం చేస్తాడు.]

రాధా: (సీరియస్‌గా) ఒరేయ్! మాయలమరాఠీ!

మధు: (సీరియస్‌గానే) మర్యాదగా మాట్లాడు. నా పేరు మధుసూదనం!

రాధా: (నవ్వేస్తూ) ఎవరి కళ్ళు కప్పినా, నా కళ్ళు కప్పలేవు. ఇక్కడికి వచ్చేవేంకథ?

మధు: (నవుతాడు) నువ్వెందుకు వచ్చావో, నేనూ అందుకే.

రాధా: ఉచ్చులు బిగించావా?

మధు: నీకు అనవసరం. నీకు యిక్కడ చోటులేదు. ఇంకోడిని వెతుక్కుంటే మంచిది.

రాధా: (నిర్లక్ష్యంగా భుజాలు ఎగరేసి) ఎలా చెప్ప గలవు? నా గురి యింతవరకూ తప్పలేదు. నీలాంటివాళ్ళు నాకో లెఖ్ఖకాదు. నువ్వే త్వరగా తోక ఝాడిస్తే నంటికి మంచిది.

మధు: (నవ్వి) చూద్దాం! నువ్వో నేనో?

రాధా: (ఆలోచించి) ఓ పని చేద్దాం. నాతో చేయి కలుపు, ఫిఫ్టీ...ఫిఫ్టీ!

మధు: (మాట్లాడడు)

రాధా: ఏం? ఆలోచిస్తున్నావు?

మధు: నిన్ను నమ్మేదెవరు? అసలు నీకు వాటా యివ్వవలసిన అవుసరం ఏమిటీ అని?

రాధా: (నవ్వి) భలే. మొత్తం నీకే అని మురిసి పోతున్నావా? ముసలాడు నీ ఉచ్చులో పడలేదు.

మధు: అతను నిన్నుమాత్రం నమ్మాడనుకుంటున్నావా?

రాధా: (గర్వంగా) అవును. అతనికి నేను సినిమాతీసి పెడతాను.

మధు: (ఆశ్చర్యంగా) నువ్వా!?

రాధా: యస్. నేనే.

మధు: (ఎగతాళిగా) అఫ్‌కోర్స్, లైట్‌బోయ్‌వి— నువ్వు సినిమా తీసి పెడతావా?—ముసలాడి నెత్తిన చేతులు పెడతావా?

రాధా: (కోపంగా) నువ్వు ఉద్ధరిస్తావా ముసలాడిని?

మధు: అవును. అతన్ని నా బంధువుగా చేసు కొంటున్నాను.

రాధా: రాబందులా పీక్కు తింటానికి!

మధు: కాదు. నా చెల్లెలు సుఖంకోసం.

రాధా: (పకపక నవ్వి) ఎవరికి చెపుతావు ఈ కథ లన్నీ! ఈ చెల్లెల్ని నెక్కడ పట్టావు? ఆ—ఎక్స్ట్రా వేషాలువేసే సుబ్బులేగా!

మధు: (ముఖం మాడిపోతుంది) కాదు. వరలక్ష్మి!

రాధా: ఆఁ! వరలక్ష్మా? ఏ వరలక్ష్మి? ఏమిటి నువ్వనేది?

మధు: అదే! నువ్వు లేపుకురాలా? హాయిగా సంసారం చేసుకొనే ఆడదాన్ని—సినిమా పిచ్చి ఎక్కించి, కారులూ మేడలూ వస్తాయని ఆశపెట్టి, ఒక అర్ధరాత్రి—తీసుకుపోలా? ఎవరు మరచి పోయినా ఆ వరలక్ష్మి మొగుడు మరచిపోలేదు నిన్ను. కాకితో కబురంపితే చాలు!

రాధా: (ముఖం తుడుచుకుంటాడు. మనిషి వణుకు తూంటాడు. చెదరకుండా వుండాలని ప్రయత్నిస్తాడు).

మధు: అంతకాదు. సినిమాల్లో చేరుస్తానని, ఎంత మంది కన్నెపిల్లల్ని పడుపు వృత్తిలోకి దింపావో నా దగ్గర లిస్టుంది.

రాధా: (కోపంతో ముఖం ఎఱ్ఱబడుతుంది)

మధు: వాటాలు కలవమని ఎంతమంది దగ్గర ఎంతెంత వసూలు చేశావో, అన్నీ తారీఖులతో సహా నా దగ్గర వున్నాయ్.

రాధా: (అరుస్తాడు) అంతా అబద్ధం! అబద్ధం!

మధు: (నవ్వి) అరవక. నీకే ప్రమాదం. ముసలాడు వినగలడు.

రాధా: (చటుక్కున చేతి కర్రలోంచి కత్తి తీస్తాడు) నిన్నిక్కడ హత్యచేస్తే నీకు దిక్కెవరు?

మధు: (ఒక అడుగు వెనక్కివేసి) ఎక్కడికి పారి పోగలవు? ఎన్ని హత్యలు చేస్తావు? వరలక్ష్మి హత్యకేసు యింకా పోలీసు రికార్డుల్లో అలాగే వుంది.

రాధా: (వికృతంగా నవ్వి) ఓహో! అదీ తెలుసు కున్నావా?

మధు: (నవ్వి) ఇంకా చాలా తెలుసు. కత్తి తీసి ఎవరిని భయపెడతావు? చిన్నపిల్లవాణ్ణిగాదు నేను దాచుకోదాన్ని—ఆత్మహత్య చేసుకోటానికి పనికి వస్తుంది!

రాధా : (ఒక్క క్షణం ఆలోచించి, కత్తి దాచేస్తాడు) ఆల్ రైట్. నన్ను పొమ్మంటావు అంతేగా?

మధు : (నవ్వి) అంత పిచ్చివాణ్ణికాదు.

రాధా: అయితే వాటా తేల్చు.

మధు : తేల్చేందుకేముంది? ముందు వచ్చింది నేను సుబ్బులుకూ్కడా వాటా యివ్వాలి. అందుచేత నాకు ఎక్కువ రావాల్సివుంటుంది.

రాధా : (ఏదో అలికిడవుతుంది) ష్. ఎవరో వస్తున్నట్లుంది. లోపలకిపోయి మాట్లాడుకుందాం.

మధు : ఇక్కడ ప్రమాదం. పద పోదాం, మిలావ్ హాత్.

(ఇద్దరూ చేతులు కలుపుకుని మధ్యగదిలోకి వెడతారు. పి. రంగధామయ్య వస్తాడు నెమ్మదిగా. వెనుకటి విసురులేదు. అదే సమయానికి భోజనం ముగించి పరంధామయ్య కూడా ప్రవేశిస్తూ, రంగధామయ్యను చూసి ఆశ్చర్యపడతాడు.)

పరం : (ఎగతాళిగా) ఓహోహో ! ప్రొప్రయిటర్, పి. రంగధామయ్యగారా? నమస్కారం. ఏమిటో దారి తప్పినట్లున్నారు, ఇది మా వీధి. మీ వీధి కాదే?

రంగ : (బిక్కచచ్చి) ఇంకా అవన్నీ గుర్తుంచుకున్నావా పరంధామయ్యా, ఏదో నోరు జారి అన్నానే అనుకో.

పరం : అవునులే. నోరుదేముంది—మనకి వుండాలిగాని !

రంగ : ఏమయినా అను. అయినవాళ్ళం! నువ్వు అన గూడదా? నేను పడకూడదా?

పరం : 'ఊరకమారరు మహాత్ములు'—ఏమిటో వుంది కథ !

రంగ : అహ. ఏంలేదు. నేను మీ యింటికి వచ్చి అలా అన్నానని మా అమ్మాయితో చెబితే చాలా బాధపడింది. తనూ మీ సుధాకరాన్ని ప్రేమిస్తోందిట. మీ వాడినితప్ప మరొకడిని పెళ్ళిచేసుకోదట పంతం పట్టుకు కూర్చుంది,

పరం : ఎంత ఆశ్చర్యం? ఏం విచిత్రం?

రంగ : విచిత్రం ఏం లేదు. నాకేం తెలుసు మనసులో వున్నమాట? ఉత్తరం చూపించి 'ప్రేమలేఖ వ్రాసాడు ఫలానా అబ్బాయి' అంటే చివాట్లు పెట్టమంటోంది గామోసనుకున్నానుగాని, పెళ్ళి సంబంధం మాట్లాడమని అంటోందని తెలుసుకోలేకపోయాము. ఈ కాలం కుర్రకారు ప్రేమలు—ముసలివాళ్ళం మనకేం తెలుస్తాయి చెప్పండి?

పరం : (పాత ధోరణిలోనే) మాతో వియ్యమా? ఛ! ఛ! గతిలేనివాడు అనవలసిన మాటలుగదా అవి అబ్బో మీరెక్కడ ! మేమెక్కడ !

రంగ: అలా అంటే భావ్యంగాదు. ఒక్కగా నొక్క కూతురు. నోరు తెరచి అడిగింది దానికోరిక తీర్చలేక పోయినాక నేనుండి ప్రయోజన మేమిటి? నువ్వే చెప్పు.

పరం : (మారదు) మీకు తేలేదేమిటి? మా వాడు శొంఠ్ఠి వెధవ! పనీపాటు లేకుండా అడ్డమైన ఆడపిల్లలకూ ప్రేమలేఖలు వ్రాసేవాడు.

రంగ : (తేలిగ్గా) అదేమంత పట్టించుకోదగ్గది కాదు లేవయ్యా! పెళ్ళయి వ్యాపారంలోపడితే అన్నీ అవే కుదుటపడతాయి.

పరం: (అతనివైపు గుచ్చి గుచ్చి చూస్తూ) ఇంతకీ అమ్మాయి మాట కాదనలేక వచ్చావు పాపం!

రంగ : అంతేగదా మరి. నేను గాకపోతే దానికి యింకెవ రున్నారు, తల్లిలేని పిల్ల!

పరం: అంతేగాని, నాకు ఆరు లక్షల రూపాయలు లాటరీలో వచ్చిందని తెలిసి రాలేదంటావు?

రంగ: (తెల్లబోయి) ఏమిటీ, నీకు లాటరీలో ఆరు లక్షలు వచ్చాయా? అసలు నాకు ఆ సంగతే తెలియదు సుమా! ప్రమాణ పూర్తిగా.

పరం : (ఎగతాళిగా) అయితే—మీ అమ్మాయి అర గంటకోసారి మనసు మార్చుకుంటూ వుంటుందా?

రంగ : (బాధపడుతూ) ఛ! ఛ! మా అమ్మాయి అటువంటిదికాదు. చాలా మంచిది. మీ అబ్బాయినే అడగండి.

పరం: అయితే మా అబ్బాయి పెద్దవాడా?

రంగ: ఛ! ఛ! ఎవరంటారు? మీ అబ్బాయికేం? బంగారం! వెతుకుతే ఈ ఆరు జిల్లాలలో నూటికో, కోటికో ఒకడుకూడా, మీ అబ్బాయికి సాటిరాడు.

పరం: (ఆశ్చర్యం నటిస్తూ) ఎవరూ? ఈ మాట అంటున్నది రంగధామయ్యేనా?

రంగ: పొరబాటు నాదే అన్నానుగా పరంధామయ్య బావగారూ!

పరం: (తెల్లబోయి) బావగారూ!

రంగ: అవును బావగారూ! మీరు నా మాట నిలబెట్టాలి.

పరం: (నిర్లక్ష్యంగా) ఏం మాట?

రంగ: అదే! అమ్మాయికి యిచ్చి వచ్చాను. తప్పకుండా ఈ సంబంధం ఖాయం చేస్తానని.

పరం: ఎవరి నడిగి యిచ్చారు మాట? ఏమిటో ఆ ధీమా?

రంగ: మీరు నా మాట కాదనలేరని.

పరం: ఏం? ఎందుకని? మీచేత అడ్డమైన దీవనలు పొందాను గమకనా? ఇదిగో, రంగధామయ్య గారూ! గడియ కో రకంగా మారే మనుషు లంటే నాకు మహాచెడ్డ చిరాకు.

రంగ: (నిరాశగా) అంతే నంటావా?

పరం: అంతే.

రంగ: ఇంకొక్కసారి ఆలోచించు పరంధామయ్యా!

పరం: (వినుగ్గా) ఆలోచించటానికేముంది రంగధామయ్యగారూ! — మావాడు రౌడీవెధవ! అల్లరివాడు. కనిపించిన అమ్మాయికల్లా ప్రేమలేఖలు వ్రాసేవాడు...మాకు మీతో వియ్యంపొందే అర్హతలేదు. సరేనా?

రంగ: ఛ! ఛ! అలా అని ఎవరంటారు?

మధు: (ప్రవేశిస్తూ) నేనంటాను. ఐ విల్ ప్రూవ్ ఇట్. ఎవడు నో అంటాడో అనమను, చూస్తాను. పరంధామయ్యగారి యంగ్ సన్ నిజంగా చెడ్డవాడే. అందుకు ఎగ్జాంపుల్, అతను నా చెల్లెలికి కూడా లవ్ లెటర్ వ్రాయటమే!

రంగ: (ఆశ్చర్యపోయి) ఏమిటీ? నిజమే?

మధు: ఈ మధుసూదనం ఎప్పుడూ ట్రూతే చెబుతాడు.

రంగ: మీ రెవరు...?

మధు: పరంధామయ్యగారు మా చెల్లెలికి కాబోయే మామగారు.

రంగ: (ఇంకా తెల్లబోతాడు) నిజమా?

మధు: ఈ మధుసూదనం ఎప్పుడైనా అబద్ధమాడాడా?

రంగ: (వినుగ్గా) నువ్వాగవయ్యా. ఏం పరంధామయ్యా! ఈ విషయం నిజమేనా?

మధు: నేను రాసిస్తాను బాండు, కావాలంటే! అంత కంటే గ్యారంటీ ఎవడిస్తాడు నీకీ రోజుల్లో?

రంగ: (పరంధామయ్య చేతులు పుచ్చుకుని) పరంధామయ్యా! అమ్మాయి వసంత మీ సుధాకరంకోసం కలవరిస్తోంది.

మధు: మా సిస్టర్‌కూడా సుధాకరంకోసం తపస్సు చేస్తోంది.

రాధా: (ప్రవేశిస్తూనే) ఎవరయ్యా నువ్వు? ఆయ నంతగా చెబుతూ వుంటే, తెలియటంలేదూ? మనిషికోసారి చెబుతే అర్థంకాదూ?

రంగ: (తెల్లబోయి) మీ రెవరు?

రాధా: (కవిగా) ఈ పరంధాముడికి, ఆత్మారాముడిని. నా మాటా, వాడిమాటా ఒకటే. అంటే బాల్యస్నేహితులం.

రంగ: (అతని వైపే పరీక్షగా చూస్తూ) మీ ముఖం... ఎక్కడో...ఎదో...పేపర్లో చూసినట్లు గుర్తు. ఏమని చదివానో...

రాధా: (ఉలిక్కిపడి సర్దుకుంటాడు) నన్నా? అఫ్ కోర్స్! చూసేవుంటారు నా ఫోటో చాలా సార్లు పేపర్లో పడిందిలెండి!

మధు: అవునవును.

పరం: రంగధామయ్యా! యిక నువ్వు వెళ్ళొచ్చు.

మధు: (సంతోషంతో) అదిగో సెలవయింది మీరిక దయచేస్తే...

రాధా: (చేతులు జోడించి) నమస్కారం రంగధామయ్య గారూ! వెళ్ళిరండి. వీలుంటే మళ్ళీ కలుద్దాం.

రంగ: (ఇద్దరివైపూ చురుగ్గా చూస్తాడు) సరే. అలాగే వెళ్తాను కానీ, పరంధామయ్యా! నీ కు ట్కు ఏదో గ్రహాలు చేరినట్లున్నాయ్. ఇప్పుడు నీకు నిజం తెలియదు. తర్వాత కలుసుకుందాం. శలవు. (అంటూ వెనక్కి తిరుగుతాడు).

మధు: టా! టా! ఛీరియో!

రాధా : గుడ్‌బై ఫ్రెండ్! (ఇద్దరూ పరంధామయ్య చూడకుండా చేతులు కలుపుకుంటారు)

(తెలిఫోన్:— 'బెల్‌గ్రాం సార్' అని కేక విన్పిస్తుంది)

పరం: (ఉలిక్కిపడి) టి... బెల్‌గ్రాం ఎవరికి?

మధు: ఆగండి. నే వెళ్ళి తెస్తాను. (వెళ్తాడు).

పరం : (ఏదో భయంతో) అబ్బాయి యింకా రాలేదురా?

రాధా : వస్తాడు. ఖంగారు పడకండి.

పరం : ఈ మధు ఇంకా రాడేమిటి?

మధు: (వస్తూ) బెల్‌గ్రాం మీకు కాదు పరంధామయ్యగారూ! పి. రంగధామయ్యగారికి. హోటల్ దగ్గర కనుక్కొని యిలా వచ్చాడట. (చించి చూస్తాడు)

రంగ : (కంగారుపడి) నాకా? నాకు బెల్‌గ్రాం ఏమిటి?

రాధా: (నిర్లక్ష్యంగా) ఏం రాకూడదా? చదవ్వోయ్ మధూ!

మధు : (తెల్లబోయి అందరివైపూ చూస్తాడు)

రాధా : అలా తెల్లబోతావేం? ఏదీ యిలా ఇవ్వు (అని లాక్కొనిచూసి, కొయ్యబారిపోతాడు).

పరం : ఏమిటిరా, ఏముంది అందులో?

రంగ: (వణుకుతూ బాబూ! త్వరగా చెప్పండి, ఏమిటా కబురూ?

రాధా : (తేరుకుని) 'లాటరీ...ఫస్ట్‌ప్రయిజ్ విన్నర్... పి. రంగధామయ్య......ప్రొపయిటర్ వసంతా హోటల్...ఎమౌంట్...సిక్స్ లాక్స్!

పరం: ఆఁ?!?

రంగ : (ఏమీ అర్థంకాదు) నాకు ఫస్ట్ ప్రయిజా? ఆరు లక్షలా??

పరం: మరి నాకు?

మధు: జీరో. నాకు అర్థం అయింది. చెబుతాను వినండి. పేపర్లో రంగధామయ్యగారి పేరు బదులు పరంధామయ్య అని పడింది. నిజంగా ఆరు లక్షల అదృష్టవంతుడు—రంగధామయ్యది గ్రేట్!

రాధా : (మతిపోయి) ఏమిటిది? అంతా మిష్టరీలా వుంది!

మధు : (నవ్వలేక నవ్వుతూ) మిష్టరీ ఏమీ లేదు. సింపుల్! 'పి. రంగధామయ్య' అనే పేరు 'పరంధామయ్య' అయిపోయింది. ఎంత పొరపాటు?

పరం : (ఏడ్పు మొహంపెట్టి, ఆరున్నొక్క రాగంలో) గ్రహపాటు. రాశిఫలాలలో వ్రాయనేవ్రాశాడు. అది యింత ఘోరంగా వుంటుందని అనుకోలేదు. ఆరు లక్షలు!—అమ్మయ్యో, ఆరు లక్షలూ చేయిజారిపోయాయి. ఇంతలో ఎంత మార్పు?

రాధా : విచారించకు మిస్టర్ పరంధామయ్యా, ట్రయ్ యువర్ లక్ ఫర్ ది నెక్స్‌ట్ టయిం.

మధు : రంగధామయ్యగారూ! మీరు మమ్మల్ని క్షమించాలి ఇప్పుడు నిజం చెబుతున్నాను.

రంగ : (నిర్లక్ష్యంగా) ఏమిటది?

మధు : నా చెల్లెలు సుధాకరాన్ని చేసుకుంటానన్న మాట అబద్ధం. అతను ప్రేమలేఖ వ్రాసాడన్నమాట కూడా అబద్ధమే.

రంగ : (నవ్వి, ఎగతాళిగా) అయితే, ఈ మధుమాటనం ఎప్పుడూ ట్రూతే చెప్పడన్నమాట.

మధు : క్షమించండి. ఇప్పుడు చెప్పేదిమాత్రం నిజం. నా చెల్లెలు క్షేమం కోరి అలా నటించవలసి వచ్చింది. వెయ్యి అబద్ధాలాడయినా ఒక పెళ్లి చెయ్యమన్నారుగదా— నేనాడింది ఒక్కటే అబద్ధం!

రంగ: పెళ్లిచెయ్యమన్నారుగానీ, ఇలా కొంపలు తీయమనలేదే?

పరం: ఒరేయ్ రాధాయ్! చూశావా? ఎంత మోసం? ఎంత మోసం?

రాధా : ఏయ్! మర్యాదగా మాట్లాడు. రాధారమణ్ గారూ అని పిలు.

పరం : ఆ ? ! ?

రాధా : అవును. ఒరేయ్‌అంటే, నేను నీ స్నేహితుడి ననుకున్నావా?

పరం : (తెల్లబోతూ) కాదూ? నువ్వు నా స్నేహితుడివి కాదూ?

రాధా : కానేకాదు. నువ్వేదో సినిమా తీస్తానంటే, నీతో స్నేహం చేశాను—అంతే!

పరం: (గుండెలు బాదుకుంటూ) ఎంత మోసం? ఎంత ఘోరం?

మధు: రంగధామయ్యగారూ! చిన్న మనవి...

రంగ: ఏమిటది?

మధు: మీ కిష్టమైతే, మా చెల్లెలిని మీరు పెళ్ళిచేసుకోండి, వసంతను నేను పెళ్ళి చేసుకుంటాను.

రాధా: వండర్‌ఫుల్! బావుంటుంది. కానీ, ఆ హోటల్ వ్యాపారమే బాగుండలేదు. అది అమ్మేసి ఓ సినిమా తీద్దాం.

రంగ: బావుంది. చాలా బాగుంది. (వ్యంగ్యంగా) ఏం పరంధామయ్యా! సలహా బాగుంది కదూ?

పరం: (మాట్లాడడు. మతిపోయి కూర్చుంటాడు).

రంగ: ఆయనకేంతెలుసు బావుందోలేదో చెప్పటానికి? ఆయనేమైనా డైరక్టరా?—అన్నట్లు పిక్చర్ డైరక్షన్ నా కొడికేస్తారుగదా?

మధు: అవును. చాలా తక్కువలో అయ్యేలా చూస్తారు, హీరోయిన్‌గా మన వసంతనే వేయిద్దాం.

రంగ: (పగలబడి నవ్వి) ఇదీ మరీ బావుంది. చాలా బావుంది. అయితే హీరో ఎవరు వేస్తారు?

మధు: (సిగ్గుపడుతూ) ఎవరో ఎందుకూ? కానీ ఖర్చులేకుండా నేనే వేస్తాను.

రంగ: నీకు వేషం వుందిలే. భయపడకు! నీకు విలన్ ఇచ్చేశాను.

మధు: (షాకిపోయి) నేను విలనా? మరి హీరో?

(సుధాకరం—వస్తాడు!)

సుధా: (వస్తూనే) నేను! నేనే వేస్తాను హీరో!

రాధా: నువ్వా? నువ్వు పనికిరావు.

మధు: ఎవరు నువ్వు?

రాధా: అవునూ...ఎవరు నువ్వు?

పరం: (ఆనందంగా) సుధాకరం! వచ్చేశావా? చూశావా వీళ్ళంతా...

సుధా: చూస్తూనే వున్నాను నాన్నగారూ. (మధుతో) మిస్టర్ మధుసూదనం వురఫ్ మాయల మరాఠీ! నేనే ఆ హీరోని, అర్థం అయిందా?

మధు: నువ్వెవరు మధ్యలో?

పరం: వాడు నా కొడుకురా. ముందు మీరంతా నా యింట్లోనుంచి బయటకు పొండి—దాపురించారు శనిగ్రహాల్లాగా!

సుధా: పొమ్మంటే పోయే గ్రహాలు కాదు నాన్నా యివి. ఏలినాటి శనిగ్రహాలు. వీటి పాపం ఈ నాటితో పండింది.

రాధా: (కోపంతో కత్తి కర్రమీద వెయ్యేసి) మిస్టర్, మర్యాదగా మాట్లాడు.

సుధా: షటప్! అట్టే మాట్లాడకు. (అందరి వైపుచూసి) అందరూ వినండి. అరగంట క్రితమేవచ్చి అంతా విన్నాను. వీళ్ళిద్దరి కుట్రా అర్థం చేసుకుని, ఇప్పుడు సిద్ధంగా వచ్చాను. (రంగధామయ్యతో) ఇప్పుడు చెప్పండి రంగధామయ్యగారూ! మేం యిప్పుడు, మీరాఅంత కలిగినవాళ్ళంగాదు. నిజంగా వసంత నన్నే చేసుకోవాలని పంతం పట్టిందా? బహుశా ఇప్పుడు అబద్ధంచెప్పే అవసరం లేదనుకుంటాను.

రంగ: నేను చెప్పింది నిజం.

సుధా: అయితే చెప్పండి మీతో వసంత ఏం చెప్పింది?

రంగ: 'సుధాకరం చాలా మంచివారు నాన్నా. ఆయన్ను పొరబాటుగా అర్థం చేసుకున్నాను. ఆయన నన్ను నిజంగా హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నారు. చేసుకొంటే, ఆయన్నే పెళ్ళి చేసుకుంటాను' అంది.

పరం: మరి మొదట మావాడిమీద ఎందుకు అలా చెప్పింది?

సుధా: (సిగ్గుపడుతూ) ఆ కథ నేను చెబుతాను. పొరపాటుగా ప్రవర్తించి, ఆమె మనసు కష్టపెట్టినమాట నిజం. అందుకే ఆమె అలా చెప్పింది. కానీ, రంగధామయ్యగారు మన యింటికి రాగానే, నేను వాళ్ళింటికి వెళ్ళాను.

రంగ: ఎందుకు?

సుధా: వసంతను క్షమాపణ అడిగేందుకు. 'నిజంగా ప్రేమించాను' అని నమ్మించాను. తనూ బాధ పడింది!—ఆతర్వాత విషయం మీకు తెలిసిందే.

పరం: హారి భడవా! (మధుతో) ఏమోయ్ మధుసూదనం! యూనివర్సిటీవాళ్ళు ఊరికే ఇచ్చారంటావా ఆ రెండుముక్కల డిగ్రీ?

మధు: ఫర్వాలేదు—దీనికైనా పనికొచ్చింది డిగ్రీ!

సుధా: మరో విషయం! జాగ్రత్తగా వినండి! ఇప్పుడు చెప్పినా ఫర్వాలేదుగనుక చెబుతున్నాను.

ఆరు లక్షలు వచ్చింది మా నాన్నగారికే! రంగధామయ్యగారికి వచ్చింది నేను పంపిన టెలిగ్రాం!

రంగ: } ఆఁ! ? !
పరం: }

సుధా: పెద్దలు క్షమించాలి అంతరంగాలు కలుషితం కాకుండా, నిజమైన పవిత్రఅనుబంధాలు, అనురాగాలు తెలియాలంటే, పాపిష్టిడబ్బు అడ్డంరాకుండా వుండాలని, యింత నాటకం ఆడవలసివచ్చింది ఇప్పుడు అందరి మనస్సులూ ప్రశాంతంగా వున్నయ్‌గదా!

రంగ: (సంతోషంగా) నిజం సుధాకరం! నువ్వు నా అల్లుడు కానటునే, నాకు ఆరులక్షలుపెట్టు.

మధు: కోయ్! కోయ్!

పరం: ఛీ నోర్ముయ్! (సుధాకరంతో) ఇంకా ఎందుకురా వీళ్ళు దిష్టి బొమ్మల్లాగ ఇక్కడ, లక్కపిడత ముఖాలూ వీళ్ళూనూ.

సుధా: అవును. మరిచిపోయాను. (మధు, రాధాలతో) సారీ! మై డియర్ ఫ్రెండ్స్! మీకోసం బయట పోలీసులు వెయిట్ చేస్తున్నారు. ఇప్పటికే చాలా ఆలస్యమయింది. ఇక దయచేస్తారా?

రాధా: ఆఁ! ఒక్క విషయం. ఏమీ అనుకోపోతే చిన్నసహాయం చేస్తారా?

సుధా: ఏమిటది?

మధు: దొడ్డి తలుపు ఎటో చూపిస్తారా?

సుధా: సారీ! అటుకూడా మీ బంధువులున్నారు. నో యూజ్!

రాధా: దట్సాల్ రైట్! నెవర్ మైండ్.

మధు: (పరంధామయ్యతో) నమస్కారమండి. మళ్ళీ కలుసుకొంటాము.

పరం: (ఉలిక్కిపడి) మళ్ళానా? వద్దుబాబూ వద్దు.

రాధా: అన్నట్టు పరంధామయ్యగారూ! సినిమా...

పరం: ఛస్తే తియ్యను. మా వాడు హోటేలు వ్యాపారమే చేస్తాడు. పదిమందికి తిండిపెట్టిన పుణ్యంఅన్నా దక్కుతుంది.

(మధుసూదనం, రాధారమణ్ చేతులు పైకెత్తి నిష్క్రమిస్తారు)

రంగ: అయితే బావగారూ! నేను శలవు తీసుకోనా?

పరం: అప్పుడే వెడతారా? ఎంతమాట? కాసేపు కూర్చుని వెళ్ళండి! ఆగండి. ఆగండి...దుమ్ము దులపనీయనండి (దుమ్ముగుడ్డగొట్టి) ఆ! ఇప్పుడుకూర్చోండి.(కూర్చుంటాడు). అన్నట్టు కాఫీ తీసుకుంటారా? (లోపలికి) ఒసేవ్! రంగధామయ్యగారికి పంచదారవేసి కాఫీ చేసుకురా!

రంగ: అబ్బే ఎందుకులెండి?

పరం: అంతేలెండి! కాఫీ హోటేలే వుంది. రోజుకి ఎన్నిసార్లు త్రాగుతూ వుంటారో? (లోపలికి) ఒసేవ్! కాఫీ వద్దులే. పట్టుకు రాబోకు.

రంగ: (లేవడు నవ్వుతూ కూర్చుంటాడు)

పరం: అన్నట్టు బావగారూ! వచ్చేనెల దాటితే ముహూర్తాలూ అవీ లేవనుకుంటాను— అందుకని... (సుధాకరం మెమ్మదిగా బయటకు జారుకుంటూ వుంటాడు). ఒరేయ్! మళ్ళీ ఎక్కడికిరా నువ్వు?

సుధా: (కంగారుపడి) నేను...నేను...మరి,...మరే! నాన్నా...నేనూ...

పరం: ఎక్కడికిరా? అంటే, నసుగుతావేం?

సుధా: (చటుక్కున) ఎంప్లాయిమెంటు ఆఫీసుకు నాన్నా! ఇంటర్వ్యూ వుంది!

పరం: ఒరేఁవ్! నా కెందుకురా వినిపిస్తావ్ ఈ కథలన్నీ! నీ ఎంప్లాయ్‌మెంటు ఆఫీసు ఎక్కడో, ఇంటర్వ్యూ ఎవరితోనో నాకు తెలుసులేరా!

సుధా: (సిగ్గుపడుతూ వెళ్ళిపోతాడు.)

పరం: భోజనంచేసి పోగూడదూ?

సుధా: ఆకలిలేదు నాన్నా (సిగ్గుపడి) వసంత— టిఫిన్ తీసుకోమని, బలవంతం...(ఇక చెప్పలేక పారిపోతాడు)

పరం: } (ఉమ్మడిగా నవ్వుతారు.)
రంగ: }

(ప్రేయసిలా తెలి ముందుకు నడిస్తే, ఇంకో తెలి ప్రియుడిలా వెచ్చగా దాన్ని కవుగిలించుకుంటుంది —ప్రేమతో!)

[ఇందులోని పాత్రలు, సంఘటనలు, సంభాషణలు ఎవరికీ సంబంధించినవికాదు కేవలం కల్పితం.]

# గ్రంథ విమర్శలు

## హంతకులెవరు?

[నాటక. రచయిత: డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు. ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరురోడ్డు, విజయవాడ —2 వెల: రూ 1 50]

ఈనాడు తెలుగులో వస్తున్న నాటకాలూ, నాటికలూ చాలా ఎక్కువ. నటసమూజాలూ ప్రదర్శనావకాశాలు ఎక్కువ. రంగస్థలంమీద రక్తి కట్టటమే ప్రధానాశయంగా నాటకరచన ప్రవర్తిల్లుతూ వుంది కానీ, దృశ్యకావ్యస్థితిని అందుకొంటున్న రచనలు వ్రేళ్లమీద లెక్కపెట్టవచ్చు.

పదిహేనేళ్ల పూర్వం ఆంధ్రదేశంలో విరివిగా ప్రదర్శింపబడిన నాటకాలు ముగ్గురో నలుగురో వ్రాసినవే ఉండేవి. అలా కాదిప్పుడు. ఈమాట సాంఘిక నాటకాల విషయంలో. అంతేకాదు, చిన్న చిన్న సమాజాలకు సంబంధించింది. ఆ ముగ్గురు నలుగురులో డాక్టరు కొర్రపాటి గంగాధరరావు రచనలు మరీ విరివిగా ప్రదర్శింపబడుతూ వుండేవి.

ఆ రోజుల్లో ఈరచయిత నాటకాలు చూచినవారూ, చదివినవారు, రంగస్థలంమీద రక్తికట్టించే లక్షణాలుగల నాటకాలు వ్రాస్తున్న ఈ రచయిత ముందు ముందు, ప్రదర్శనానుకూల్యంతోపాటు ఆంధ్రదేశంతో నాలుగుకాలాలపాటు నిలవగల రచనలు చేయవచ్చునని ఆశించేవారు. ఆ ఆశ ఇంకా పూర్తిగా నెరవేరలేదు. ఈ మధ్య ఈ రచయిత రచనలు మునుపు ఎక్కువ ముద్రణ కాలేదు. ముద్రణ పొందిన రచనలు, ఆద్యరచనల అడుగుజాడలలోనే సాగాయి. నాటకం ప్రదర్శించేప్పుడు గమనించవలసిన లక్షణాలు రచనావిషయికమయినవి ఈరచయిత నుంచి పుణికిపుచ్చుకొన్న యువరచయితలు మరింతముందుకు పోతున్నారు. ఎప్పుడూ రచయితకు ఒక అటంకం వుంది. అదికాలం. కాలంమార్పును గమనిస్తూ తన రచనకు శాశ్వతత్వం సంపాదించుకొనే విధంగా రచన చేయగలగటం ఒక ప్రయత్నం—మరొకపరీక్ష!

ఈనాటకం హాయిగా ప్రదర్శించుకోవచ్చు. ప్రదర్శనానుకూలతను అన్నివిధాలా అంది పుచ్చుకొన్నది నాటకం. స్త్రీపాత్ర ఒక్కటే! కాలపరిమితి రెండుగంటలు, కాదంటే కొంచెం ఎక్కువ! నాలుగు రంగాలు! నాలుగు సెట్టింగులు! ప్రేక్షకులలో ఉత్సుకత, నాటకం చూస్తున్నంతసేపు, రేకెత్తుతుంది. ఏమిటీ సమాజం అని విపరీతమయిన ఆవేదనతో హృదయం వూగిపోతుంది. సామాన్య నాటకంగా సామాజికులలో తీసుకురావలసిన మార్పు స్పష్టంగా తెస్తుంది. నటులు నటించటానికి అవకాశం పుష్కలంగా ఇచ్చేనాటకం.

ఈనాటకంలో సాధారణంగా, ఈరచయిత తలపెట్టని ఒక కోణం దర్శింపబడింది. ఈపద్ధతి, ఈమధ్య వస్తున్న నాటకాలలో విరివిగా వుంటూ వుంది.

ప్రేక్షకులు దర్శించిన ఒక సన్నివేశం సంఘటన, రచయిత, వీలయినంతవరకూ, మళ్లీ పాత్రగతంగా చెప్పింపవలసి వచ్చినప్పుడు తక్కువగా చెబితేనే అందం. అసలు చెప్పించేతీరును మానివేస్తేనే నుంచింది. ప్రేక్షకులు నాటకం చూచేది చూడటం కోసంగాని, వినటంకోసం గాదు. వినటం చదవటం, ప్రేక్షకులు పాఠకులుగా ఉన్నచోట చూచుకోగలరు. ప్రదర్శన చూడటంకోసం రానక్కరలేదు. రారు. ప్రేక్షకుడు చూడనివిషయం అయితే కొంతవరకు వినగలడు. అదీ ఎక్కువగా ఉండకూడదు. పైగా చూచినవిషయం అయితే పాత్రలు చెప్పుకొటుంటే వినటం మరింత కష్టం! ఆ నాటక ప్రదర్శన ఫలవంతగా వుండదు.

ఈమధ్య ఒకపరిషత్తు నిర్వహించిన పోటీలలో జడ్జిగా వుండటం తటస్థించినప్పుడు తటస్థ

పద్ధ స్థితిఒకటేఉంది. మంచి నటీనటులు, మంచి ప్రయత్నంతో యాంత్రికమూ, సామూహికమూ అయిన కృషిఅంతా ఉపయోగించి సమర్థవంతంగా ప్రదర్శిస్తున్నప్పటికీ నాటకం విసుగు పుట్టిస్తూ వుంది. ఏమిటికారణం?

ప్రతి పాత్రా, ఇంకొక పాత్రతో జరిగిపోయిన విషయం, అదీ ప్రేక్షకులు ప్రత్యక్షంగా చూచిన విషయం చెప్పుకొంటూ వుంటారు. పాత్రలు ఎంత బాగా చెప్పుకొన్నా, ఎంతబాగా నటించినా, ప్రేక్షకులకు విసుగుపుడుతుంది. ఎందుకంటే అది తెలిసిపోయిన విషయం. సామాన్యజీవితంలో అయితే ఒక సంగతి వందమంది చెబుతూవున్నా ఎవరో ఒకరు, అందరుచెప్పిందీ ఆలించవచ్చు. అక్కడ ఆ మనిషికి విసుగువుండదు. ఆమనిషే నాటకం చూస్తుంటే ఒకసారి జరిగిపోయిన విషయం—తను చూచింది—పాత్రలు చెప్పుకొంటుంటే వినలేడు. అందుచేత, జీవితంవలె నాటకం ఉండాలికానీ, జీవితమే ఉండకూడదు. జీవితప్రతిబింబమే ఉండాలికాని, జీవితమే ప్రత్యక్షం కాకూడదు. జీవితంలోజరిగే అన్ని సన్నివేశాలు నాటకంలో పనికిరావు. నాటకంలోని సన్నివేశాలు అన్నీ జీవితంలోనివే కావాలి. ఈలక్షణం, ఉత్తమ నాటకరచయిత పాటించితీరాలి.

'హంతకులెవరు?' నాటకంలో లగ్జరీలాడ్జిలో హత్యజరుగుంది. కుసుమ వేశ్య ప్రత్యక్షసాక్షం. మొదటి రంగం ఉత్తమనాటకశిల్పంతో పోషింపబడిన రంగం. రెండవరంగం ఈశ్వరంఇల్లు. అక్కడా ఈవిషయమే చెప్పుకోవటం, సాక్ష్యం ఒకరకంగా మార్చేప్రయత్నం జరుగుతాయి. మూడవరంగంలో గణపతి, ఈశ్వరంతో పోటీ పడుతున్నమనిషి, మరి ఇద్దరు పెద్దమనుష్యులు, ప్లీడరు, ఈ విషయమే మాట్లాడుకొంటూ వుంటారు. సాక్ష్యం మరో రకంగా మార్చే ప్రయత్నం చేస్తుంటారు. నాలుగవరంగం కోర్టుహాలు. అక్కడా ఇదే విషయం. న్యాయం మరోవిధంగా జరుగుతుంది.

ఈ నాటకంలో మొదటిరంగంలోతప్ప ప్రేక్షకుడు ఉత్సుకతతో ఉండలేడు. ఆ విషయమే, అలతి అలతి మార్పులతో మళ్ళీ మళ్ళీ ప్రసక్తం అవుతూ వుంటుంది. ఉత్తమ రచనలు చేయగల ఈ రచయిత ఇతివృత్తం ఎన్నుకొనేముందు సరిగ్గా ఆలోచించకుండా ఎంత బాగా వ్రాసినా, ఎన్నిఅందాలూ కూర్చినా ఏం ప్రయోజనం! ఈ నాటకం ఉత్తమదశ ప్రదర్శనలో కష్టం తప్పదు.

సంభాషణలు చాలా నేర్పుగా ఉన్నాయి. చివరలో కుసుమ, న్యాయంకోసం నిజం చెప్పటంకోసం ఎన్ని కష్టాలో ఎదుర్కొని, ఎంత ఆత్మీయతనో తెంచుకొన్న కుసుమ, చివరికి పొందిన ఫలితం చూస్తే దుఃఖం వస్తుంది. అప్పుడామె పలికిన పలుకులు ములుకులై హృదయం చీల్చివేస్తాయి. అలాంటివే చివరిలో సుందరరావు మాటలు. జడ్జి, న్యాయవాదులు, ధర్మరక్షణార్థం వెంచేసిన మహనీయుడి ఉపన్యాసంకోసం, ఇక్కడ ఇంత అన్యాయం చేసిపోతున్నారు చూడు అని ప్రేక్షకులకు కసి పుడుతుంది.

తెలుగుదేశంలో విలువగల ఉత్తమ నాటకం వ్రాయగల నేర్పు, సామర్థ్యం ఉన్న ఈ రచయిత కలంనుంచి వెలువడే రచనకోసం ప్రేక్షకులు ఎదురు చూస్తూ వుంటారు.

## చీకటినుంచి

(వచన కవితల సంపుటి. కవి: శ్రీ నూతలపాటి గంగాధరం. ప్రతులకు: కళాసాహితి. 83, లేక్ వ్యూ రోడ్, మద్రాసు—33. మూల్యం మూడు రూపాయలు.)

శ్రీ నూతలపాటి గంగాధరం యువకవి. భావం, ఆవేశం, భావావేశం, తీవ్రంగాగల వ్యక్తి. కవితారంగంలో కాలిడుతున్న మనిషి.

కవితావస్తు స్వీకారంలోనూ, తన్నిర్వహణలోనూ, రచయిత కవితా హృదయం వ్యక్తమవుతుంది. భవిష్య దాంధ్రదేశంలో పరిఢవిల్లబోయే ఒక కవి బాల్యం ఈ సంపుటివల్ల అందరికీ తెలుస్తుంది.

స్వీకరించిన ఇతివృత్తం చెప్పేతీరులో అందాలు సంతరించి, రసహృదయులను అలరించే కవితాశక్తివున్న పంక్తులు ఈ సంపుటిలో చాలా ప్రత్యక్షం అవుతాయి. 'కాలం' శీర్షికలో 'సర్వవస్తువుల నిజ స్వరూపాలను—శాంతంగా, సాంతంగా, ఎత్తి

చూపే సి. ఐ. డి. ఇన్స్పెక్టర్ (ఇన్స్పెక్టర్?) ఈ కాలం' అనీ, 'చీకటినుంచి' శీర్షికతో 'ఏమిచేసినంత మేలు, కలిమి-ఏ వాడూ చెయ్యడు నీకు' అనీ విద్యుత్తు (అంటే ప్రాణం)లో, 'అర్ధరాత్రి ఫ్యాక్టరీలో విద్యుత్తు ఎప్పుడు ఆగిపోతుందో ఎవరికి తెలుసు ఒకని విశ్రాంతి మరొకని పరిశ్రమకు నాంది' అనీ కవి పలుకుతుంటే, జీవితంగూర్చి ఈ కవి కలిగిఉన్న దృక్పథం రసజ్ఞులకు అర్థంకాకుండా పోదు.

'ఈ ఊరు, మా వూరు' కవిత హృదయం నుంచి ఉబికివచ్చిన రచన. ఈ గేయరచనకు పునాది హృదయం. ఆ హృదయం పరిభ్రమించిన వూరు. ఈ శీర్షికలో ఆవేశంలేదు. అతిశయోక్తిలేదు. ఇటువంటి ఊళ్లు ఆంధ్రదేశంలో, ఆ మాటకొస్తే భారతదేశంలో అనంతంగా ఉన్నాయి.

ఈ ఊరిలో
అప్పిచ్చువాడు లేడు
వైద్యుడూ లేడు,
ద్విజుడూ లేడు
ఎడతెగకపారే ఏరూ లేదు
ఏమీలేదు.
ఇది మా వూరు.

ఇది చదవగానే నీతిపద్యం 'అప్పిచ్చువాడు వైద్యుడు......' పద్యం గుర్తుకు వస్తుంది. ఆ వూరులో ఉండకూడదనీ చెప్పబడింది. ఇటువంటి గ్రామాలలో, ఈనాడు స్వాతంత్ర్యం వచ్చిన ఇంత కాలం తర్వాత కోట్ల ప్రజలు నివసిస్తున్నారు. అందులోనే......

ఈ ఊరు—
నింగి రాతితోచేసింది,
నేల ఉక్కుతోనిర్మించింది
ఒక్కచుక్క వర్షంపడదు.
ఒక్క గింజ ధాన్యంపండదు.

ఈ పాదాలు చదువుతుంటే, కవి ప్రతిభ గోచరిస్తుంది. ఆవూరు నింగి, రాతితో చేయబడిందిట. అందుకనే ఒక్కచుక్క వర్షం పడదు. ఈ వూరునేల ఉక్కుతో నిర్మింపబడిందట. కాబట్టి ఒక్క మొలక పుట్టటం లేదు. ఒక్కగింజ పండటం లేదు.

ఈ గేయంలో మొదటి పాదాలు వ్యుత్పత్తి ఫలితాలు. తనకు తెలిసిన పద్యం కొంచెంగా చమత్కరిస్తే అవతరించిన వాక్యాలివి. అయితే అనంతర పాదాలతో ఆత్మగతప్రతిభావిష్కృతి జరిగింది.

ఇటువంటి ప్రతిభ ప్రదర్శించే కవితలు ఈ కవి కలంనుంచి వెలువడతాయని ఆంధ్రులు ఎదురు చూస్తారు. అయితే ఈసంపుటిలోమాత్రం ఆధునికాంధ్ర కవులలో ప్రసిద్ధులయిన అనేకులను తలపించే ఖండికలూ, వాక్యాలు కొల్లలుగా ఉన్నాయి.

'చీకటినుంచి' అనే సంపుటి పేరు, 'అనాది కొసనుంచి అనంతత్వంలోకి' అనే శ్రీ బోయి భీమన్న రచన కవితలసంపుటి పేరునూ, 'ఈ ఉదయం తప్పక ఉదయిస్తుంది' అనే ఖండిక, 'ఉదయించని ఉదయాలు' అనే శ్రీ కేశవరావ్ కావ్యనామధేయాన్నీ, 'శ్రమజీవి,' 'ఇంకా ఏమీ చెయ్యలేక జీవితంలో' అనే శీర్షికలు శ్రీశ్రీ కవిత్వాన్నీ, 'ఆ!' అనే ఖండికనూ, 'పసిడి పలుకులు'—శ్రీ దాశరథి 'బాల్యం'నూ, 'మృత్యుముఖద్వారం'— శ్రీ జాషువా 'శ్మశానవాటిక'నూ గుర్తుకు తెస్తున్నాయి. ఇటువంటి కవితలు—ఇతర కవుల ధోరణులు గుర్తుకు వచ్చేట్లుగా కాకుండా ఈ కవి కవితా రచన చేయాలని పాఠకులు కోరుకొంటారు.

'కాన్వర్స్', 'ఆశాపాశం', 'కవితాకన్య', 'ఈ ఊరు మా ఊరు', 'కొన్ని (వా)స్తవాలు', ఈ సంపుటిలో మళ్లీ మళ్లీ చదవాలనిపించే కవితలు.

'నిండని కుండ'లో
నిండనికుండ తొణుకుతుంది, నిజం!
ఎప్పుడు?
ఎవరైనా కదిపినప్పుడు —
నిండుకుండమాత్రం తొణకదా?
నిశ్చలంగా ఉంచేస్తే,
ఏదిమాత్రం ఎందుకు తొణుకుతుంది?

ఈ సమన్వయవాదంలో ఎంత తిరుగుబాటు ఉందో పాఠకులు చక్కగా ఊహించుకోగలరు.

'శ్రమజీవి'లో

'కన్నుమూసినవాడికన్నా పుట్టబోయేవాడు ధన్యుడంటాం—ఇకముందు ! !' కవికి భవిష్యత్తుపై గల ఆశకు పాఠకులు ఆనందం చెందుతారు. 'ఆశాపాశం'లో ఆశకు నిర్వచనం చూడవచ్చు.

'సాధనాల సహాయంతో
ఆకాశాని కెగిరే ప్రయత్నమే—ఆశ'

'ఉక్కు మనిషి'లో లాల్‌బహదూర్ శాస్త్రి సంస్మరణ ఆనందకరంగా వుంది!

'అభ్యుదయం'లో
'అడగకే అప్పిచ్చు
అంబుధి ఈ నాడు
అయిపోయె కొసిరేటి
అంగట్లో కోమటీ!'

'అప్పిచ్చులో' అందం ఆ పైన వ్యంగ్యమయింది. స్పష్టతకూడా తగ్గింది.

కవితారూపం, నన్నయకాలంనుంచి ఆధునిక యుగందాకా అనేక పరిణామాలు పొందిందని కవి చాటి చెప్పటం బాహాటంగా కనిపిస్తుంది. ఈ సంపుటిలో ఆది ఈ కవి కవితాస్థితి అర్థం చేసుకోటానికి చేస్తున్న ప్రయత్నం.

ఈ కవికి ప్రతిభ ఉందని 'చీకటినుంచి' వచన కవితల సంపుటి తెలుపుతుంది. లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణం అయిన వ్యుత్పత్తి ఆర్జించుకొనే కృషి అర్థమవుతుంది. ఈ రచన చక్కని అభ్యాసం! సమగ్ర జీవిత దృక్పథంలో ఈ కవి రచించే కావ్యం కోసం రసజ్ఞులు ఎదురు చూస్తారు.

## మ న సు లో మ ని షి

[రేడియో నాటికలు, ఏకపాత్ర వాక్చిత్రణలు. రచయిత: కీ. శే. అట్లూరి పిచ్చేశ్వరరావు. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. ఏలూరు రోడ్డు, విజయవాడ. వెల: రూ. 1-20.]

ఒక రచయిత గతించిన తర్వాత, ఆ వ్యక్తి రచనలపట్ల పాఠకలోకంలో ఆదరణ కలిగించటం కోసం, ఆ రచనలు ఒక్కచోట చేర్చి భవిష్యత్తరానికి అందించటంకోసం, మంచిసంస్థలు ప్రయత్నించటం ప్రశంసాపాత్రమైన కృషి. ఆ కృషి విశాలాంధ్ర ప్రచురణాలయం చేసింది.

అయితే, ఏ రచయిత అయినా సృష్టించిన రచనలు అన్నీ ఉత్తమమయినవిగా భావించటానికి అవకాశం తక్కువకదా ! పఠితృలోకానికి ఒక రచయితపై కల్గిన అభిప్రాయం, పోషింపగల రచనలు మాత్రమే సంపుటీకరించటం సమంజసం.

ఈ సంపుటిలో ఉన్న అన్నిరచనలు ఉత్తమమయినవికావు. ఈ రచనలలో ఏవీ ప్రదర్శనకోసం ఉద్దేశించినట్లు కనిపించవు. ప్రసారంకోసం ప్రత్యేకింపబడినట్లుగానే ఉన్నాయి.

కాలక్షేపంకోసం చదువుకోవటానికి రచనలు బాగున్నాయి. రేడియోలో ప్రసారం చేయబడితే రుచింపవచ్చు. కష్టపడి ప్రదర్శిస్తే చూడటానికి తగినవి కావచ్చు అయితే ఈ నాటికలలో, వాక్చిత్రణలలో నాటకీయత అత్యల్పం.

'నిగమశర్మ' 'వరూధిని' ఏకపాత్ర వాక్చిత్రణలు. ఈ రెండు పాత్రలనుగూర్చి, ప్రసిద్ధ, ప్రబంధాలు చదువుకొన్న పాఠకులు ఏర్పరుచుకొన్న అభిప్రాయంతో కీ. శే. అట్లూరి పిచ్చేశ్వరరావు ఏర్పరుచుకొన్న భావం భిన్నంగా ఉండవచ్చు. పెద్దన వరూధిని కలిగించే ఆనందం ఈ వరూధిని కలిగించదు. అలాగే నిగమశర్మ. ప్రసిద్ధులు పరమార్థ రమణీయంగా చిత్రించిన పాత్రలను ఏ విధంగానూ సర్వజనామోదకరంగా ఆధునికులు మళ్ళీ సృష్టించలేరనటానికి పై రెండు వాక్చిత్రణలు సరియైన ఉదాహరణలు.

'గతానుగతాలు'లో అమ్మ లోకంలోని అమ్మే! శేఖర్‌వంటి హృదయవాదులుంటారా? ఉండవచ్చు! వేణులాంటి లౌకికులుంటారా! లేరనటం కష్టమే! స్వర్ణవంటి కన్య అంతగా బరితెగించి మాట్లాడుతుందా? వృద్ధి విశాలమయింది మరి. మాట్లాడితే మాట్లాడవచ్చు! సరే, లోకంలోని మనుష్యుల్నే పాత్రలుగా స్వీకరించి రచయిత సాధించిందేమిటీ రచనతో? ఏం చెప్పదలుచుకొన్నట్లు! పెళ్ళినిగూర్చి, రెండు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేయటమే దృష్టయితే, అది నెరవేరింది. అంతకంటే చెప్పిందేమీ లేదు. ఒక్కొక్క విషయాన్నిగూర్చి ఎందరెందరో

ఎన్నెన్నో అనుకొంటారు, అన్నీ ఈ విధంగా వ్రాయటం ప్రారంభిస్తే రచనకు అర్థం పర్థం లేకుండాపోయే అవకాశం వుంది.

అహింసను ప్రచారంచేసిన అనేకులు హింసకు గురికావటం చరిత్ర చెప్పే సత్యం! క్రీస్తు, గాంధీ, లింకన్ ఇంకా ఎందరో! 'కుశీనగరం'లో బుద్ధుడు, జంతుహింస కూడదనే మానవతావాది మాంసం తిని ఆరోగ్యం పాడై, మరణించేముందు, మరణించిన తర్వాత, చరిత్ర చాటిచెప్పిన అహింసావాదనారాధన గోచరమవుతుంది. స్థలమాహాత్మ్యం చెప్పటానికి తయారయిన ఈ నాటికలో, ఆకాశవాణి ధ్యేయ మయిన, 'బహుజనహితాయ, బహుజనసుఖాయ' బాహాటంగా వినిపిస్తుంది. రేడియోలో వినిపించి వుంటుంది. ఒక తాత్త్వికసమన్వయం చేయటానికి అధిక్రమతో ఆవిర్భవించిన రేడియో నాటిక 'కుశీనగరం'.

'వింతప్రక్రియ' నిజంగా వింతప్రక్రియ. మృత్యువును డబ్బుతో జయించాలని ప్రయత్నించే ధనంజయరావు మృత్యుంజయరావు కాకపోవటమేకాక, సుందరరావు మాట్లాడేతీరు, లీల లీలావినోద వ్యవహారం, డాక్టరు కృషి, అన్నీ వింతగా వుంటాయి. ఇతివృత్తం, పాత్రలు, అంతా ఒక వింతప్రక్రియ వైపు సాగిపోయేవే అయినా స్త్రీ పురుష సంబంధంలో ఒక నూత్నత దర్శించాలని కుతూహల పడ్డ నాటిక వింతప్రక్రియ. 'గతానుగతాలు'లో స్వర్ణ ప్రౌఢఅయితే వింతప్రక్రియలో లీల అవుతుంది. సుందరరావు ప్రవర్తన సహ్యమో, అసహ్యమో స్పష్టంగా తేలదు. ధనంజయరావు లీలల సంబంధం అంతస్పష్టంగా లీల ముఖతః చెప్పించటం ఉచితమో, అనుచితమో రచయిత ఆలోచింపలేదు.

ఈ సంపుటిలోని నాటికలలో 'మనసులో మనిషి'—అదే ఈ సంపుటి పేరు—ఉన్నంతలో ఉత్తమమయింది. స్త్రీ పురుషుల రాగద్వేషాల సారం పరికించాలని ప్రయత్నించిం దీ నాటిక. శంకరం గుమాస్తా. కాంతారావు మిత్రుడు. కాంతారావు దూరదేశంనుంచి వచ్చాడు. శంకరం భార్యను చెల్లిగా భావించుకొని, సంతోషంగా సరదాగా ఉన్నాడు. ఆ సరదాను శంకరం అపార్థం చేసుకొన్నాడు. అందుకని శంకరం, తన భార్య సరళను బావిలో పడి చావ మన్నాడు. ఆమె చచ్చిపోయింది అలాగే! భర్త చచ్చిపొమ్మన్నంత మాత్రాన ఎంత పతివ్రత అయినా చచ్చిపోతుందా ఈ కాలంలో! సరళ, తప్పుచేయక పోతే, ఆమె మనసులో ఉన్న మనిషి కాంతారావులో కనిపించకపోతే, గుమాస్తా శంకరంనుంచి కోరిన ఆనందం పొందలేక ఇక పొందటంకూడా అసాధ్యం అనుకోకపోతే ఆమె చనిపోతుందా? చావు అంత తేలికగా వస్తుందా? ఆమె చనిపోవటంతో రచయిత సాధించిన కవితాధర్మం ఏముంది? పాఠకులకు కలిగే చాలా ప్రశ్నలకు సమాధానం దొరక్కపోయినా, ఈ రోజుల్లో వస్తున్న చాలా నాటికలు మాదిరిగానే ఇదీ ప్రదర్శిస్తే ఫరవాలేదనిపించవచ్చు.

కీ॥ శే॥ అట్లూరి పిచ్చేశ్వరరావు రచనలు ఇంతకుపూర్వం, ఇతర ప్రక్రియలలో చదివిన పాఠకులు ఈ రచనల్లో ఏవిధమయిన జీవిత దృక్పథం వ్యక్తంచేసిందీ చూడాలని ప్రయత్నించటం, వ్యర్థ ప్రయత్నం. ఎందుకంటే ఈ రచనలలో మహార్థం నిక్షిప్తం చేస్తున్నానని రచయిత తలంచినట్లు భావించనక్కరలేదు. ఇవి రేడియోకోసం వ్రాయబడ్డ కాలక్షేపం రచనలు. ఎన్నోవిధాల రచనలు అచ్చు వేస్తున్న ప్రకాశకులు ఈ రచనలు సంపుటీకరించటం వలన క్రొత్తగా కలిగే మేలేమీలేదు.

## విరహవీణ

(గేయకావ్యం. కవి: శ్రీ టి. రామకృష్ణారెడ్డి. ప్రచురణ: ప్రత్యూష, సాహితీ సాంస్కృతిక సమితి,

హైదరాబాదు. ప్రతులకు : (శ్రీసదనము, పీల్‌ఖానా, హైదరాబాదు—12. మూల్యం రెండు రూపాయలు.)

'కవి తన హృదయమునాకర్షించిన యువతిని మనసార ప్రేమించినాడు. కాని సంఘ సంప్రదాయములు దానికంతరాయము కల్గించినవి. ఆ కారణమున కల్గిన విరహవిహ్వల కావ్యము రూపమున వెల్లివిరిసినది'—ఆచార్య దివాకర్ల వేంకటావధాని.

'ఆత్మాశ్రయ (భావలేక ప్రణయ) కవిత విధానాన్నే ప్రమాణంగా తీసుకొని వ్రాసినాను'—కవి. ఈ కావ్యం' ప్రతిభా వ్యుత్పత్తులు ప్రసాదించిన భగవంతుని పాదపద్మములకు' అంకితమీాబడింది.

కవి మాటల్లో ఈ కావ్యం ఆత్మాశ్రయ కవితా విధానం మాత్రమే! అయితే ఆచార్యుల ఆశీస్సుల ప్రకారం ఇది ఆత్మేతివృత్తం.

ఇందులో కథ చిన్నది. కవిత దొడ్డది. ప్రేమికుడు ప్రియురాలి విరహంతో పొందిన అనుభూతి కవిచే వరి ంపబడింది. కవి హృదయం సుకుమారమయింది. అందుచేత కవితలో సౌకుమార్యం వుంది. సంయోగంకంటే వియోగం ఆనందం కలిగింపవచ్చు వియోగంకంటే అయోగం ఆనందం అందీయవచ్చు. ఈ కావ్యంలో వియోగం కంటే అయోగం ప్రసక్తం.

ఏడాది పొడుగునా ప్రేమికుడు పొందిన విరహవ్యథ వర్ణింపబడింది. ఒక్కొక్క సమయంలో ప్రియురాలు ఎదుట ఉన్నట్లుగానే ప్రేమికుడు తలపోసేవాడు. ఒకప్పుడు జాగ్రదవస్థలో మరొక్కప్పుడు అజాగ్రదవస్థలో ప్రియురాలి సాక్షాత్కారం అవుతూ వుండేది. ఋతూచిత వర్ణన కావ్యంలో గోచరమవుతుంది. పునరుక్తి కావ్యంలో సామాన్యంగా కనిపిస్తూ వుంది అనిపించవచ్చు. అయితే విరహమే పునః పునఃపునః—అంతులేదు కాబట్టి పునరుక్తి దోషం ఈ కావ్యంలో లేదు.

ప్రేయసీ ప్రియులు కలుసుకొన్నది చాలా తక్కువసార్లు.

'సంభ్రమానంద సంచలితుండనై నేను
వలుదెసలు నీకొరకు తిలకించుచుండగా
'ఇదిగొ నే నిచట'యను మృదుకంఠమును వింటి
వెనుదిరిగి నీదు మోహనరూపమును గంటి'

తొలినాడు మన వలపు వలిగాలి సుకమటులు
పంచేంద్రియముల వ్యాపించి పనుపొగయించె
దినదినము క్రమముగా మన తమా మధుర పం
స్పర్శానుభూతులన్ స్వర్గములె కుసుమించె'

'మొదటి దినములు కొన్ని మురిపించు స్వప్నముల
తో గడచె; మరికొన్ని తొలివలపు మలిసిగ్గు
తో నడచె; కొన్నినాళ్లైన సుఖపడనీక
నీలివిధి ఎడబాటునట్టేటిలో విడిచె'

'దోర మాగిన పండ్లనూరించు కొనుచు తిని
ఆటలాడితిమి హృదయాలు వలపు కురియ'

ఆ ప్రేయసీ ప్రియులు సంతోషంగా గడిపిన దినాలు గుర్తుకువచ్చి ప్రియుడికి దుఃఖం గట్లు తెగి పొంగి పొర్లుతూ వుంది. వారిద్దరికీ ఎడబాటు జరిగింది. అది ఆమెకూ ఇష్టంలేదని ప్రేమికుడి వూహ! ఆమె ఎప్పుడయినా ఎదురై,

'హాయిగా ఆడుదము తీయగా పాడుదము
నాకనుష మాస్వప్నలోకమున తేలుదము
ఏల ఈ వైరాగ్యకీలలో వయసంత
వేల్చెదవు? చాలు సఖ! ప్రాల్చకుము మనవంత'

అని పలికితే,

'వల దిచట శ్రుతి గలిపి పలికింపకుము వీణ
అలనాటి వలపంత తలపింపకుము జాణ॥ అనీ,
'బ్రతుకంత ఎడబాటు వెతలతో గడచినది
కలగుండువడి ఎడద శిలవోలె మారినది' అనీ

కఠినంగా మాట్లాడాలని అభిలాష వుంది ప్రేమికుడికి. అంతే కాదు. ఆమె రావాలనీ ఆశ వుంది. రాదేమోనని భయం వుంది. వచ్చినా, తను అనుకొన్నట్లుగానే పలికినా, ఆమె అపార్థం చేసుకొంటుందేమోనని, తన తప్పులేక పోయినా, భయపడే సుకుమారుడు ప్రేమికుడు.

అందుకే,

'ఎచటని, ఎపుడో నీ వెదురుపడినపుడు నను
'ఎటులుంటి'వని పల్కరింప నే నేమందు?

ఈ సమాజపు చెరను ఎటులో బ్రతికెడి బంది
నని బదులు పల్కని నీ వన్నతి మనుకొందువో'

ఆమె ఎదురుపడి పలకరించిందాకా ఎందు కాగటం, నువ్వేపోయి, ఆమెను పలకరించి రాకూడదా అని ఎవరయినా అడుగుతారేమోనని ప్రేమికుడు చెప్పే సమాధానం—'ఆత్మదఘ్నాభిమానధనుండ!'

ప్రేమికుడికి చేతనాలు అచేతనాలుగా, అచేతనాలు సచేతనాలుగా గోచరించటం ఆరంభమయింది. విరహవ్యథతో తనే వీణ అయిపోయాడు. విరహ గీతాలాపన సాగింది. ఆ స్థితి ఉచ్చదశకు చేరుకొంది. 'ఈ యఖిలవిశ్వగతవస్త్వంతరమ్ములు భవద్రూపమయము' అనుకొనే దశకు చేరుకొన్నాడు.

ప్రేమికుని విరహవ్యథ కవి శ్రీ టి. రామకృష్ణారెడ్డి రచించిన తీరు రసజ్ఞులకు ఆనందం కలిగిస్తుంది.

భాష బాగుంది. మాత్రాచ్ఛందస్సహిత రచన ఈ కావ్యం. విరహం విపులంగా వర్ణింపబడింది. ఛందస్సుకోసం కొన్నిచోట్ల అనవసర పదాలు ప్రయోగింపబడ్డాయి. కొన్నిచోట్ల భావం బరువు తగ్గి పేలవంగా వుంటుంది. ప్రథమ ప్రయత్నం లోనే సముచితస్థానం ఆర్జించుకొన్న ఈ కవి ముందుముందు డా॥ సి. నారాయణరెడ్డి పలికినట్లుగా 'ఒక రసవత్కృతి వెలువరించాలని (అందరి) అంతరంగం అభిలషిస్తుంది.'

—రవి.

## స్రోతస్విని

శ్రీయుతులు పరాశరం గోపాలకృష్ణమూర్తి, ముదిగొండ వీరభద్రయ్య ఖండకావ్యాల సంకలనం. పుటలు—112. వెల : 2-00 ప్రాప్తిస్థానం—రచయితలు — ప్రభుత్వ కళాశాల, సిద్దిపేట, మెదకుజిల్లా.

## దేవీ మానస పూజ

ఖండకావ్యం. రచయిత—శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ, పుటలు—46. వెల : రూపాయి. ప్రాప్తిస్థానం—శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ, సిద్దిపేట, మెదక్‌జిల్లా.

## నారద సంచారం

పిల్లల నాటిక. రచయిత — శ్రీ అన్నపర్తి. పుటలు—24. వెల : 0-50. ప్రాప్తిస్థానం—ఆనందబాలప్రచురణలు, గుంటూరు-4.

## కర్తవ్యం

పిల్లల నాటిక. రచయిత-శ్రీ అన్నపర్తి. పుటలు—30. వెల-0-50. ప్రాప్తిస్థానం-ఆనంద బాల ప్రచురణలు, గుంటూరు - 4.

## హేపీ న్యూస్

పిల్లలకోసం—ఆంగ్లంలో నాటికలు. రచయిత—శ్రీ అన్నపర్తి. పుటలు—24. వెల—0-50. ప్రాప్తిస్థానం—ఆనందబాలప్రచురణలు, గుంటూరు—4.

## రామ తారక సుధ

రామకథ తెలిపే చిన్నకావ్యం. రచయిత—శ్రీ వడ్లపట్ల రామచంద్రయ్యచౌదరి. పుటలు—44. వెల—లేదు. ప్రాప్తిస్థానం—వడ్లపట్ల మురళీకృష్ణరావు, క్రొవ్వలి, ఏలూరు తాలూకా.

## పృథ్వీరాజు

చరిత్రాత్మక పిల్లల నాటిక. రచన—శ్రీ అన్నపర్తి. పుటలు—44. వెల—0-75. ప్రాప్తిస్థానం—ఆనందబాలప్రచురణలు, గుంటూరు - 4.

## భారతీయత

మొదటి అధ్యాయం. రచయిత—శ్రీ చివుకుల వేంకటరమణశాస్త్రి. పుటలు—120 వెల—అమూల్యం. ప్రాప్తిస్థానం—రచయిత, వేమూరు, గుంటూరుజిల్లా.

## నారాయణీయం

ఏకాదశగుచ్ఛం, అలంకార ప్రకరణం. రచయిత—డాక్టర్ అడుసుమల్లి నారాయణరావు, పుటలు—338 వెల—6-00. ప్రాప్తిస్థానం—ఆంధ్రనలంద, గుడివాడ, కృష్ణాజిల్లా.

## కామేశ్వర తత్త్వం

సంస్కృత రచన. దీనిలో కామేశ్వర తత్త్వం, కామేశ్వర పంచరత్నం, హిమనందినీ స్తోత్రం, మంగళశ్లోకః — అనేవి వున్నాయి. రచయిత — శ్రీ కలపటపు భాస్కరరావు. పుటలు – 26. వెల లేదు. ప్రాప్తిస్థానం — మేనేజర్, కామేశ్వర గ్రంథమాల, కొర్లగుంటరోడ్, తిరుపతి.

## తృణ కోణాలు

ఖండకావ్యసంపుటి. సంకలనం — శ్రీ మురళీధర్. పుటలు – 70. వెల - రూపాయి. ప్రాప్తిస్థానం — శ్రీ మురళీధర్, C/o శ్రీ టి. రాజేశ్వరరావు, కరస్పాండెంట్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, వరంగల్ – 1.

## కనాపురం ఆంజనేయ శతకం

రచయిత — శ్రీ ఓరుగంటి నారాయణప్ప. పుటలు - 42. వెల – 0 – 30 ప్రాప్తిస్థానం — శ్రీ ఓరుగంటి నారాయణప్ప, వేంకటేశ్వరఫిలిప్స్‌దగ్గర, గుంతకల్లు, తిమ్మనచెర్ల పోస్టు, అనంతపురంజిల్లా.

## సంకెళ్లు

గేయకవితా సంపుటి. రచయిత — శ్రీ కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు. పుటలు – 20. వెల – 0 – 50. ప్రాప్తిస్థానం — స్నేహపీఠం, ఏలూరు – 2.

## త్రిశంకు స్వర్గం

కవితా సంపుటం — రచయిత — శ్రీ కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు. పుటలు – 16. వెల – 0 – 50. ప్రాప్తిస్థానం — స్నేహపీఠం, ఏలూరు - 2

## సంధ్యావందన తత్త్వ ప్రదీపిక

రచయిత : శ్రీ పాణ్యం లక్ష్మీనరసింహయ్య. పుటలు – 92. వెల 1 – 00. ప్రాప్తిస్థానం శ్రీపాణ్యం లక్ష్మీనరసింహయ్య, ఉయ్యాలవాడ, కర్నూలుజిల్లా.

## తిరుమలరాయ శతకము

రచయిత : శ్రీ వి. వీరభద్రాచారి. పుటలు – 44. వెల – 1 – 00. ప్రాప్తిస్థానం – శ్రీ వి. వీరభద్రాచారి, కనగానపల్లె, ధర్మవరం తాలూకా, అనంతపురంజిల్లా.

## స్వాతంత్ర్య భారతి

కావ్యసంకలనం — పుటలు – 16. వెల – 0 – 50. ప్రాప్తిస్థానం — స్నేహపీఠం, ఏలూరు — 2.

## పుష్పాభిలాష

ఖండకావ్యం, రచయిత – శ్రీ వడ్డి కృష్ణమూర్తి, పుటలు – 24. వెల – ఒక రూపాయి ప్రాప్తిస్థానం — ఓంప్రకాశ్ ప్రచురణాలయం, జవారుపేట, మచిలీపట్టణం - 1.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad.